

సంపుటము 19
సంచిక 11

# భారతి

చిత్రభాను కార్తికము
1942 నవంబరు

## శరత్ప్రభ

— శ్రీ పాలెపు వేంకటరత్నము —

దేవీసమర్చనాధీనమనస్కయౌ పుణ్యాంగనాపరిపూతశక్తి
పుస్తకశారదాపూజావిధానలోలుపుఁ డైన విద్యార్థిరూఢబుద్ధి
విల్లమ్ములు ధరించి వేడుకఁ బప్పుబెల్లాలకై యరుగు బాలకుని దీక్ష
తలుపుచాటున నక్కి ధవునియాస్యము త్రపాభరమునఁ గను నూత్నవధువుసొగసు
కాంచి తలయూఁచి విమలాస్యకంజ మొప్ప—కంకణక్రేంకృతులతోడఁ గరము నెత్తి
ప్రేమ దీవించు శారదవేళలందు—పరమకల్యాణి మాతల్లి గిరికుమారి.

వెల్లదామరపూవు లుల్లసిల్లిన రమాశ్యామానివాసంబు లగు సరసులు
తెల్లగాఁ బూసిన రెల్లుపూవులచాలు విలసిల్ల నొప్పెడి పొలముగట్లు
కలఁకదొలంగి నిర్మలమనోగతి నొప్పు స్వచ్ఛంబులగు ధునీ సంచయములు
పుచ్చపూవులరీతిఁ బూర్ణసుధాకరకాంతియుక్తములైన క్రమనిశలు
భక్తసంచయములకు సధ్వన్యులకును - కవికిశోరంబులకుఁ బ్రౌఢకాంతలకును
నిర్మలానందనవకళానిధులఁ గూర్చెఁ - బావనములైన యీ శరత్పర్వములను.

పూర్వాంధ్రరాజన్యభుజశక్తి శత్రుసంహారకేళీరతిఁ గేరియాడె
కావ్యకన్యక ధరాకాంతుల దరహాసకౌముదీరుచులఁ బుల్కలు వహించె
సంగీతపీయూషసారంబు తెల్గురాజుల కొల్వుకూటాలఁ దొలఁకి పాఱె
భరతోక్తగతి నాట్యభామ ధింధిమి యంచు నూపురారావమనోజ్ఞ యయ్యె

పసిఁడిటంకాలు సెల్లాలు పల్లకీలు - అగ్రహారాలు నిరుపమానాదరమున
నందుకొన్నాఁడు నృపసభామందిరముల - మన తెలుఁగుకవి యాశరన్మహాములందు.

ఖునీ మిూటక బరరాజదుర్గములపై ఘోరాజులం జల్పి నాఁ
డసమానాద్భుతశౌర్యసాహసము లాహా! వుట్టఁగాఁ జేయ నే
'యసరా' పొందక స్వీయబాహుబలమర్యాదం బ్రదర్శించి యీ
'దసరా రోజులు' నాంధ్రభూపతి ప్రమోదం బొప్పఁ గొల్వుండెడిన్.

దుమికించినారు మార్తురగుండె ప్రీలఁగా గుఱ్ఱాల డెక్కలఁ గుతల మ్రదువ
జళిపించినారు శత్రులు దద్దరిల్లఁగా ఖడ్గాలు వైద్యుత కాంతు లొప్ప
కురిపించినారు దిక్కులు పిక్కటిల్లఁగా శరపంక్తి వైరి వక్షములు పగుల
చవిచూపినారు పిశాచసంఘమునకు శత్రుమాంసాస్రముల్ శక్తికొలఁది
తెలుఁగుజోదులు తమ బాహుబలముఁ జూపి - యెదిరి సైన్యాలు వెన్నిచ్చి యేపువీడి
పఱచినను గాని పోనీక తఱిమి తఱిమి - చూఱఁగొన్నారు జయలక్ష్మి పోరితముల.

శత్రురక్తస్రవంతిలో స్నానమాడి - యాంధ్రఖడ్గము తళతళలాడునాఁడు
మండివెలిఁగిన భండనోద్దండపటిమ - గండశిలలలో నొదిఁగి పన్నుండె నేమొ?

పెన్నానదీతీరపృథివి గంటము కత్తి జోడుగా నడచిన జాడ గాంచి
గౌతమీతీరానఁ గదనంబు కైతయుఁ గూడిమాడి చరించు పోఁడిమి గని
తుంగభద్రాసముత్తుంగభంగములందు ప్రతిఫలించెడు శిల్పభంగిఁ జూచి
కృష్ణాస్రవంతికోర్మికలందు నినదించు నాంధ్రపౌరుషగీతు లాలకించి
ప్రస్తుతాంధ్రుల యుడిగంపుఁ గస్తిఁ దెలిసి - మనసు విస్మయవార్నిధి మగ్నమైనఁ
బండువెన్నెల నవ్వుతోఁ బరిహసించు - చక్కఁదనములసీమ యీ చందమామ.

నాఁటి నరపాలదాతృతాపాటవంబు - తెలుఁగుకవుల స్వతంత్రతా దివ్యదీప్తి
చిత్రశిల్పకళాసమంచితయశస్సు - వీటిఁ బోయెనుగద తెల్గునాట నేఁడు.

కృష్ణరాయలు రాజనరేంద్రవిభుఁడు - శారదోత్సవముల సభాశాలలందు
పంతరించిన సత్కళాసౌష్ఠవంబు - తిరిగి విలసిల్లునా మన తెలుఁగునేల?

---

# దక్షిణదేశభాషలు - అందలి ప్రాచీన సారస్వతము

౨

= శ్రీ కోరాడ రామకృష్ణయ్య =

ఆంధ్రవాఙ్మయచరిత్రలో ప్రాఙ్నన్నపార్య యుగమునందలి యాంధ్రభాషావాఙ్మయ స్వరూపపరిణామక్రమము నన్వేషించి తెలిసికొనదలచిన సందర్భమున నితరదక్షిణదేశభాషావాఙ్మయ స్వరూపజ్ఞానము మన కెంతయు తోడ్పడగలదను విషయము వెనుకటివ్యాసమునుబట్టి మనకు గొంత దెలియవచ్చియున్నదిగదా. ఈ యజ్ఞాతయుగమును రెండు భాగములుగా జేయవచ్చును. ఒకటి క్రీస్తుశకము ఏడవ శతాబ్దికి బూర్వపుది; రెండవది ఏడవ శతాబ్దినుండి నన్నయకాలమువరకు, అనగా ౧౧-వ శతాబ్దివరకు గలది. ఈ రెండవభాగము నాంధ్రశాసనకాల మని చెప్పవచ్చును. ఈ కాలమున నాంధ్రమందు గద్యములలోను, పద్యములలోనుగూడ రచింపబడిన శాసనములు మనకు లభించియున్నవి. ఇవి చాలవఱకు చాళుక్యచోళరాజులకు సంబంధించినవి. అంతకు బూర్వమున గల శాసనము లన్నియు సంస్కృతమునను, ఇంకను పూర్వపుశాసనములు ప్రాకృతముననను రచింపబడియున్నవి. ఇట్లు మున్ను మార్గకవిత లోకంబున వెలయగా దేశికవిత బుట్టించి యంధ్రవిషయమున తెనుంగును నిలువబెట్టినవారు చాళుక్యచోళరాజులుగా గనబడుచున్నారు. ౮-వ శతాబ్దికి మున్ను గల సంస్కృతప్రాకృతశాసనములలో నేవో కొన్ని తెలుగుపదములును, తెలుగుదేశమునందలి యూళ్ల పేళ్లను, వాని పరిహద్దులను దెలుపు మరికొన్ని తెలుగుపదములునుమాత్రమే లభించుచున్నవి. వీనిని బట్టి యాంధ్రభాషాస్వరూపపరిణామములను గూర్చి యించుక తెలిసికొనవచ్చునేకాని, ఆంధ్ర భాషలోని కవితాస్వరూపమునుగూర్చి తెలిసికొనుటకా శాసనము లేమియు సహాయకారులు కాలేవు. లభించినంతవరకు ఏడెనిమిది శతాబ్దులలోని తెలుగు శాసనములు గద్యరచనలతో గూడినవే. ౯-వ శతాబ్ది నుండి పద్యరచనలతో గూడినవి కానవచ్చుచున్నవి. ఈ శతాబ్దిలోనే కన్నడమున నిప్పటికి లభించిన వానిలో తొలిగ్రంథ మనదగిన 'కవిరాజమార్గము' కూడ రచింపబడియుండుట తేటపడ్డించినది. ఈ గ్రంథమును బట్టియే యీ భాషలో నింతకుబూర్వ మనేక శతాబ్దములనుండి కవితారచన సాగుచునేయుండె నని చెప్పుటకు దగిన యాధారము లగపడుచున్నవి. తెనుగునమాత్ర మాకాలమున గవితారచన లేకయుండునా? తెలుగునగూడ నన్నయకుతరువాతి శైవకవుల గ్రంథములనుబట్టి నన్నయకుపూర్వము-అందు ముఖ్యముగా తెలుగుశాసనముల కాలములో నీ దేశమునగూడ దేశీయకవితారచన సాగుచునేయుండె ననుటకు దగిన నిదర్శనములు లేకపోలేదని వెనుకటి వ్యాసములో సూచింపబడియే యున్నది. కన్నడమునకంటెను తెనుగున నీ దేశికవిత దేశీయమార్గమునే యనుసరించి సాగుచుండె ననుటకు తెలుగుశాసనములలోని పద్యము లన్నియు నిప్పటికి లభించినంతవరకు దేశీయచ్ఛందోమార్గము ననుసరించిన వగుటయే యొక నిదర్శన మగుచున్నది. క్రీ. శ. ౬-వ శతాబ్ది నాటికే కన్నడశాసనములు సంస్కృతచ్ఛందోమార్గము ననుసరించిన వృత్తములతో గూడియున్నవి.

కాని యప్పటికిని కన్నడకవులు దేశిమార్గములను దేశీయములుగానే చేసి రచించుటలో జాగరూకులై యుండిరనుటకు సందేహము లేదు. గమకసమాసాదులను గొన్నిటిని గ్రహించినను, సంస్కృతావ్యయములు, విభక్తిరూపములు మొదలగువానిని కన్నడములో జేర్చుకొనుటకు వా రంగీకరింపలేదు. సంస్కృతవృత్తములను గ్రహించినను అందలి యతివిలంఘనమును దోషముగా బాటింపకుండుటయేకాక, యందు దేశీయమగు ద్వితీయాక్షరప్రాసనియమమును బ్రవేశపెట్టుటచే, వా సంస్కృతవృత్తములను దేశీయములుగానే చేసినవారైనారు. దేశీయములగు మాత్రాగణఛందములను బోలిన దగుటచే గాబోలు నార్యాజాతిభేదమగు కందమునకు వీరి ప్రాచీనకవితలో ప్రాధాన్యము కలిగినట్లగపడుచున్నది. దీనితోపాటు సంస్కృతవృత్తములకును, దేశీయములగు అక్కర, గీతిక, త్రిపది మొదలగు ఛందోరచనలకును గూడ ప్రాచీనకావ్యభేదమగు చెదండె అనుదానిలో ప్రాచుర్యము లేకపోలేదు. ఈ రీతిగా బ్రాచీనకన్నడకవులు దేశిమార్గములను దేశీయములుగా జేసి పదకొండవ శతాబ్దమందలి నన్నయాదితెలుగుకవులకు మార్గదర్శకులైనారని తెలియవచ్చినది.

కాని కన్నడకవులకంటెను దెనుగుకవులు దక్షిణదేశీయకవితాసంప్రదాయముల నధికముగా నిలువబెట్టి కొనినారని చెప్పకతప్పదు. ఇందుకు పెక్కు కారణములు కలవు. నన్నయకాలమునకు బూర్వము తెలుగు కవిత దేశీయపద్యములలోను, పదములలోను రచింపబడుచువచ్చెనేకాని సంస్కృతవృత్తములలో రచింపబడకుండుట యొకటి. సంస్కృతవృత్తము లిం దవలంబింపబడినపుడు కన్నడకవులవలె వీనిలో యతివిలంఘనమును బాటింపక, తెలుగుకవులు దాని స్థానమున దేశీయసంప్రదాయసిద్ధమగు నక్షరసామ్యరూపమగు వడినిగూడ బ్రవేశపెట్టినారు. ఇక కన్నడమందుకంటెను తెలుగుకవిత విశేషముగా నిలుపుకొనిన దేశీయత అందలి దేశీయచ్ఛందోరచనలలో గానవచ్చుచున్నది. అందు సీస, గీత, ద్విపద, రగడ, కళికోత్కళికాదులు ప్రధానములు. కన్నడమున - ప్రధానముగా బ్రాచీనకన్నడకవితయందు సీసపద్యరచన లేనేలేదు. ఇటీవల తెనుగునుండియే కన్నడమున బ్రవేశించియుండును. కన్నడలాక్షణికులలో నిటీవలివారు (కవిజిహ్వాబంధకారాదులు) దీనికి లక్షణము కల్పించినను ఆ భాషలో దానికి విశేషప్రచారము లేకనేపోయినది. కన్నడద్విపద, త్రిపదలకును తెలుగులోని వానికినిగూడ లక్షణమున భేదము కలదు. ఈద్విపద, సీస, గీత రచనల లక్షణమును తమిళచ్ఛందోరచనల లక్షణముతో బోల్చినగాని వీని తత్త్వము మనకు బోధపడదు. ఈ దక్షిణదేశీయచ్ఛందమునందలి మాత్రాగణములను సంస్కృతప్రాకృతములందలి మాత్రాచ్ఛందములతో సమన్వయించి లక్షణ మేర్పఱచుటకు సంస్కృతచ్ఛందోలక్షణకర్తలు విశేషప్రయత్నము చేసి, యక్షరగణములనేకాక సూర్యేంద్రచంద్రగణము లని, బ్రహ్మవిష్ణు రుద్రగణము లని భిన్నరూపముల మాత్రాగణవిభాగమునుగూడ జేసిచూపిరికాని, యివి శిష్టకవితలోని రచనలకు సరిపోయినను ప్రాచీనకవితలోని దేశీయరచనలకును, తమిళమునందలి ప్రాచీనకవితలో నిలిచియున్న రచనలకును సరిపోకుండుటచే వాస్తవమగు దక్షిణదేశీయచ్ఛందస్సంప్రదాయ మింతకంటె విపులము, భిన్నము నై యుండెనని చెప్పవలసియున్నది. కావున తెలుగుకవితయందలి సీస, గీత, ద్విపద, రగడాదులయొక్కయు, శిష్టకవులచే నిరసింపబడి యడుగంటిన పామరజనకవితారచనలయొక్కయు లక్షణసమన్వయమునకుగాను తమిళకవితాసంప్రదాయజ్ఞానమావశ్యక మగుచున్నది. మార్గకవితారచనాభేదములను దేశీయములుగా జేయుట కందలి వృత్తరచనలందును, జాతుల రచనయందును తెలుగుకవులు ప్రవేశపెట్టిన వడిప్రాసలు దక్షిణదేశమం దంతకు చిరపూర్వమే దేశీయకవితాసంప్రదాయసిద్ధము లై యుండెనని తమిళకవితయందలి తుడైభేదములను మోనై, యెదుగైలు ఎట్లు వ్యక్తముచేయుచున్నవో అట్లే ప్రాచీనకాలమునుండియు దేశమున వ్యాప్తిజెంది యుండియు శిష్టకవుల గద్యపద్యాదిసంస్కృతభూయిష్ఠ రచనాధాటి కాగలేక వెనుకబడిపోయిన దేశీయరచనలలోని పెక్కురీతులు తమిళచ్ఛందోరీతులతో బోల్చి చూచిన నవియు లక్షణసమన్వితములే యగునని తోచకపోదు. ముందు కన్నడాంధ్రముల గల యిట్టి దేశీయ

రచనలను గుర్తించి, పిదప వానికి తమిళరచనలతో గల సామ్యము నారయుదము.

నన్నయకు బూర్వమునందలి తెలుగుశాసనము లిప్పటికి లభించినంతవరకు దేశీయములను అక్కర, సీసము, తరువోజ మొదలను ఛందోరచనలతోడనే కూడినవైనను, ఆకాలముననే సంస్కృతవృత్తముల యొక్కయు, దేశీయరచనల యొక్కయు కలయికతో గూడిన కన్నడ 'బెదండె' కావ్యమును బోలిన కావ్యములు తెలుగుకవితలోగూడ వెలసియే యుండునని తలచుటకు దగిన కారణము లేకపోలేదు. సోమనాథుడు దన కాలమున బ్రచారములో నున్నట్లు చెప్పిన రచనలలో 'నుదాహరణగ్రంథము' నొకదానిని జేర్చినాడు గదా.[1] ఆతడే రెం డుదాహరణగ్రంథములను రచించినట్లుగూడ పిడపర్తి సోమనారాధ్యుడు చెప్పియున్నాడు. సంబోధనముతో గూడిన యెనిమిది విభక్తుల లోను వృత్తములను జెప్పి, ఒక్కొక్క విభక్తిలోని వృత్తముతరువాత నెనిమిది దళములు గల రగడభేదములను కళికను, దానిపై నాలుగు దళములు గల యుత్కళికను జేర్చి, తుదను సార్వవిభక్తికముగ నొక వృత్తమును రచియించి, మొత్త మిరువదియారు పద్యములను జెప్పిన నుదాహరణగ్రంథ మగునట. ఇట్లిది వృత్తముల నడుమనడుమను వచ్చు దేశీయరగడభేదములతో గూడిన దగుటచే కన్నడ 'బెదండె' కావ్యమును బోలిన దనవచ్చును. కన్నడసాహిత్యమున పంపాదు లవలంబించిన చంపూమార్గమునే చేపట్టిన తెలుగుకవులు నన్నయాదు లిట్టి దేశీయరచనల పొంత బోకుండుటచేగాబోలు తరువాతి సన్నిహితలాక్షణికులుగూడ వీనినిగూర్చి తెలుపలేదు. ఉదాహరణమును గూర్చి విపులముగా దెలిపినవాడు అప్పకవి. అతడు దీనిని చాటుప్రబంధములలో జేర్చినాడు.

> "నాల్గుదెగల యుదాహరణములు ముక్త
> కాదిపంచాదశయును సంఖ్యాన్వితములు
> గద్యరగడద్విపదదండకములు మంజ
> రులును సంఖ్యారహితచాటువులు నృసింహ."
> (అప్పకవి. I.౨౯)

మఱియు నీయుదాహరణ మనునది సద్దళి, బద్దళి, విద్దళి, ఉత్కళికము నని నాలుగు తెరగులుగా నుండుననియు, నందు

> "సంబుద్ధి యొనలించి సప్తవిభక్తులు
> పలికిన భక్తి సద్దళి యనంగ
> సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు
> పలుక నొప్పారు బద్దళి యనంగ
> సంబుద్ధితోడ నిమవిభక్తులతోడఁ
> బలికిన కృతియు విద్దళి యనంగఁ
> గళిక లుత్కళికలు గమకింపఁ బలికిన
> కావ్యంబు నుత్కళికంబు ననఁగ
> నవనిఁ జాటుప్రబంధంబులందు మిగుల
> నాటుకొని యొప్పుచుండు నీనాల్గుదెగలఁ
> గానఁబడు నుదాహరణములో గానలోల."

అని చెప్పుటచే, నితరపద్యశూన్యమై కళికోత్కళికలతోమాత్రమే గూడినది యుత్కళికరూపమగు నుదాహరణ మైయుండు ననియు తోచుచున్నది. ఈతనికి బూర్వుడు ౧౫-వ శతాబ్దివాడగు ననంతామాత్యు డీయుదాహరణలక్షణమును దెలిపియున్నాడు గాని తరువాతి యప్పకవి చెప్పిన నాలుగు భేదములను గూర్చి తెలుపలేదు. వీనికి బూర్వులగు విన్నకోట పెద్దనగాని, కవిసంశయవిచ్ఛేదకారకుడుగాని వీనిని గూర్చి తెలుపనేలేదు. ఇట్లే దేశీయరచనావిశేషములలో బ్రధానము లనదగిన రగడభేదములనుగూర్చి పెద్దన చెప్పియున్నను, ఆతనికి బూర్వుడగు కవిసంశయవిచ్ఛేదకారుడు తెలిపియుండలేదు. అప్పకవి వీనిని వైతాళీయములతో ముడివెట్టి, వానిలో* ననేక భేదములు గల వనియు, నందు నవవిధరగడలను-మాత్రమే తెలిపెదననియు జెప్పగా, పెద్దన తొమ్మిదింటినిమాత్రమే చెప్పియూరకున్నాడు. ఇట్లు వెనుకకు బోయినకొలదిని దేశీయరచనలనుగూర్చిన ప్రస్తావము సన్నగిలుచువచ్చిన దనిమాత్రము గ్రహింపవలసి

1. "శతకంబు శివతత్త్వసారంబు, దీప
కళిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ముక్తకావళులు"

యున్నది. నన్నయాదిశిష్టకవులు వీనిని గ్రహింపకుండుటయే కారణము కావచ్చును. కవిత్రయమువారును, ఆ తరువాతి ప్రసిద్ధశిష్టకవులునుగూడ రగడ, ద్విపద, కళిక మొదలగువానిని గ్రహింపలేదు గదా. కావుననే సామాన్యజనులలో మతప్రచారమునకునై యుండు నని సోమనాథుడీదేశీయరచనలను గ్రహించియుండును.

సోమనాథుడు రచించినవి రెండుదాహరణ గ్రంథములు గనబడుచున్నవి. అందొకటి తెలుగున రచింపబడిన 'బసవోదాహరణము'. ఇది వెనుక శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారిచే ప్రకటింపబడినది.[2] మరియొకటి సంస్కృతభాషలో రచింపబడియున్నట్లు తెలియుచున్నది.[3] అది అముద్రితము. శ్రీ వెంకటరావుగారి త్రిపురాంతకోదాహరణపీఠికలో గ్రహింపబడిన భాగమునుబట్టి వారన్నట్లిది యాంధ్రోదాహరణలక్షణమునే యనుసరించుచున్న దనుట వ్యక్తమే. ఇంతకు ప్రాచీనము లనదగినవి సంస్కృతోదాహరణ గ్రంథము లేవియు గానరావు. దీని లక్షణమునుగూర్చి ప్రాచీనాలంకారికగ్రంథములలోను దెలుపబడిన ట్లగపడదు. విద్యానాథుడుమాత్రము ప్రతాపరుద్రీయమున నుదాహరణలక్షణమును దెలిపియున్నాడు. కాని యిది యతనికి గొంత పూర్వుడో, సమకాలికుడో యనదగిన సోమనాథుడు రచించిన సంస్కృతోదాహరణమునుబట్టియే కల్పించియుండు ననవచ్చును. లేదా యాతని లక్షణమునకు సరియగు మఱికొన్ని కాలగతి నంతరించినవేమో. ఆతని లక్షణ మిది:

"యేనకేనాపి తాళేన గద్యపద్యసమన్వితం
జయేత్యుపక్రమం మాలిన్యాద్రిప్రాసవిచిత్రితం
త దుదాహరణం నామ విభక్త్యష్టాంగసంయుతం"

ఈలక్షణమునకును, త్రిపురాంతకోదాహరణపీఠికలో గ్రహింపబడిన సోమనాథుని రచనాభాగమునకును యత్కించిద్భేద మగపడినను అందలి విభక్తియుతములగు పద్యములనుబట్టియు, కళికోత్కళికాది రచనలనుబట్టియు జూడగా, నిది దేశభాషలలోని జాతీయకవితారచనలకు వీనితో సన్నిహితసంబంధము లేని సంస్కృతాలంకారికులు లక్షణ మేర్పరచు సందర్భమున గలిగెడి భేదమే కాని విశేషము కాదని తోచుచున్నది. ఏలయనగా నేదో యొక తాళమునకు సరిపోవు గద్యములతోడను, పద్యములతోడను గూడినదై, ప్రాసవిచిత్రితమై, అష్టవిభక్తియుతమై యుండవలయు ననుట సమానమే కదా. దేశీయరచనలగు కళికోత్కళికలు గద్యములుగా గ్రహింపబడుటలో నాశ్చర్యము లేదు. సోమనాథుని పంచప్రకారగద్య వాస్తవముగా నుత్కళికా రూపమే యైనను, వచనమువలె వ్రాయబడుచుండుటనుబట్టి గద్యలుగానే గ్రహింపబడుచుండినట్లు శ్రీ వెంకటరావుగారు తెలిపినదానినిబట్టి స్పష్టమగుచున్నది. ఇంతేకాక 'గద్యమునందాని నుత్కళికాప్రాయముగా' గ్రహింపవలయు నని విద్యానాథునికి బూర్వుడగు వామనుడు తన కావ్యాలంకారసూత్రవృత్తిలో దెలిపియున్నాడు.

"గద్యం వృత్తగంధి చూర్ణ ముత్కలికాప్రాయంచ"

"పద్యభాగవ ద్వృత్తగంధి"

"అనావిద్ధలలితపదం చూర్ణం"

"విపరీత ముత్కలికాప్రాయం" (కా. సూ. వృ. 1-3-23)

గద్యము పద్యభాగమువలె వృత్తగంధియై యుండుట యనగా నేమో సంస్కృతకవితారచనలనుబట్టి తెలిసికొనుట సాధ్యమగునో కాదో! కాని దేశీయములగు స్త్రీలపాటలు మొదలగువానిలోని 'కందార్థము' లనబడునవి వీనిక్రింద జేరవచ్చును. ఇవి ముందు కందాదిపద్యముల ధోరణి కలిగి తరువాత పాటగా మారుచుండుట కలదు. ఇందలి పద్యము త్పలమాలగా నున్నది.

"శ్రీమధురాధరీ వినవె శేషగిరీశుడ నీదుకేళికా
ధామమునందు నింతవడి దర్పకలీలల నుండి యంతటన్
వేమరు వేటలాడ జని వేగమె వచ్చితి తల్పుతీయవే
భామా సద్గుణా గుణాధామా లావణ్యాచతురాసీమా !
అలమేలూ మంగా నామా"

2. ప్రభవసం. మాఘమాసపు భారతి.

3. త్రిపురాంతకోదాహరణ పీఠిక. శ్రీ నిడదవోలు వెంకటరావుగారు, యం. ఏ.

ఇట్టి దేశీయరచనలనుబట్టి యీ విభాగము చేయబడినదా యను సందేహము కలుగకమానదు. ఇంతేకాక కన్నడమున గద్యపద్యసమ్మిశ్రిత మగుదానిని గద్య యని యందు రను ప్రతీతిని కవిరాజమార్గకర్త తెలిపియున్నాడు.4 కాని వానికి లక్ష్యము లాభాషలో దొరకలేదు. పైని వృత్తగంధులని చెప్పబడిన గద్యలట్టి దేశీయరచనలేమో. వామనుని లక్షణమునుబట్టి గద్య ముత్కళికాప్రాయముకూడ నగుచున్నది. దేశీయరచనలలోని యీ యుత్కళికలు గద్యములుగా వ్రాయబడియుండుటనుబట్టి దేశీయచ్ఛందోరీతుల నంతగా పాటింపని సంస్కృతలాక్షణికులు వీనిని గద్యలనియే తలంచియుందురు. సోమనాథుడు రచించిన గద్య లనునవి యీ యుత్కళికారూపములే యనియు, సోమదేవుని యశస్తిలకచంపువులో వచనముగా గ్రహింపబడిన యొకరచన ద్విరదగతిరగడయే యనియు శ్రీ వెంకటరావుగారు తెలిపియున్నారు.

కన్నడమునందలి పెదెండెకావ్యమువలెనే తెనుగున వృత్తములతోపాటు దేశీయరచనలు కలుపబడిన ప్రాచీనకావ్యము, లేదా చాటుప్రబంధము 'ఉదాహరణ' మను విషయమేకాక, ఇందు జేర్పబడిన యుత్కళిక లనునవి 'రగడ' భేదములే యను విషయముగూడ మనము ముఖ్యముగా గుర్తింపవలసియున్నది.

"పతిపేరు దొరలంగ బద్యమొక్కటి చెప్పి
రగడభేదములు మార్గములుగాగ5
కళికలు నెనిమిదిదళములు గానించి
దానిలో సగము నుత్కళికజేసి"

అని అప్పకవియే చెప్పియున్నాడుగదా. ఈ కళికోత్కళికలు రగడభేదము లగుటచేతను, ఇవి కన్నడాంధ్ర దేశీయరచనలలో ప్రాచీనములు, ప్రధానములు నగుటచేతను ఈ రగడల స్వరూపలక్షణములను దెలిసికొనుట యావశ్యకమే. ఆంధ్రలాక్షణికులకంటె కన్నడలాక్షణికుడగు నాగవర్మ ప్రాచీనుడును, నన్నయకు పూర్వుడు నగుటచే నాతని మతమును ముందు గ్రహింతము. గణనియమవిపర్యాస ముండినను, సమమైన మాత్రలు గలిగి తాళబద్ధమైయుండునది రఘటాబంధ మను 6నని రగడలక్షణముగా జెప్పినాడు నాగవర్మ. అనగా నొక్కొక పాదములో మూడో, నాలుగో, ఐదో మాత్రలుగల గణములే యుండుననుట. ఇవి తాళప్రధానము లగుటచే పాటల కనుకూలమైయుండును. కన్నడమున నాగవర్మ మూడువిధములుగ రగడలనే- మందానిల, లలిత,ఉత్సవ అనువానినే చెప్పియున్నాడు. కాని తెనుగులాక్షణికులు నవవిధరగడలను జెప్పినారు. కవిజనాశ్రయకారుడు వీనిని గూర్చి యెత్తుకొననే లేదు. అనంతామాత్యుడు, అప్పకవి నవవిధములను జెప్పినారు. ఈ తొమ్మిదిరగడలు అందు జేరు మాత్రాగణముల భేదమును బట్టి యనేకరీతులు గలవైనను అవి యన్నియు జాలవరకు 3, ౪, ౫, ౬ మాత్రలు గల నాలుగేసిగణములతో గూడిన పాదములు గలవని మాత్రము చెప్పవచ్చును. దక్షిణదేశీయసంప్రదాయసిద్ధములగు గణములలో నానామాత్రలు గల వనేకవిధములు గలవిగా నుండునుగావున నీ రగడభేదములు ననేకవిధము లై యుండుననుటకు సందేహములేదు. కావుననే యప్పకవి వీనిని వైతాళీయములతో ముడివెట్టి "వైతాళీయంబులగు రగడ లనేకవిధములుగ నుండు నందు నవవిధరగడలనుమాత్రము వివరించెద"నన్నాడు. మరియు నివి ద్విపద, దండకము లతోపాటు సంఖ్యానియమరహితములగు చాటువులు కావున నాలుగు

---

4. "మిగెకన్నడ కబ్బంగళొ
ళగణితగుణ గద్యపద్య సమ్మిశ్రితమం
నిగదిసువర్గద్యకథా
ప్రగీతియుం తప్పిరంతెనాచార్యక్కళ్."

5. "రగడభేదములు మార్గములుగాగనుజేసి" యని చివర మూడక్షరముల జేర్చినచో నీ సీసపద్యముకూడ రగడభేదమే యగుచున్నది.

6. "గణనియమ విపర్యాసదొ
ళెణెవడె దొల్పెసెయె మాత్రె సమనాగి గుణా
గ్రణియ మతదిందె తాళద
గణనెగొడం బట్టెడెయు పె రఘటాబంధం"
(ఛందోం. 3-౨౬౨)

పాదములే యుండవలయు ననునియమముకూడ లేదు. కాని తక్కిన పద్యములందువలెనే ప్రాసనియమము కలదు. ఆద్యంతప్రాసనియమముకూడను.

"ఆద్యంతప్రాసంబులు
హృద్యంబుగ వెంట వెంట నిడి పాదము లు
ద్యద్యతుల గూర్పదగు నన
పద్యంబగు రగడలందు వారిజనాభా".
(అనం. ఛం)

కన్నడమందలి 'మందానిలము' నాలుగుమాత్రల గణములతో గూడిన దగుటచే దెనుగున మధురగతి రగడకు సరిపోవుచున్నది.

మందానిలము:—

"ఆవే శెయొళతి సంభ్రమ మెసెదిరె
పూవలి పురవీ ధిగళొళ్ నెరెదిరె..."
"శ్రీకరు ణేశా శ్రుతితతి దేశా
శోకని ఘర్షా శోభిత హర్షా."

మధురగతి:—

"నాలుగు మాత్రలు నాటిన గణములు,
నాలుగు రెంటికి నలి విరమణములు."
(అప్పకవి)

కన్నడలలిత:—

౫ మాత్రలు గల గణములు నాలుగేసి గల పాదములతో గూడిన దగుటచే తెలుగుద్విరదగతికి సరియగును.

ద్విరద:—

"కరమొప్ప పంచలఘు గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే."

లలిత:—

"అల్లిమ· మరదల్లి మల్లికాలతెయల్లి
రయె శెయసుగె మరదల్లి జళరుహాకరదల్లి ..."

కన్నడఉత్సాహ:—

౬ మాత్రలు గల గణములు నాలుగేసి యొక పాదము గలది.

"ప్రేమవాస సద్గుణైక ధామసూర్య కోటిభాస
కోమలాంగ సంతతాభి రామనిర్మలాంతరంగ"

ఇది తురగవల్గనమునకు సరియగును. ఇందు తుది గణమున నొక్కమాత్ర తొలగించి యొక్క గురువునే నిల్పినచో నిది యుత్సాహ యగును.

"ఈహమీర సూర్యగణము లేడు గాంతమైనను
త్సాహవృత్త మనగ జెల్లు"

అని అప్పకవిలక్షణము. కొద్దిమార్పుతో గూడిన యిట్టి రచన లప్పటికే గల వనుటకు నిదర్శనముగా నాగవర్మయే యిట్టి మరియొక 'యుత్సాహ'కు లక్షణమును దేశీయజాతులక్రింద జెప్పియున్నాడు.[7]

సోమనాథుని యుదాహరణమందలి కళికాదు లీరగడభేదములే యనుట క్రింది యుదాహరణములు చాలును.

కళిక:—

"వండియు త్రిభువనవినుతిసమేతుడు
మండిత సద్గుణ మహిమోపేతుడు"
(నాలుగుమాత్రలు నాటిన గణములతో గూడినది.)

---

7. ప్రాచీనాంధ్రకవులు సీసములను గ్రహించి రగడలరూపములగు నీ దేశీయరచనల నొప్పరికించినను ఆధునికాంధ్రకవులు వీనియం దభిమానము చూపుచుండుట కాలము తిరుగబడుచుండు ననుట కొక నిదర్శనము.

"కాలక్రమేణ లోకమున సర్వమ్మును
కాలపాశనిబద్ధగతి పోవు నాగును".
"అగు మేను శాశ్వతమ్మటె సుఖమ్మే దుఃఖ
మగు దుఃఖమే సుఖమ్మగు నేది యెట్లనో
తెలుగుమానిసి కేమి తెలియునే యద్దాని
సాగనెల్ల కాలమ్మె చూపగల్గును రునీ".
(విశ్వనాథ సత్యనారాయణ)

మొదటిదానిలో "గతినిపోవు" అని మార్చినను, తుదిపాదమున "నురునీ" అను నక్షరములు తీసివేసినను అవి సీసపద్యపాదములే యగును.

"పెండియును భక్తాభివృద్ధి పెంచినవాని
బంధమాయాచారపథము ద్రుంచినవాని"
(ఐదేసి మాత్రల నాలుగుగణములతో గూడినది)

ఉత్కళిక:—

"భువనోపకారా భవమోదవీరా
భక్తిసంయోగా ముక్తిసంభోగా."

ఛందోంబుధికారుడు వృత్తజాతివిభాగమును గూర్చి చెప్పుచు, సంస్కృతప్రాకృతపైశాచికము మూడున్నర భాషలనుండి పుట్టిన ద్రావిడాంధ్ర కర్ణాటాదిషట్పంచాశత్ సర్వవిషయభాషాజాతులలో సమ మర్ధసమం విషమమను మూడుతెరగుల వృత్తములున్నవనియూ, ఆ ఛందములలో బుట్టినవిగాక జాతులనబడునవి కొన్ని కలవనియు జెప్పినాడు. ఈజాతులలో దేశీయజాతు లని మఱికొన్ని కలవు. "అవటి పాఱగెపుట్టువ మాలావృత్త, దండక, రఘటమాత్రార్య, త్రిపది, చతుష్పది, షట్పది, అష్టపది, శంఖా (సంఖ్యా?) వృత్త, తాళవృత్త అద్విజాతిగళ్ ఉంటు. అవావు వెందొడె —

మదనవతి, అక్కరం, చౌ
పది, గీతికె, యేళె, తివది, యుత్సాహం, ష
ట్పది, యక్కరికె, కరంచె
ల్వొదవిద ఛందోవతంస మబ్జదళాక్షీ"

ఇట్లు అక్కర, చౌపది, గీతిక, ఏళె, ఉత్సాహ, షట్పది మొదలగునవి దేశీయములు—అనగా దేశీయములు బ్రహ్మ విష్ణు రుద్ర రూపమాత్రాగణబద్ధము లని కాబోలు నాశని భావము— జాతులలో జేర్పబడినవి. వీనిలో పెక్కు తెలుగునను గలవు. కావున నివి నన్నయకు బూర్వమే ద్రవిడాంధ్రకర్ణాటభాషలలోని దేశీయరచనలలో విశేషప్రచారమున నుండె ననుటకు సందేహము లేదుగదా. నన్నయకు బూర్వ మిట్టిరచనలతో గూడిన తెలుగుకవిత విశేషముగా నుండియుండును. మొదట తెలుపబడిన జాతులకును, వీనికిని భేదమేమి? రగడలను మాత్రాగణబద్ధములే యని చెప్పుచు, సామాన్యజాతులలో జేర్చి అక్కర, చౌపది, గీతిక, షట్పది మొదలగువానిని దేశీయజాతులలో జేర్ప గారణమేమి యను ప్రశ్న బయల్పడకమానదు. ఇదియే ఆర్యానార్యచ్ఛందోరీతులకు గలిగిన సంఘర్షణములోని ముఖ్యఘట్టమని చెప్పవలసియున్నది. జాతుల విషయములో కన్నడదేశీయములకును, తెనుగుదేశీయములకును గల భేదమునుగూడ నిచ్చటనే మనము గుర్తింపవలసియున్నది. ఏలయనగా జాతులు మాత్రాసంఖ్యాబద్ధగణములతో గూడినవి. అవి సంస్కృతమునను గలవు. ప్రాకృతమునను గలవు. ప్రాకృతమునందలి వానిలో దత్తద్దేశీయములుకూడ జేరియుండవచ్చును. కన్నడాంధ్రభాషలలోని ఛందోరచనలకు సంస్కృతభాషాపండితులే లక్షణ మేర్పరుపవలసివచ్చినది. ఆ సందర్భమున వారి దృష్టిలో ప్రధానములు సంస్కృతప్రాకృతములే గనుకను, తద్రీతులే వారికెక్కువగా బరిచితములు గావునను వృత్తాదులను గురించి ముందుచెప్పి, మాత్రారచనలనుగూర్చి తరువాత చెప్పినారు. ఈ మాత్రారచనలలో సంస్కృతప్రాకృతములలోనివి కొన్నియు, దేశీయములు కొన్నియును గలవు. దేశీయములలో మాత్రాగణబద్ధములగు కొన్నిటిని మాత్రాసంఖ్యాబద్ధములుగాగూడ గ్రహించుట కవకాశము కలదుగదా. సర్వలఘుసీసమునందలి యొక పాదమును ౪ మాత్రల ౭ గణములు, తుదిని ౨ లఘువులు, లేదా ౧ గురువు కలదానినిగా జెప్పవచ్చును. "ఈషమీర సూర్యగణము లేదు గాంతమైన నుత్సాహవృత్తమనగ జెల్లు." దానిని మూడుమాత్రల గణము లేడు, నొక గురువు కలదని చెప్పవచ్చునుగదా. ఇట్లు మాత్రాగణబద్ధములగు దేశీయపద్యములకు మాత్రాసంఖ్యానియమము గల యార్యాపద్యముల వలెనే లాక్షణికులు లక్షణము కల్పించుట కవకాశమున్నదికాని, అట్లు వీనికి లక్షణము కల్పింపబడినచో వీని దేశీయతమాత్రము నాశనమగుచున్న దనకతప్పదు. వారి లక్షణము సంకుచితత్వమును జెందకమానదు. దేశీయత నాశనమగుట యనగా నేమో చెప్పవలసియున్నది. ఒక దేశీయరచనకు దేశిమాత్రాగణపద్ధతిని లక్షణ మేర్పరచినచో నారింద్రగణములు, రెండు సూర్యగణములు నొక పాదమగునని చెప్పినపుడు నొక సీసపాదములో నల, భలను నాలుగుమాత్రలు గల గణములైనను రావచ్చును; లేదా నగ, సల,ర, తలను

నైదేసి మాత్రలు గల గణములైనను రావచ్చును. మరియు నీ రెండును కలిసియైనను రావచ్చును. కాని నాలుగుమాత్రల గణములే యని చెప్పినచో సీసభేద ము లనేకింటిలో నొకదానినిమాత్రము గ్రహించి లక్షణము చెప్పినట్లగును. ఇట్లే రగడలవిషయమున గూడను. ఆంధ్రకన్నడ భాషాలాక్షణికులు గ్రహించిన రగడలన్నియు పాదమునకు నాలుగేసి గణములతో గూడినవి. లేదా వీనిని రెట్టించి యొక్క పాదముగా జేసినవి. నాలుగుమాత్రలు నాటిన గణములు 'నాలుగు' అని అప్పకవి చెప్పగా, దానినే "అనిగగనల, ధ, స, లను నాల్గిటిక్కృతి" అని గణపద్ధతిని అనంతు డన్నాడు. మధురగతి రగడను రెట్టించి రెండుపాదములను జతచేసిన విజయమంగళ మగునుగదా. ద్విరదగతిని రెట్టించిన విజయభద్రము. ఇట్లు ౫ మాత్రల గణములు నాలుగిటిని రెట్టింపగా వచ్చినవానిలోని భేదములే లయవిభాతి, లయగ్రాహీత్యాది మాలావృత్తములు. వీనిలో పాటలోని సౌకర్యముకొరకొకమాత్రయో, గణమో తగ్గింపబడి యుండును. మొత్తముమీద నివి యన్నియు తొలుత నాలుగుగణములతో గూడిన పాదములు గలవియే. మాత్రాసంఖ్యా నియమమునకో, అక్షరగణనియమమున కో లొంగినంతవరకు లొంగదీసికొని లాక్షణికులు వీనికి లక్షణ మేర్పరచినారు. ఇంకను అందనివానిని వదలివేసి నారు. కొన్నిటిని తాలబద్ధములని గ్రహించియున్నారు. అట్టి వనేకములు సామాన్యజనుల పాటలలో నుండును. దేశియ గణలక్షణమునుబట్టి చూచినచో నాపాటలకును లక్షణ మేర్పడకపోదు. మచ్చున కొకటి—

" లాలిబం గరుబొమ్మ, లాలి మా యమ్మ
లాలిము ద్దులగుమ్మ లాలిసీ తమ్మ — లా(అ)లీ.
జోజోచి దానంద జోజోము కుందా
జోజోకృ పాపాంగ జోసుంద రాంగా జో(ఓ) జో "

ఇవి కించిద్భేదముతో ౫ మాత్రల నాలుగు గణ ములతో గూడినవే. ౭ మాత్రలుగల నాలుగేసి గణముల పాదములు గల వృషభగతిరగడభేదమే గుమ్మడిపాట యగునని యిదివరకే సూచింపబడినది. "గుమ్మడేడే గోపిదేవీ గుమ్మడేడే కన్నతల్లీ ..."

మన సీసపద్యముకూడ వాస్తవముగా నాలు గేసిగణములుగల పాదములను రెట్టించుటచే నేర్ప డినదే. ద్విపదకు మూడింద్రగణములు, నొక సూర్య గణము కలిసి నాలుగు గణములేకదా పాదమునకు? కావున ద్విపద రెండుపాదములును గలిసి సీసమున నొక పాద మగుటలో చిక్కేమి ? ఆరింద్రగణముల నొక చోటను, రెండు సూర్యగణములను తుదిని జేర్చినచో సీసపద్యపాద మైనది. అట్లునుగాక ద్విపదనే యుంచుక మార్పుతో జదివినచో సీసపద్యపాదమే యగును.

"అరూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన."

దీనిలో రెండవపాదమునందలి రెండుమూడు గణములను వలములుగా జేసినచో సీసమగును.

"అరూఢగద్యప ద్యాదిప్రబంధపూ
రితసమకృతబహుళేష్ఠరచన."

'నల'ముకూడ నింద్రగణమే కావున నామార్పు వలని బాధ లేదు. అయితే దీనిని 'రగడ'లతో బోల్చుట కొక చిక్కుమాత్రము కలిగినది. మొదటి నాలుగుగణములును ఐదేసిమాత్రల గణములైనవి. తరు వాతిరెండును నాలుగేసిమాత్రల గణములు, తుదిరెండు మూడుమాత్రల గణములైనవి. రగడలలో పాదము లన్నియు నొకవిధమైన మాత్రాసంఖ్యానియమముతో గూడియుండ నక్కరలేదన్నచో, నిదియు నొక రగడ భేదము కావచ్చును. సంస్కృతలాక్షణికులు గ్రహిం చిన మాత్రాసంఖ్యానియమము తెచ్చిపెట్టుకొనుట వలన నీచిక్కు గలుగుచున్న ట్లగపడుచున్నదిగాని, దేశియగణములు పాదమునకు నాలుగేసియుండవలయు నన్నచో నాచిక్కు తొలగగలదుగదా. ౪ మాత్రల గణములైనను, ౫ మాత్రల గణములైనను దేశియగణ సంకేతమునుబట్టి ఒక కోటిలోనే చేరవచ్చును. అవి యింద్రగణములే. మరిరెండిటినికూడ-మగణమును, సగ మును జేర్చికొనిన కన్నడవిష్ణుగణము లగును. కావున సీసములలోగాని, రగడలలోగాని, ద్విపదలలోగాని, గీతములలోగాని, మాలికావృత్తములలోగాని వచ్చు నాలుగైదుమాత్రల గణము లేవిధముగా వచ్చినను అవి

ఇంద్రగణములలో జేరునుగదా. కన్నడవిష్ణుగణములలో ౬ మాత్రల గణముకూడ చేరును. ఈకారణముచే నీపద్యములన్నియు నొక్కకూటమునకే చేరినవని చెప్పవచ్చుగదా. అనగా ౪, ౫, ౬ మాత్రలు గల నాలుగేసి గణములు పాదమునకు గల పద్యములని కాని, ఆపాదమును రెట్టించి ఒక పాదముగా కల్పించిన పద్యములని కాని చెప్పవచ్చును. అప్పు డివన్నియు నొకవిధముగు రగడ భేదములే యని చెప్పదగియుండునేమో !!

అయితే ఇందు మఱియొక చిక్కున్నది. ద్విపద, సీసము, గీతము మొదలగు కొన్నిటిలో నడుమ సూర్యగణములు, అనగా మూడుమాత్రల గణములు కూడ వచ్చుచున్నవే-ఇవి ౪, ౫, ౬ మాత్రలు గల ఇంద్ర, విష్ణు గణములలో జేరవయ్యెను - లక్షణసమన్వయ మెట్లగునని అడుగవచ్చును. వాస్తవమే. ఆవిషయము తెలిసికొనుట కవకాశము లేకయే ప్రాచీన లాక్షణికులు ఇట్టి చిక్కులు పడి ఇన్ని విభాగములను చేసినారు. దేశీయగణములని పేరుపెట్టి వానిలో ఇంద్ర-విష్ణుగణము లనుకూటములలో ౪, ౫, ౬ మాత్రలు గల గణముల నెట్లు సమకూర్చుటకు ఒప్పుకొనియున్నారో అట్లే మూడు మాత్రలు గల గణములనుగూడ మఱియొక పేరు పెట్టిగాని, పెట్టకగాని ౪, ౫, ౬ మాత్రల ఇంద్ర-విష్ణుగణములతోపాటు ఒక పద్యపాదములో జేరవచ్చునని, అట్లు చేరుట దేశీయరచనల లక్షణమని మన మేర్పాటుచేసికొనినచో నీచిక్కు వదలిపోవును గదా. అయితే ఇట్లు చేయుచుబోయినచో నియమాభావము కలుగునే యను నాక్షేపణ కలుగవచ్చును. కాని మనము క్రొత్తగా జేయదలచిన నాక్షేపణీయమగునేమో కాని, అట్టిదానికే ఒక నియమముగా బాటించిన లాక్షణికపద్ధతి యొకటి సిద్ధమైయున్నచో నీ యాక్షేపణ పాటింపదగినది కాకపోవును. ఇట్టి పద్ధతి దక్షిణదేశీయచ్ఛందస్సంప్రదాయసిద్ధము. అది తమిళచ్ఛందోలక్షణపద్ధతిలో నిలిచియున్నది. అచ్చట అగవల్పా అను రచనలో ౪, ౫, ౬ మాత్రల గణములతోపాటు ౩ మాత్రల గణముగూడ నీనాలుగుగణములపాదములో నిలువవచ్చును. ఇట్లు దక్షిణదేశభాషాచ్ఛందస్సంప్రదాయములకు సన్నిహితసంబంధ మున్నదను దృష్టితో చూడక, ఆర్యభాషాచ్ఛందస్సంప్రదాయదృష్టితో నీ దేశభాషారచనలను జూచి, వానికి లక్షణమేర్పఱచుటచే నీదక్షిణదేశీయభాషారచన లొకదానితో మఱియొకదానికి సంబంధము లేని పద్ధతులతో గూడినవిగా గనబడుట తటస్థించినది. ఇంతేకాక కాలగతి నాయా సంప్రదాయములలో కొంత మార్పును గలిగినది. కావున దక్షిణదేశీయచ్ఛందోరచనలను, తల్లక్షణములను పరస్పరసామ్యపరిశీలనాదృష్టితో (*Comparative Study*) సమన్వయించి పరిశీలించినచో నీదేశీయరచనల లక్షణము సుబోధము కాగలదని తోచుచున్నది. అప్పుడే యీ దేశభాషలలోని పాటలకును, పద్యములకును గల పరస్పరసంబంధముకూడ తేటపడగలదు.



# ప్రకటన

ఈక్రిందకనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1942 సం. నవంబరునెల) తో ఇది వరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 28-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1942 సం. డిసంబరు 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము

C 3, G 7, H 41, 51, 53, 54, K 6, L 5, 6, N 9, 10, P 21, 23,
S 67, 69, 71, 73, 74, 76.

---

# కస్తూరి రంగయ్య

= శ్రీ డా॥ వి. రాఘవన్ =

ప్రస్తుతము లభ్యమవుచున్న ఆంధ్రచ్ఛందో గ్రంథములలో ఆనందరంగరాట్ఛందము అనునది యొకటి. దానిని రచించిన కవి కస్తూరి రంగయ్య. అతడు లక్షణకవిగా ఆశ్వాసాంత గద్యలలో వర్ణింపబడినాడు. అతడు ధర్మవెచ్చకులములో శ్రీవత్సగోత్రమున ఆరువేల కమ్మనియోగి వంశమునందు జనించిన కులీనుడు. అతని తండ్రి వెంకట కృష్ణార్యుడు.

అసలు "ఈకవి తెలుగు దేశస్థుడు కాడు. తిరుచినాపల్లిలో సేనానాయకులలో చిన్న యధికారిగా నుండెను. అటులుండియు తెలుగున లక్షణగ్రంథము వ్రాయునంతటి పాండిత్యము, భాషాభిమానము కలిగియుండెను. ఇతడు ఆరువేల కమ్మనియోగి తెగవాడయినందున ఆంధ్రుడే యగును." *

ఈఛందోగ్రంథము వెనుక పుదుచ్చేరిలో సుప్రసిద్ధ ఫ్రెంచి గవర్నరుగా నుండిన డూప్లేదొరకు దుబాసిగానుండిన ఆనందరంగ పిళ్లె అనునతనికి (క్రీ. శ. ౧౭౦౯-౧౭౬౧) అంకితమైనదని దీని నామధేయమువల్లనే తెలియుచున్నది. ఆకృతిపతినిగురించియు, అతని వంశక్రమమునుగురించియు కొన్ని వివరములు ఈ గ్రంథపు పీఠికలో తెలుపబడియున్నవి. ఆనందరంగపిళ్లె సొంతసంగతులను గురించి తెలిసికొనుటకు ఈ పీఠిక బాగుగా పనికివచ్చుచున్నది. ఈ సంగతులు అతని డైరిలోకూడ - ఎక్కడనో అతి విరళముగా తప్ప-మనకు సమగ్రముగా దొరకవు. కావున ఈ పీఠిక చాల అమూల్యమైనదని చెప్పవచ్చును. ఆనందరంగపిళ్లె డైరీ తమిళమూల మింకను అచ్చు కెక్కలేదుగాని దాని ఆంగ్లానువాదమును మాత్రము మద్రాసుప్రభుత్వమువారు పండ్రెండు సంపుటములలో ప్రచురించియున్నారు. ౧౭౩౬-౧౭౬౧ మధ్యకాలములో దక్షిణ హిందూదేశమునందు జరిగిన రాజకీయ వ్యవహారములేకాక ఇతర లౌకిక వృత్తాంతములు గూడ అనేకము ఆ 'దినచర్య'లో పూసగ్రుచ్చినట్లు వ్రాయబడియున్నవి. నాటిచరిత్ర తెలిసికొనగోరువారికి ఆడైరీ ఒక అమూల్యమయిన గనివంటిది.

చరిత్రాంశ వివరణలో ఆనందరంగ పిళ్లె డైరీకి గల ప్రాముఖ్యము త్రికాలాబాధితమనుట నిశ్చయమే. కాని ఆనాటి మత,విజ్ఞాన రంగములందలి జీవిత విశేషములను తెలుపుటలో ఈ డైరీకిగల విలువగూడ ఉపేక్షింపదగినది గాదు. ఈ డైరీలోగల కొన్ని వివర

* చూ: భారతి, మార్చి ౧౯౩౩, వంగోలు వెంకటరంగయ్యగారి వ్యాసము.

ములనుబట్టి మనకు చాల ప్రామాణిక విశేషములు విశదముగా తెలియవచ్చుచున్నవి. కస్తూరి రంగయ్యను గురించి తెలిసికొనగోరు ఆంధ్రసాహితీ ప్రియులకు ఈడైరీ ఒక విజ్ఞాన భాండారమగుటవల్ల ఇది వారికి చాల ఆదర పాత్రమైయున్నది.

ఆ డైరీలో ౧౭౪౭ ఆగస్టు ౨౪-వ తేదీ బుధవారము నాటి పద్దులచివర ఆనందరంగపిళ్లై ఇట్లు చెప్పుకొనియున్నాడు: "తిరుచినాపల్లినుండి కస్తూరి రంగయ్య అనునొక గొప్ప పండితుడు వచ్చి ఆనందరంగపిళ్లై గొప్పదనమును గురించి తెలుగులో ఛందోబద్ధముగా ఒక కవిత కట్టెను. తిరుచినాపల్లి నుండియే వచ్చిన మంగపతయ్య అను సంగీత విద్వాంసుడు ఆ స్తుతిపాఠమునకు మట్టులను ఏర్పరచెను. అదేరాత్రి సెద్దైవీథిలో ముత్తయ్య పిళ్లైగారి తోటయింటిలో ఆనందరంగపిళ్లై స్నేహితబృందపు సమక్షమున ఆగాథను నాట్య కత్తెలు అభినయము పట్టుచు పాడి ప్రదర్శించిరి."

ఆ మరుసటినెలలో ఆనందరంగపిళ్లై ఇటువంటిదే ఇంకొక సంగీతప్రదర్శనమును ఏర్పాటుచేసి, డూప్లేదొరను దానికి ఆహ్వానించెను. ఈ లోపుగా అతడు కస్తూరి రంగయ్యకు కావలసిన చరిత్రవివరముల నన్నిటిని చెప్పి డూప్లేదొరను గురించియు,ఆయన గావించిన గొప్పగొప్ప పనులను గురించియు ఒక తెలుగుపాట తయారుచేసి తెమ్మని యాజ్ఞాపించెను. పాట తయారై రాగానే ఆనందరంగపిళ్లై డూప్లేదొరకు ఆ పాటపైన కొద్దికొద్దిగా అభిరుచి కలిగించెను. ౧౭౪౭ సెప్టెంబరు ౧౮-వ తేదీ సోమవారమునాడు అతడు డూప్లేతో ఇట్లు చెప్పెను: "తాము గావించిన గొప్పపనులన్నియు పదము కట్టబడినవి. పాటలుగా పాడబడుచున్నవి." డూప్లే యిట్లు జవాబు చెప్పెను: "ఇదంతయు నీపనియే అయియుండును. నీకు తప్ప ఇన్ని వివరములు ఇంకెవరికిని తెలియవు." అనుచు ఆపాటను స్వయముగా వినుటకు తన సమ్మతిని వెల్లడించెను. మరుసటిరోజున ప్రదర్శన మేర్పాటు చేయబడెను. ఈసారి ఈ పాటకు వెంకట నారణప్ప అను మరి యొక సంగీతవిద్వాంసుడు మట్లు ఏర్పరచెను. ప్రదర్శనము సక్రమముగా జరిగెను. తన చరిత్ర తన సమక్షములో అంతగొప్పగా పాడబడినందులకు డూప్లే చాల సంతోషించెను. మరికొన్ని కల్పితవిజయములనుగూడ ఆపాటకు జతకూర్చుమని ఆయన కస్తూరి రంగయ్యను కోరెను.* ఆరీతిగా సవరింపబడి, పెంచబడిన ఆపాటను మరల ఒకసారి సాభినయముగా పాడి ప్రదర్శింపవలెననికూడ కోరెను. బహుశా డూప్లే దొరయొక్క ఈ కోరికను ఆనందరంగపిళ్లైయు, కస్తూరి రంగయ్యయు తీర్చియేయుందురు. 'బహుశా తీర్చియేయుందు' రననేల? ఆ ద్వితీయ ప్రదర్శనము జరిగిన నిదర్శనములు

---

* తనకు తానే బహుమానము లిచ్చుకొనుచు, సన్మానము లేర్పాటుచేయుచు 'నాటకములాడు'చుండిన డూప్లే స్వభావమునకు ఇది అనురూపమైనదే.

కూడ కనిపించుచున్నవి. ౧౭౪౮ అక్టోబరు నెల మధ్యలో పుదుచ్చేరి ముట్టడినుండి ఇంగ్లీషువారు ఉపసంహరించుకొనగానే డూప్లే పెద్దబరువు వదలినట్లు సంతోషించి, ఆ యుద్ధ విరామసమయమున సంతోష చిహ్నముగా, ఫ్రెంచి విజయములను వర్ణించుచు ఒక నాటకమును ప్రదర్శింప వలెనని అభిప్రాయపడెను. వెంటనే ఆనందరంగపిళ్లెను రావించి అతనితో ఇట్లనెను: "ఇంగ్లీషు వారికి ఈ యుద్ధములో తల మునకలైనది. వారికి చాలు చాలు ననిపించినది. వెనుకడుగు వేయుచున్నారు. కొన్నాళ్లక్రిందట ఫ్రెంచి విజయములను వర్ణించుచు ఒక నాటకమును ఆడుటకు ఏర్పాట్లు చేసియుంటిమికదా—నటీ నటులనుకూడ సిద్ధముచేసితిమికదా—కాని అప్పుడేదో ఆ ప్రయత్నమును మానుకొంటి మాయె. కాని, దాని నిప్పుడు మనము ప్రదర్శింపవచ్చును. వెనుక తయారైయున్న ఆనటీ నటులే ఈయుద్ధ మారంభమైనది మొదలు ఇప్పటివరకు జరిగినదంతయు పాడి చూప వలెను. అందుకు వలసిన సాధన వారి కివ్వ వలెను. నాట్యకర్తలనుగూడ తీసికొని రావలెను. ఈ ప్రదర్శనమునకు కావలసిన సహాయము నేను చేసెదను.నీవు వెంటనే అన్ని ఏర్పాట్లనుచేసి త్వరలోనే ఆనాటకప్రదర్శనము జరుగునట్లు చూడుము. ఆలసింపవద్దు." దీనికి ఆనందరంగపిళ్లెజవాబిది: "మీరు చెప్పుట, నేను ఆలసించుటయునా ? మీరు చెప్పినట్లు వెంటనే చేయుదును."

ఈ రీతిగా కస్తూరిరంగయ్య క్రమేణ ఆనందరంగపిళ్లె అభిమానమునకు ఒకరోజు కన్న ఒకరోజు ఎక్కువగా పాత్రుడు కాజొచ్చెను. పిళ్లెగారి ప్రాపకముతో, ఆయన పలుకుబడితో మన కవి ఒకముఖ్యమైనఉద్యోగమునుకూడ సంపాదింపగలిగెను. ౧౭౫౦ పూర్వార్ధమున తిరుచినాపల్లి సమీపములోని తుఱైయూరు పోలిగారయిన పాపురెడ్డి యనునతడు తనకు మంత్రిగానుండిన తన తమ్మునికొడుకునుండి తుఱైయూరునుపూర్తిగా తిరిగి లాగుకొనెను.అతనికిని ఇతనికిని సరిపడు చుండలేదు. అతడు ఉడయార్పాలెమునకు పారిపోయెను. పాపురెడ్డి ఆనందరంగపిళ్లె యొక్కయు, ఫ్రెంచివారియొక్కయు హృదయములలో స్థానము సంపాదించియుండెను. పిళ్లెగారి సలహాచొప్పున మన కవి ఆ తుఱైయూరు పోలిగారుకు వకీలుగా నియమింపబడియుండనోపును. ఏలయనగా, అటుపిమ్మట పిళ్లెగారి డైరీలో అతని ప్రస్తావము వచ్చినప్పుడు ౧౭౫౧ డిసెంబరు ౨౧-వ తేదీ పద్దులో అతడు 'కవీశ్వర కస్తూరిరంగయ్య - తుఱైయూరు వకీలు' అని పేర్కొనబడియున్నాడు. మరి కొన్నిచోట్ల గూడ అట్లే యున్నది. ఆపదవిని నిర్వహించుచు అతడు పుదుచ్చేరిలోనే కాపురముండినట్లును, అతనికి రోజువారీ బత్తాకూడ ఇచ్చుచుండినట్లును, అతని సంగీతమిత్రుడు కులశేఖరం వెంకట నారణప్పకూడ అతనితో పాటే పుదుచ్చేరిలో చేరినట్లును కూడ ఆ డైరీలోని మరికొన్ని పద్దులవల్ల తెలియుచున్నది.

కస్తూరి రంగయ్య మొట్టమొదట రచించిన ఆనందరంగపిళ్లై స్తుతియు, ఆనందరంగ రాట్ఛందముయొక్క పీఠికయు ఒకటేనో, లేక అది ఒక ప్రత్యేకరచనయో మాత్రము తెలియుటలేదు. పుదుచ్చేరిలో ఆనందరంగపిళ్లై యింటిలోని వ్రాతప్రతులను జాగ్రత్తగా పరిశీలించినచో ఈ విషయము కొంతమట్టుకు తేలవచ్చును. డూప్లే స్తుతి గాథకూడ బయటపడవచ్చును. అభిమానులెవరయినను ఈపనికి పూనుకొన్నచో కవీశ్వర కస్తూరి రంగయ్యనుగురించి సమగ్రముగా తెలిసికొనుటకు అవకాశ మేర్పడును.



# 'మాటాకు'

[శబ్దార్థవిచారము]

= శ్రీ గర్భాం అప్పారావు =

ప్రస్తుతము శబ్దరత్నాకరము, శబ్దార్థచంద్రిక, ఆంధ్రవాచస్పత్యము ప్రచారమందున్న ఆంధ్రనిఘంటువులు. సూర్యరాయాంధ్రనిఘంటు వింక ప్రచురింపబడునేమో! ఇప్పటికి ప్రచారమందున్న నిఘంటువులలో దేనియందును గొన్ని దేశ్యపదములు కాన్పింపవు.

సాధారణముగా దేశ్యపదము లేయే అర్థములందు వాడబడునో తెలుపుటకు జనసామాన్యము మాటాడు భాషయు, పూర్వకవుల ప్రయోగములును ఆధారములు. ఒక పదమున కర్థము వ్రాసి ప్రమాణముగా పూర్వకవి ప్రయోగములు చూపుట శబ్దరత్నాకరమున ప్రారంభింపబడినట్లున్నది. నిఘంటుకర్త ఒక పదమునకు తానిచ్చు నర్థము సరియైనదని నిరూపించుటకు తిక్కనాదిమహాకవి ప్రయోగములు చూపును. నిఘంటువున నీయబడిన యర్థము ప్రమాణపద్యమందలి సందర్భము ననుసరించి సరిపోవచ్చును. కాని కొన్నిచోటులందు నిఘంటుకర్త ఊహించిన అర్థము కాకపోవచ్చును. కొన్ని పదముల అర్థము ఊహించుటకుగూడ వీలుపడదు. ఉదాహరణము—'లప్ప' అను శబ్దము. దీనికి 'రాశి' అను నర్థము నిఘంటువునం దీయబడినది. చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రమున "ఉప్పనైనట్టి చక్కెరలప్ప లీడె" అను ప్రయోగము కలదు. 'లప్ప' అనుదానికి 'రాశి' అను నర్థమా, లేక అది ఒక భక్ష్యవిశేషమా అను సందేహము పై ప్రయోగమువలన తీరదు.

ఒకప్పుడు భారతిలో ఒకరు ఈ శబ్దము 'దోసిలి' మున్నగు శబ్దములవలె పరిమాణార్థమును దెలుపుచున్నదని విమర్శించిరి. అందుకు ప్రమాణ మేదియు లేదు. తారచంద్రునికొఱకు సిద్ధముచేసిన భక్ష్యవిశేషములలో శేషము వేంకటపతి ఈ శబ్దమును ప్రవేశపెట్టెను. తంజావూరుకవు లీశబ్దమును వాడుట చూడ నా ప్రాంతమున ఈ దేశ్యపదము ప్రచారమం దుండవచ్చును. అట్లే కొన్ని దేశ్యపదముల అర్థమును ఆయా ప్రదేశములలో దాని వాడుకనుబట్టి తెలిసికొనుట సరియైన పద్ధతి.

ఇక ప్రస్తుతాంశము—'మాటాకు'. శబ్దరత్నాకరమున దీనికి 'ప్రాకుడుకొయ్య' అను నర్థ మీయబడినది. సంస్కృతనామము 'ఉపఘ్నము' అని ఇచ్చిరి. అందుకు ప్రయోగము పోతన భాగవతాంతర్గత గజేంద్ర మోక్షకథలోని—

"పాదద్వంద్వము నేల మోపి పవనున్
బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్
మాటాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మ పదావలంబనరతిన్
గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించె గజపా
దాక్రాంతినిర్వక్రమై"

అను పద్య మీయబడినది. దీని ననుసరించియే కాబోలు శబ్దార్థచంద్రిక, ఆంధ్ర వాచస్పత్యములలో 'ప్రాకుడుకొయ్య' అను నర్థమే ఇచ్చి, ఆంధ్రవాచస్పత్యములో పై పద్యమే ఉదాహరణముగా నీయబడెను.

ఆంధ్రవాచస్పత్యమున ఈ'మాఱాకు' అను శబ్దము కాక 'మారాకు' అను నింకొక శబ్దముకూడ నీయబడి, దీనికి 'మొలకకు మొదట పుట్టిన ఆకుతరువాత పుట్టిన ఆకు' అను నర్థము వ్రాయబడినది. ఆనంద ముద్రాక్షరశాలయందు ముద్రింపబడిన భాగవతమున 'మారాకు' అని యున్నది. 'మాఱాకు' అని శకటరేఫము ఉపయోగించ లేదు.

ఇప్పు డీశబ్దము 'మాఱాకు' అనియా, లేక 'మారాకు' అనియా? అర్థము 'ప్రాకుడుకొయ్య' అనియా, లేక 'మొలకకు పుట్టిన ఆకునకు తరువాత పుట్టిన ఆకు' అనియా? విచారింతము.

ఆంధ్రవాచస్పత్యమున 'మారు' అను శబ్ద మిచ్చి దీనికి రూపాంతరము 'మాఱు' అనియు, 'మాఱు' శబ్దమునకు 'మారు' రూపాంతర మనియు నున్నది. ఏకార్థపదము లగు 'మాఱు', 'మారు'లకు భేదము లేనపుడును, మాఱు + ఆకు - మాఱాకు, మారు + ఆకు - మారాకు అగునపుడును 'మాఱాకు'నకు, 'మారాకు'నకు అర్థభేదము ఉండరాదు. అట్లయ్యు 'మాఱాకు'నకు, 'మారాకు' నకు వేఱువేఱు అర్థములు వ్రాయుటకు నాధారమేమో తెలియదు. 'మాఱాకు'పద్యమం దూహింపబడిన అర్థము ననుసరించి 'మాఱాకు' వ్యస్తపదముగా గ్రహించి అర్థము 'ప్రాకుడుకొయ్య' అని వ్రాయుట తటస్థించినది. 'మారాకు' సమస్తపదమైనపుడు 'మాఱాకు' సమస్తపదమే అగును. కావున 'మారాకు'న కిచ్చిన అర్థము 'మాఱాకు'నకు నీయవలెను. అనగా 'మాఱాకు'నకుగూడ 'మొలకకు మొదట పుట్టిన ఆకునకు తరువాత పుట్టిన ఆకు' అని అర్థము వ్రాయవలెను. లత కొన సాగుచున్నపుడు క్రొత్తఆకులు తొడుగుచునేయుండును. మొదట నొక ఆకు తొడుగును. కొనసాగుచున్నచో నింకొక ఆకు తొడుగును. ఇదియే మారాకు. 'మఱియొక ఆకు' అనుట. కావున ఇది సమస్తపదమే కాని వ్యస్తపదము కాదనుట. ఇది వ్యస్తపదమే యైనచో ఆంధ్ర వాఙ్మయమందలి గ్రంథజాలములో వేఱొక గ్రంథమున 'ప్రాకుడుకొయ్య' అర్థమున వాడబడి యుండదా? రెండు నిఘంటువులకు ప్రమాణముగా నొకటే పద్యము కాన్పించెనా? సమస్తపదము లనేక విధములుగా కల్పింపవచ్చును. కావున నొక విధమగు సమస్తపదము నొక కవి కల్పించి వాడవచ్చును; ఇంకొక కవి వాడకపోవచ్చును. ఆ పదము వ్యస్తపద మని భావించి యితరగ్రంథములలో వెతకిన కానరాక పోవచ్చును. అందుచేతనే ఈ 'మాఱాకు' అను పదమునకు నింకొకగ్రంథమందు ప్రయోగము కానరాకపోవుట.

ఇక పద్యార్థము ననుసరించి 'మాఱాకు' అర్థ మూహింపవచ్చును. మకరము గజముతోఁ బోరునపుడు——

"ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్
హుమ్మంచు బాదంబులన్
దిరుసన్ గంతము వెన్ను దన్ను నెగయున్
హేలాగతిన్ వాలమున్

జలచున్ సుగ్గగ దాకు ముంచు మునుగున్
శల్యంబులున్ దంతముల్
విలుగన్ వ్రేయుచు బొంచి పొంచి కదియున్
శేదండయూథోత్తమున్."

మొదట బుద్ధివికాసము చాలక గజమును లోగొనుట కనేకవిధోపాయములు చేయుచు జివరకు బుద్ధిలతకు మాఱాకు హత్తించి ఏకాగ్రచిత్తమున తా నవలంబింపవలసిన మార్గ మవలంబించి గజమును 'త్రాహి, త్రాహి' యనిపించెను. లతకు ప్రాకుడుకొయ్య హత్తించినంత మాత్రమున లతకు నభివృద్ధి కలిగి వికాసము కలుగునని తలంప వీలులేదు. ప్రాకుడుకొయ్య ఆధారముగల లతలు కొన్ని అభివృద్ధిచెందక కారణాంతరములచే కృశించుటయు కలదు. గుమ్మడి మొదలగు తీగెలు భూమిమీదనే ఎక్కువ వృద్ధికలిగి కొనసాగుచుండును. కావున (బుద్ధి) లత అభివృద్ధిపొందుటకు ప్రాకుడుకొయ్య చాలదు. లత మాఱాకు వేసినపుడే దానికి అభివృద్ధివికాసము కలిగియున్నట్టు లగును. లత 'కోటాకు' వేసినచో దాని అభివృద్ధి అడుగంటినట్లే యగును. ఈ 'మాఱాకు'పదము 'కోట్రాకు' అను పదమువలె సమస్తపదమే కాని వ్యస్తపదము కాదు. అందుచే దాని యర్థము 'మఱియొక క్రొత్త ఆకు' అనియే కాని 'ప్రాకుడుకొయ్య' కాదు. ఎవరైన గజేంద్రమోక్షములో నీ పద్యము చదువుచు 'మాఱాకు'పదముయొక్క అర్థముకొఱకై నిఘంటువు చూచునపుడు అందలి అర్థము గ్రహింపకుండుటకై యీవ్యాస ముద్దేశింపబడినది. పాఠకులు విమర్శింతురుగాత!

నిఘంటువులలో గొన్ని దేశ్యపదములు లేవు.

'జోగు'–క్రియ. ఒఱగు 'అను నర్థము. 'చెట్టు జోగిపోయెను', 'వాడు జోగుచు నడచుచున్నాడు' మొదలగు ప్రయోగములు మాప్రాంతమునగలవు. 'కన్నె'-పశువుల గిట్టు త్రాడు. ఇట్లే కొన్ని దేశ్యపదములు నిఘంటువున గాన్పింపవు.



# కవులు — పాణినీయ పరిచయము*

= శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి =

"పాణినీయము కావ్యభాషానుశాసకము కాదు. అనఁగా లక్షణ కర్తలగు మునిత్రయమువారు తమ కాలమునకుఁ గల కవుల వాఙ్మయమును ప్రమాణముగాఁ జేసికొని తాము లక్షణ మేర్పఱుపలేదు. పాణినీయమునకుఁ దరువాతి మహాకవులు తమ కావ్య వాఙ్మయమునకుఁ బాణినీయమును ప్రమాణముగాఁ గొనలేదు" అని శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి వాదము. ఇతర వాఙ్మయముతో పాటు కావ్య వాఙ్మయమును గూడఁ బ్రమాణముగాఁ గొని మహాకవి ప్రయోగము లనేకములు మహాభాష్యములో సాధింపఁబడినవి కనుకను, మఱికొన్ని నిదర్శనములు సయితమీ వాదమునకు విరుద్ధములుగా నున్నవి కనుకను మునిత్రయమువారి యాశయ మట్టిది కాదని మఱియొకచో నిరూపించితిని. ఇఁకఁ బాణినీయమునకుఁ దరువాతి మహాకవులు తమ వాఙ్మయమునకుఁ బాణినీయమును ప్రమాణముగాఁ గొనినవారు కారను వాదము యుక్తియుక్తము కాదని కావ్యములలోఁ గవు లుదాహరించిన వచనములఁ బట్టియే నిరూపించుచుఁ గవులకుఁ గల పాణినీయపరిచయమునుగూడఁ గొంత విశదపఱచెదను. సుప్రసిద్ధమహాకవుల కావ్యములే కొన్ని ప్రత్యక్షముగాఁ బాణినీయము కావ్యభాషానుశాసక మని సాక్ష్యమిచ్చుచున్నవి. వానిని గొన్నిటి నిట నుదాహరించెదను.

## రావణార్జునీయము

పాణినీయసూత్రములను బైన నుదాహరించి వానికిఁ గ్రింద లక్ష్యముగా నీ మహాకావ్యమును భీమసేనమహాకవి రచించినాఁడు. పాణినీయలక్ష్యముగా నిట్లు వ్రాయఁబడిన యీ మహాకావ్యము కవులు తమ భాషకుఁ బ్రమాణముగాఁ గొనినది పాణినీయ మని నిర్వివాదముగాఁ జాటుచున్నది కదా! ఈ కావ్యములోని శ్లోకపాదములు రెండు మహాభాష్యకర్త 'అనువాదే చరణానామ్' అను సూత్రమునకు లక్ష్యములుగాఁ బ్రదర్శించి సాధించినాఁడు.

## భట్టికావ్యము

భట్టి పైకావ్యమును జూచియే యీ కావ్యమును వ్రాసినాఁడు. పాణినీయసూత్రములు మాత్ర మిందుదాహరింపఁబడలేదు. వ్యాకరణమునకు లక్ష్యముగా నీ కావ్యమును వ్రాసినా నని యీగ్రంథకర్తయే యంతమునఁ జెప్పికొనినాఁడు. ఆ వ్యాకరణము పాణినీయ మని యీ కావ్యమే చాటుచున్నది. ప్రతిపదమును నిందుఁ బాణినీయానుశిష్టమే. రామభద్రయజ్వ పతంజలిచరితమునఁగూడ నీతఁడు చదివినది పాణినీయ మనియే వ్రాసినాఁడు.

## వాసుదేవ విజయము

పాణినిరచితమగు నష్టాధ్యాయికి లక్ష్యముగా శ్రీకృష్ణచరిత్రప్రతిపాదకమగు నీ మహాకావ్యము వాసుదేవకవిచే వ్రాయఁబడినది. పాణినీయలక్ష్య మీ మహాకావ్య మని యొక మహాకవి తన కావ్యారంభమున నిట్లు చెప్పినాఁడు: "ఉదాహృతం పాణిని సూత్రమండలం ప్రాగ్వాసుదేవేన" (ధాతుకావ్యము, ౧-౧) వ్యాఖ్య— "పాణినేః సూత్రాణి పాణినిసూత్రాణి, తేషాం మండలం సమూహః, ఉదాహృతం ఉదాహరణైః ప్రకాశీకృతమ్." స్థాలీపులాకన్యాయముగాఁ

* 'పాణినీయము - కావ్యభాష' అను శీర్షికలో నిది మూఁడవ వ్యాసము.

బాలకలోక మెఱుఁగుటకు రెండు శ్లోకములు వాసు దేవవిజయకావ్యమునుండి యిట నుదాహరించెదను.

"పైతృష్వస్రీయాశ్చ మాతృష్వసేయాః
కుల్యాః స్వస్రీయాశ్చ కాల్యాణినేయాః,
యే భ్రాతృవ్యా యే శ్వశుర్యాః కులీనాః
కౌరవ్యా యే చాపి మాహాకులీనాః"

"గ్రైవా గర్గా యేచ దాసేరదేశ్యా
స్తాక్షణ్యాద్యా యే పున ర్దాష్కులేయాః,
సర్వాన్ శౌరి ర్వ్యక్త సర్వాగమస్తా
నార్చీ దుచ్చై ర్దైష్టికోఽసుప్రధానమ్"
(౧-౬౭, ౬౮)

ఇందు పాణినీయసూత్రము లెన్ని యీ శ్లోక గర్భమున నణఁగియున్నవియో గమనింపుఁడు.

పైతృష్వస్రీయాః — (పితృష్వసు శ్ఛణ్) అపత్యార్థమున 'ఛణ్' ప్రత్యయము.

మాతృష్వసేయాః — (మాతృష్వసుశ్చ) 'ఢక్' ప్రత్యయము, (ఢకి లోపః) లోపము.

కుల్యాః — (అపూర్వపదా దన్యతరస్యాం యడ్ఢకఞౌ) 'యత్' ప్రత్యయము.

స్వస్రీయాః — (స్వసు శ్ఛః) ఛ ప్రత్యయము.

కాల్యాణినేయాః — (కల్యాణ్యాదీనా మినఙ్) 'ఢక్' ప్రత్యయము, 'ఇనఙ్' ఆదేశము.

భ్రాతృవ్యాః — (భ్రాతు ర్వ్యచ్చ) 'వ్యత్' ప్రత్యయము.

శ్వశుర్యాః — (రాజశ్వశురా ద్యత్) 'యత్' ప్రత్యయము.

కులీనాః — (కులా త్ఖః) ఖ ప్రత్యయము.

కౌరవ్యాః — (కుర్వాదిభ్యో ణ్యః) ణ్య ప్రత్యయము.

మాహాకులీనాః — (మహాకులా దఞ్ ఖఞౌ) 'ఖఞ్' ప్రత్యయము.

గర్గాః — (గోత్రస్త్రియాం కుత్సనే ణచ) 'ణ' ప్రత్యయము.

దాసేర — (క్షుద్రాభ్యోవా) 'ఢ్రక్' ప్రత్యయము.

తాక్షణ్యాద్యాః — (సేనాంతలక్షణకారిభ్యశ్చ) 'ణ్య' ప్రత్యయము.

దాష్కులేయాః — (దుష్కులా డ్ఢక్) 'ఢక్' ప్రత్యయము.

దైష్టికః — (అస్తినాస్తిదిష్టంమతిః) 'ఠక్' ప్రత్యయము.

కావ్యమంతయు నిట్లే యున్నది. పాణినీయము కావ్యభాషానుశాసక మనుట కీకావ్యపద్య మొక్కటి చాలదా ?

## సభ్యాభరణము

ఇది పాణినీయమును శ్లేషభంగితోఁ బ్రతిశ్లోకమునను నభివర్ణించుచు వ్రాసిన ద్వ్యర్థికావ్యము. ఈ క్రింది శ్లోకములను చిలకింపుఁడు:

" పాణినీయార్థకనకైః కలితశ్లేషమౌక్తికైః,
తన్యతే రామచంద్రేణ సభ్యాభరణ ముత్తమమ్. "

"విభాషాసాకాంక్షే ల్యుటివ న యస్య క్వచిదపి
క్వచి చ్చావజ్ఞానం పరిభవఇ వోదేతి చ న యః,
నిషేధే న్నిందాదీ న్న చ వ్యతివయ స్తం ప్రణమతా
వదాతం సచ్ఛబ్దప్రథిత ముదితం శానచమివ."

(సభ్యాభరణము, సవ్యాఖ్యానము. చూ: ఓరియంటల్ లైబ్రరీ, నం. R ౬౭౯)

ఇట్టి పుస్తకము లింకను ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునఁ గాటియాకుల ప్రతులలో నణఁగి యున్నవి.

ఈ కావ్యములనుబట్టి యూహింపుఁడు—పాణినీయమునఁ గవు లెంతగాఁ బరిశ్రమించిరో! కావ్యభాషానుశాసకము కాని పాణినీయమున నింతటి పరిశ్రమము వారేల సలుపవలయును? పరిశ్రమించినను నావ్యాకరణమున కీ మహాకావ్యములలోఁ దావొసంగ నేల ? పాణినీయమునకంటె విలక్షణముగాఁ గావ్యభాషానుశాసకమగు మఱియొక వ్యాకరణమే కవుల నాఁ డుండినచో దానినే శ్లేషభంగులతోఁ గవు

లభివర్ణింపరా? ఉపమాదులతో నుపమింపరా? ఉత్ప్రేక్షాదులతో నుత్ప్రేక్షింపరా? తుదకుఁ దన్నామస్మరణమునకైనను గడఁగిన మహాకవి లేఁడే! మహాకావ్యము లేదే! మఱియును వ్యాకరణావశ్యకత కవులకుఁ గలదని మహాకవు లీక్రిందివిధమున వ్రాసియున్నారు:

"సంస్కారవత్యేవ గిరా మనీషీ"

(కు.సం.౧-౨౮)

"కవయ స్తదపేక్షిణో తరూ
న్వ్యథయామాసు రసాధుభిః పదైః,
పదశాస్త్ర ఇవానధీతినః
కవయః కర్ణపథా న్విపశ్చితామ్"

(పతంజలిచరితము, ౩-౩౬)

హేమచంద్రుఁడుకూడఁ గావ్యానుశాసనమున 'వ్యుత్పత్త్యభ్యాసాభ్యాం సంస్కార్యా' అనుసూత్రమునందుఁ గవికి వ్యాకరణపరిచయ మావశ్యక మనినాఁడు. ఆ వ్యాకరణము పాణినీయమే యని మన మనుచున్నాము. కాదని శ్రీశాస్త్రిగారు వాదులాడుచున్నారు. ఐనఁ గవులు పాటించిన కావ్యభాషానుశాసకమగు మఱియొక వ్యాకరణ మేది యని మనము శ్రీ శాస్త్రిగారి నడుగుదము. వారు కవులనాఁటి కది సుప్రసిద్ధముగా నుండి యీనాఁడు నశించిన దందురా? ఆనాఁడట్టి వ్యాకరణమే లేక యీనాఁ డది క్రొత్తగా వ్రాయఁబడవలయు నందురా? వ్యాకరణమును జదువని కవులను గవులతో నుపమించుచున్న మహాకవులు నాఁడు కావ్యరచనోపయోగివ్యాకరణమే లే దనువాదము నంగీకరింపరు. ఇఁకఁ గావ్యరచనోపయోగి వ్యాకరణము కవులనాఁటికే ప్రసిద్ధమైయున్న వారు దాని నామమైనను స్మరింపకుండుటయు, శాస్త్రిగారి సిద్ధాంతప్రకార మే శిష్ట వ్యవహార భాషకొఱకో రచింపఁబడి కావ్య వాఙ్మయమున కుపకరింపక యజాగళ స్తనమువలె నున్న పాణినీయము నప్రస్తుతముగాఁ దమ కావ్యములలోఁ బూర్వము నాయుదాహరించిన శ్లేషభంగులతోడను, ముం దుదాహరింపనున్న యుపమాదులతోడను ననేక విధములుగా నభివర్ణించుటయు నసంగతము. కావున వ్యాకరణావశ్యకత గల మహాకవులు సర్వభాషానుశాసకమగు వ్యాకరణమునే కావ్య వాఙ్మయమునకును బ్రమాణముగాఁ బాటించి రనుట నిర్వివాదాంశము. ఇఁకఁ గవులు 'పాణినీయము కావ్యభాషానుశాసక' మనుటకుఁ గావ్యములలోఁ జూపిన మఱికొన్ని నిదర్శనములు సయితము మహాకావ్యములనుండి యీక్రింద నుదాహరించి వారి పాణినీయపాండిత్యమునుగూడఁ బాఠకలోకమునకు వెల్లడించెదను.

### శిశుపాలవధము-మాఘమహాకవి

"నిపాతితసుహృత్స్వామి
పితృవ్యభ్రాతృమాతులమ్,
పాణినీయమి వాలోచి
ధీరై స్తత్సమరాంజిరమ్" (౧౯-౭౫)

ఈ శ్లోకమున మాఘమహాకవి యుద్ధభూమిని బాణినీయముతో నుపమించినాఁడు. మిత్త్రులు, ప్రభువులు, పితృవ్యులు, భ్రాతలు, మాతులులు సంహరింపఁబడినారు — అని యుద్ధపరమగు నర్థము. పాణినీయమునఁ బ్రక్రియాప్రదర్శనము లేకయే స్వస్వరూపములతోఁ గొన్ని శబ్దములు సూత్రాదులలో నుచ్చరింపఁబడి సాధువు లగుచున్నవి. అట్టి శబ్దములు వైయాకరణ సంప్రదాయప్రకారము నిపాతము లనఁబడును. ఈ క్రిందిశబ్దములను బాణిని స్వసూత్రములలో నిట్లు నిపతించినాఁడు:

"సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః", "స్వామి న్నైశ్వర్యే", "పితృవ్యమాతుల మాతామహ పితామహాః", "నప్తృ నేష్టృ త్వష్టృ హోతృ పోతృ భ్రాతృ జామాతృ మాతృ పితృ దుహితృ"

(ఉణాది, ౨ పా)

కావుననే నిపాతిత సుహృత్స్వామి పితృవ్య భ్రాతృమాతులను పాణినీయ మనినాఁడు మహాకవి. మఱియొకచో —

"అనుత్సూత్రపదన్యాసా
సద్వృత్తి స్సన్నిబంధనా,
రాజవిద్యేవ నో భాతి
రాజనీతి రపస్పశా" (౨-౧౧౨)

పాణినీయమునకుఁ గాశికావృత్తి న్యాసము మొదలగు వ్యాఖ్యానము లెన్నియో కలవు. ఐనను 'పస్పశము' లేని పాణినీయమువలెఁ జారులు లేని రాజవిద్య

రాణింపదని యీ మహాకవి యనినాఁడు. వ్యాకరణ ప్రయోజనాద్యనేకవిషయములఁ జర్చించుచుఁ బాణినీయమున కుపోద్ఘాతరూపముగా మహాభాష్యమునఁ బ్రథమాహ్నికమును బతంజలి రచించినాఁడు. దీనికిఁ బస్పశ మని పేరు.

ఇట్లు పాణినీయమును, దద్వ్యాఖ్యానములను నామ నిర్దేశముతో గ్రహించి శ్లేషభంగితో నుపమించియున్న మహాకవి పాణినీయము కావ్యభాషానుశాసకము కాదనినాఁడా ?

## నైషధము - శ్రీహర్షుఁడు

"ఇహ కిముషసి పృచ్ఛాశంసి కిం శబ్దరూప
ప్రతినియమితవాచా వాయసేనైష పృష్టః,
భణ ఫణిభవశాస్త్రే తాతఙః స్థానితా కా
వితి విహితతుహీవాగుత్తరః కోకిలోఽభూత్"

(౧౯–౬౦)

"ఓ నలమహారాజా ! కాకు లఱచుచున్నవి. కోయిలలు కూయుచున్నవి. తెలతెలవాఱవచ్చినది. నిద్ర మేల్కొనుము" మని దీని భావము.

ఈ భావమునే కవి యీ క్రిందిరీతిని జమత్కరించెను. ప్రాతఃకాలమున 'కా, కా' యని కాకు లఱచుటయు, 'తుహీ, తుహీ' యని కోయిలలు కూయుచుండుటయు సుప్రసిద్ధము. 'కా' అనునది ప్రశ్నార్థకమగు కింశబ్దమునకుఁ బ్రథమాద్వివచనరూపము. అట్లనుటచే దమజాతివైరమును బురస్కరించుకొని వాయసము పికమును బాణినీయమునఁ బరీక్షించుచున్నది. 'కా, కా'—'తాతఙ్' ఆదేశము వచ్చు స్థానము లేవి యని. కోయిల ప్రశ్నానుగుణమగు సమాధానము నిచ్చుచున్నది. 'తుహీ, తుహీ' అని. పాణినీయమున భూధాతువుయొక్క భవతాత్ - భవతాత్ అను ప్రథమ మధ్యమపురుషైకవచనములను సాధించుటకు 'తు' (ప్రథమపురుషైకవచనము), 'హి' (మధ్యమపురుషైకవచనము) అను స్థానులకు 'తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్' అను సూత్రముచే 'తాతఙ్' ఆదేశమును బాణిని విధించినాఁడు.

దీని పైశ్లోకమునుగూడఁ దిలకింపుఁడు.

"దాక్షీపుత్రస్య తంత్రే ధ్రువ మయ మభవ
త్కోఽప్యధీతీ కపోతః
కంఠే శబ్దౌఘసిద్ధిక్షతబహుకఠినీ
శేషభూషానుయాతః,
సర్వం విస్మృత్య దైవాత్స్మృతి ముపసి గతాం
ఘూర్ఘమయ న్నో ఘుసంజ్ఞాం
ప్రాక్సంస్కారేణ సంప్రత్యపి ధువతి శిరః
పట్టికాపాఠజేన"

మెడమీఁది తెల్లని తనూరుహపంక్తి కంఠమునఁ దాల్చిన బలపపుభూషణమువలె నుండ నొకపావురము ఉషఃకాలమున నొకచోఁ గూర్చుండి తలయూఁపుచు 'ఘు, ఘు' అని కూయుచుండెను. దానిని జూచి కవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు : "ఈకపోతము పూర్వజన్మమున దాక్షీపుత్రుఁడగు పాణినిమునికి శిష్యుఁడైన కపోతుఁడై యుండవచ్చును. కావుననే పాణినియొద్దఁ దాఁ జదివిన వ్యాకరణమంతయును మఱచిపోయి దైవికముగా నుషఃకాలమున స్మృతికివచ్చిన 'దాధాఘ్వదాప్' అను పాణినిసూత్రవిహిత 'ఘు' సంజ్ఞను—వెనుకటి జన్మమునఁ బలకపై వ్రాసికొని తలయూఁపుచు వల్లించియుండుటచే నిప్పుడుగూడ నట్లే – తలయూఁచుచు వల్లించుచున్నది" అని.

ఇట్లు తన కావ్యములోఁ బాణినీయమునందలి స్థాన్యాదేశములను, సంజ్ఞలనుగూడ నుత్ప్రేక్షలతోఁ జిత్రించిన యీ మహాకవి పాణినీయము తన కావ్యభాష కనుశాసకము కాదనియే చెప్పినాఁడా ?

## వాసవదత్త - సుబంధువు

"వ్యాకరణేనేవ సరక్తపాదేన" (౭౧ పు)

వ్యాఖ్య—"తేనరక్తం రాగాత్ ఇత్యాదిపాదః రక్తపాదః."

మఱియొకచో—"వ్యాకరణమివ స్త్రీనదీకృత్య బహులమ్." (౭౩ పు.)

వ్యాఖ్య—"స్త్రీనదీకృత్యబహుళమితి—వ్యాకరణే స్త్రీప్రత్యయః, నదీసంజ్ఞా, కృత్యప్రత్యయః, బహులగ్రహణంచ"

స్త్రీప్రత్యయములు 'స్త్రియామ్' అను అధికారమున విధింపఁబడిన జీపాదులు.

కృత్యప్రత్యయములు 'కృత్యాః ప్రాజ్ ణ్వులః' బహులము— 'కృత్యల్యుటోబహులమ్' ఇత్యాదులు.

ఇవి యన్నియుఁ బాణినీయమునవే కొనఁబడుచున్నవి.

## విశ్వగుణాదర్శము- వేంకటాధ్వరి

ఈతఁడు పాణినీయమునుగూర్చి యిట్లు ప్రసంగించినాఁడు:

"అస్వీకృతవ్యాకరణోపధానా
మపాటవం వాచి సుగాఢ మాస్తే,
కస్మింశ్చి దుక్తేతు పదే కథంచిత్
స్వైరం వపుః ఖిద్యతి వేపతేచ"

పాణినీయమును జదువనివాఁడు సంస్కృతమున నొక మాట మాటాడుటకైనను ధైర్యము చాలక యపశబ్దభయమునఁ బైత్యరోగివలె శరీరమంతయు వడఁకాడ స్వేదమున మునిఁగితేలునఁట. కావ్యభాషకే కాదు, నాఁటి వ్యవహారమునకు సయితము పాణినీయము మూలాధారమని యీకవి యొప్పికొనినాఁ డనుటకిఁక నభ్యంతర మున్నదా ?

"కృశానుః—కథం సఖే, శతకోటి1 పాణినిగదితాదపి పాణినిగదితమేవ వ్యాకరణ మాద్రియతే ?

విశ్వావసుః — పాణినీయ మేవ వ్యాకరణంహి ప్రాయే ణానాపాధికప్రవిశదప్రతీతికారణ మితి తత్రైవాదరః పండితానామ్."

వ్యాఖ్య— "పాణినే రిదం పాణినీయమ్. అనౌపాధికం వ్యాకరణాంతరానపేక్షం యథా తథా ప్రవిశదాయాం నిర్దోషాయాం ప్రతీతౌ శబ్దతత్త్వవిజ్ఞానే కారణం పాణినివ్యాకరణమేవ."

ఐంద్రాదివ్యాకరణము లనేకము లుండఁగాఁ బాణినీయమునే యెల్ల రాదరించుటకుఁ గల కారణమేమని కృశానుఁ డడిగినాఁడు. ఇతర వ్యాకరణముల వలె వ్యాకరణాంతరాపేక్ష లేక సాధుశబ్దముల నశేషముగా సాధింపఁగలుగుటయే పాణినీయమును బుధులాదరించుటకుఁ గల కారణ మని విశ్వావసుఁ డనుచున్నాఁడు.

మన శతగ్రంథకర్త మఱియు నేమనుచున్నాఁడో పరిశీలింతము.

"సూత్రం పాణినిబద్ధం
కంఠే కలయన్ సముద్వహతి సుదృశమ్,
వర్ణాదీనాం ధర్మాన్
బుద్ధ్వా విధివ ద్బుధః ప్రయుంక్తేఽసౌ"
(విశ్వ. వైయాకరణప్రశంస)

బుధుల శబ్దప్రయోగము పాణినీయమూలక మని స్పష్టముగా నుడువుచున్నాఁడు. వేంకటాధ్వరి 'అసౌ బుధః ప్రయుంక్తే' అని తాను వ్రాసిన కావ్యములన్నియుఁ బాణినీయమూలకములే యని వ్యంగ్యమర్యాదాభిజ్ఞుల కెఱుకపఱచినాఁడు. పాణినీయము కావ్యభాషానుశాసక మని కవు లొప్పికొనిరనుటకిఁక సందేహ మేమైనఁ గలదా ?

## మఱియొక మహాకవి

"నపుంసక మితి జ్ఞాత్వా
ప్రియాయై ప్రేషితం మనః,
తత్తు తత్రైవ రమతే
హతాః పాణినినా వయమ్." (చాటువు)

మనశ్శబ్దము నపుంసక మని పాణిని చెప్పఁగా నీ కావ్యకర్త తెలిసికొనినాఁడఁట.

## నామలింగానుశాసనము- అమరసింహుఁడు

ఈకోశ మనేక మహాకవి ప్రయోగములఁ బరిశీలించి కావ్యభాషకొఱకే కూర్పఁబడిన దని యందఱకు విదితమేకదా ! ఇందలి పదము లన్నియుఁ బాణినీయానుశిష్టములే. కనుకనే యొక మహాకవి "అమరసింహోహి పాపీయాన్ సర్వం భాష్య మచూచురత్" అని

---

1. శతకోటిః పాణౌ యస్య సః—ఇంద్రః.

నాఁడు. పాణినీయమహాభాష్యమును నిశ్శేషముగా నమరసింహుఁడు దొంగిలించినాఁడఁట. అమరకోశము లోని పదము లన్నియుఁ గావ్యభాషలోనివి.

ఇఁక నేమైనదో కొంచె మాలోచింపుఁడు. పాణినీయము కావ్యభాషానుశాసక మైనది. ఇది కాక భోజుఁడు, హేమచంద్రుఁడు మొదలుగాఁగల లక్షణ కర్తలును మహాకవు లెల్లరును దమ లక్షణగ్రంథములలోఁ పాణినీయమును బట్టియే మహాకావ్యప్రయోగముల సాధుత్వాసాధుత్వములఁ జర్చించిరి.

ఇట్లు కవు లందఱు నేకముఖముగాఁ గావ్యభాషకు మే మాదరించిన వ్యాకరణము పాణినీయమే యని స్వవచనములతో మన కెఱుకపఱచుచున్నారు. కవు లాధారముగాఁ గొనినది పాణినీయము కాదని శ్రీశాస్త్రిగా రనుచున్నారు. పాఠకులారా! మన కెవరి వాద మంగీకరణీయమో మీరే నిర్ణయింపుఁడు.



# ప్రమాదం

[ కథానిక ]

= శ్రీ బూర్గుల రంగనాథరావు =

౧

రెండో సంబంధమయినా, మా ఆయనా నేనూ యెంత అన్యోన్యంగా వుంటామో నీకు తెలుసు. పాపం! ఆయన నన్ను యెంతో ప్రేమతో చూస్తారు. నేనూ చాలా యిదిగావుండి ఆయనే నా సర్వస్వమనుకుని ఆ దాంపత్యంతో తృప్తిపడుతూ ఈ నాలుగేళ్లూ యెట్లాగో నెట్టుకవచ్చాను. నాకు పిల్లలు కాలేదే అనే చింతతప్ప యింకేకొఱతా జీవితంలో లేదనిపించేది. సవతిపిల్లలనే—ఇంచుమించు నా యీడువాళ్లే యిద్దరుకొడుకులు—నాపిల్లలుగా చూసుకుంటూ నాకు లేదనే కొఱతను తొలగించుకొని, నిరాశతోనే ఆశను చంపేసుకుని హాయిగా వున్నాను యింతవరకూ. ఆనందంగా వుండి, అందంగా కనపడి, ప్రేమతో సుఖంగా వున్నామని ఒకరినొకరిని మోసగించుకొని మేము తృప్తిపడ్డాము. అంచేతే మా ప్రేమ వేధించక ఆనందదాయకంగా వుంది!

ఒకరిమీదే లగ్నం అయి అణగి అంతర్నిస్తావుండిన ఆ రెండక్షరాల 'ప్రేమ'శక్తి జానకిరాంను చూసిన తర్వాత మళ్లీ నాలో ఉబికిరావడం నాకే ఆశ్చర్యం కలిగించింది. ఎప్పటినుండో దాగివుండిన కోర్కెలు ఒక్కమారే సైరెన్‌వలె రంకెవేశాయి. ఎండిపోయిన నాహృదయం చిగిర్చి, చలించిపోయింది. ఇంతవరకూ 'ప్రేమ' అంటే నాకు ఒక భౌతికఅవసరమనీ, అంతకన్నా యెక్కువ నేను నోచుకోలేదనీ, అది నా ప్రకృతికే విరుద్ధమేమో అనీ యేమేమో నచ్చజెప్పుకునేదాన్ని. కాని జానకి నా జీవితాన్ని తలక్రిందులు చేశాడు. దేన్ని నేను తృణీకరించి వుంటినో దాన్ని నాకు సర్వస్వంగా చేశాడు. దేని విషయం నేను మరచివుంటినో దాన్ని ఒక విషమసమస్యగా నాముందర తీసుకవచ్చాడు. ఇన్నిరోజులనుంచీ అతడు నా జీవితంతోపాటు యెదిగిపోయి నాలో యెక్కడో దాగివున్నట్టు అనిపించింది. నాహృదయం అతనికి పోగొట్టుకున్నాను. ఇదివరకు గడచిన నా జీవితం నాకు తెలియకుండానే గడచిపోయినట్టూ, అది మళ్లీ ఓమారు మొదటినుండీ ప్రారంభమౌతే బావుండునులా కనుపించింది. ప్రణయం (Romance) నాలో చితికిపోలేదనీ, అప్పుడే నేను దాన్నుంచి పూర్తిగా దూరంకాలేదనీ తెలుసుకునేసరికి నావళ్లు ఝల్లుమంది. మనసు విచ్చలవిడిగా, నిర్లక్ష్యంగా, 'టాంకు'లకన్నా ఘోరంగా పరుగెత్తడం మొదలెట్టింది. ఒక కొత్త నవయువ్వనుడికోసమై—అందులో జానకిలాంటి విద్యాధికుడూ, ఉత్తముడూ, రూపవంతుడికై—అతని ఓ వాలుచూపు, ఓ చిరునవ్వు, ఓ నిట్టూర్పుకోసమై నేనలా బాధపడగలిగినందుకు సంతోషం పట్టలేకుండా అయ్యాను. ప్రణయం అనుభవించని కోటానుకోట్లమంది తప్పుకుంటూననే ఆశ కలిగింది. అతని సుముఖత్వం (Response) నా ఆశకు అంతులేకుండా చేసింది. ఆ ఆశాపథంలోనే ఒక మధుర స్వప్నం, ఆనందరేఖ, దివ్యతేజస్సు పొడగట్టింది!!

అతడిని చూడగానే యెన్నో ఆలోచనలు మిషీన్‌గన్‌మరలోవలె నా తలలో తిరిగిపోయాయి!

౨

అసలు మొదట యిట్లా ప్రారంభమయింది. కొన్నిరోజులపాటుకని నేను మా పుట్టింటికి వెళ్లాను.

అప్పుడే మామేనత్తా (రుక్మిణి), ఆమెభర్త జానకి వచ్చారు. ఆమె నాకంటే చిన్నది. ఇదివరకెప్పుడూ నేను అతడిని చూడలేదు. వాళ్ల పెళ్లికి మేము వెళ్ల లేకపోయాం. జానకికి యిరవై నాలుగే వుంటాయి. అతనికి తన భార్యమీద ప్రేమ వుందో లేదో కాని అతడికీ, ఆమెకూ విచిత్రంగా ముడిపడ్డది.

నేను వెళ్లిన మొదట్లో అతనికి నన్ను చూడాలనీ, నాతో మాట్లాడాలనీ సహజమైన కుతూహలం కలిగి వుంటుంది. కాని నేను కొంత సిగ్గుతో, కొంత కావాలనీ అతనికి వీలుపడనివ్వకపోవడం అతని కుతూహలాన్ని తీవ్రమైన కోర్కెగా మార్చింది. "ఎంత చదువుకున్నా ఈ ఆడవాళ్లకు మగవాళ్లంటే అంత భయం యెందుకో" అని ఒకసారి నేను వినేట్టు తన భార్యతో అన్నాడు. ఆ మాటలు అంటున్నప్పుడు అతని పెదవుల్లో ఒలికిన చిరునవ్వును నేను యిప్పటికీ మరవలేను. నేను కొంచెం 'ఫీల్' అయ్యాను. జాలి వేసింది, నాపట్టుదల మానుకున్నాను. పోనీ, తనే తాను ధైర్యంగా నాకళ్లలోకి చూడడే! అతని అమాయకత్వంలో యేదో ఆకర్షణ వున్నట్టూ, అతని కళ్లు దేనినో తీవ్రంగా వాంఛిస్తున్నట్టూ కనపడ్డవి. నేనుకూడా యేదో సాకుతో అతన్ని ఓరచూపులతో చూసేదాన్ని. అతడు యేదో తెలివిగా మాట్లాడడం, నవ్వించడం...ఇన్‌డైరెక్టుగా నాతో మాటలు జరిగించే వాడు. అతడు మాట్లాడుతూంటే చెవులూ కళ్లూ అప్పగించి వినేదాన్ని. నేనూ అందరితోబాటు మామూలుగా అతనితో మాట్లాడేటందుకు ప్రయత్నించేదాన్ని. ఇదంతా అందరిలోనే జరిగేది ...... ఆలోచించగా కథ చాలాదూరం పోతుందేమోనని మళ్లీ జాగ్రతపడే ప్రయత్నం చేశాను ...... కాని హృదయం ఊరట చెందదు.

ఆ రోజు నేనూ, రుక్మిణీ తాంబూలాలు వేసుకుంటున్నాము. ఇంకెవ్వరూ లేరు అక్కడ. రుక్మిణి ఉన్నట్టుండి "నీకళ్లు నవీంకళ్లవలె వున్నవట. పాట ఖుర్షీదువలె పాడుతావట" అంది.

"ఎవరన్నారు?"

"మీ మామ."

ఎలెక్ట్రిక్ షాక్‌లా తగిలింది ఆ మాట. ఆశ్చర్య సంతోషాలను దాచుకునే తెలివి పోయింది. "ఇంకా యేమన్నాడు?" అని అడిగేసి, యెందుకు అడిగానా అని మళ్లీ విచారిస్తూ, ఆమె చెప్పే మాటలను వినుపించుకోలేదు. కాని ఆమె "ఆర్టిస్ట్, కల్చర్డ్ యింకా యేమేమో యింగ్లీషుమాటల్లో నిన్ను మెచ్చుకోవడం, అవన్నీ నాలో లేవని నన్ను తిట్టడంతో సరిపోయింది నిన్నరాత్రి" అనేసరికి నాకు మతిపోయినట్టయింది. ఎంత ఉబ్బిపోయానో నాకే తెలియదు. ఇదివరకెప్పుడూ నాలో అంత అందం కాని, విశేషం కాని వుందని యెవ్వరూ అనలేదు. నేనూ అనుకోలేదు. బహుశః జానకికూడా నమ్మి వుండడు. తన భార్య మళ్లీ నాతో అనాలని అలా అన్నాడేమో అని యిప్పుడనుకుంటాను. కొంత సమయస్ఫూర్తి తెచ్చుకొని, "ఆ! అదంతా వూరికే నన్ను వుడికించాలని అనివుంటాడు ...... అయితే మొత్తానికి నన్ను తురకదాన్ని చేశాడు" అని కొంత వినయంతో, కొంత హాస్యంతో ఆ ప్రశంసను ఆపేశాను.

ఓరోజు తల దువ్వుకుంటూ జానకి 'పహిలేహి మొహబ్బతుసే' అనే పాట యెంతో హాయిగా పాడాడు. ఆపాటవరుస నేర్చుకోవాలని నాకు యిష్టం కలిగింది. నాకు పాటలమీద యెంత యిష్టమో నీకు తెలుసు గదూ? "మీ ఆయనకోటి ఆపాట పాడించు...చాలా బాగా పాడతారు" అన్నాను అమధ్యాన్నం రుక్మిణితో. తప్పకుండా పాడతాడనీ, నేను మెచ్చుకున్నందుకు ఉబ్బిపోతాడనీ నాకు తెలుసు. అతడు మెచ్చుకుంటే నేను ఉబ్బిపోలేనూ! దివ్యవిమానంలో యెక్కినంత గర్వం కలుగుతుంది అతనికి!

సాయంత్రం యేమీ తోచకపోతే వసారాలో వున్న పుస్తకాల బీరువాలో యేదైనా కథలపుస్తకం కోసం చూస్తున్నాను. పక్కగదిలోనే జానకి వున్నాడని నా కెట్లా తెలుసూ? నేను అక్కడ వున్న సంగతి యెట్లా కనిపెట్టాడో కాని గదిలోనుంచి 'పహిలేహి' అనే పాట పాడుతూ, పాటచివరిభాగం వచ్చేసరికి వెలుపలికి వచ్చేశాడు హఠాత్తుగా. అప్పుడు

అక్కడ ఇంకెవరూ లేరు. నేను వెళ్ళిపోతే అతడు పాట మానేయడమే కాక నొచ్చుకుంటాడు. కాని వెళ్ళిపోదామని నా పాదాలు తొట్రుపాటు పడుతూండడం అతడు గమనించే వుంటాడు. పాట అయిపోయాక నా దగ్గరకి వచ్చి, "నేను మంచి పుస్తకం తీసి యివ్వనా మీకు?" అన్నాడు. ఆ బహువచనప్రయోగానికి నాకు సిగ్గూ, ఆశ్చర్యం కలిగింది. "నన్నుకూడా ఓ మహిళా సభాధ్యక్షురా లనుకున్నా డా" అనిపించింది. 'తీసివ్వ'మన్నట్టుగా ఒక అడుగు పక్కకు జరిగాను. అతడు పుస్తకం వెతుకుతూనే "మీరుకూడా అందరిలాగే అంతగా బెదరడం నాకు విచిత్రంగా కనపడుతోంది" అని నన్ను చూస్తూ యింగ్లీషులో అన్నాడు. ఈమాట నామీద మరిఒక అస్త్రంలా ప: చేసింది. నాశరీరంలోని రక్తమంతా గడ్డకట్టినట్టు అయింది. అతనిముందర యేదో శక్తి నన్ను నగ్నంగా నిలబెట్టినట్టు అయింది. అతని ముంజేతులు దంతపుకత్తుల్లా మిలమిలలాడుతూ రక్తపు పొగలతో నాకు గిలిగింతలు పెడుతోన్నట్టు అయింది. "రొమాన్సు కావాలా, లేక స్త్రీల వ్రతకథలా" అన్నాడు. కళ్ళలోని కొంటెతనం ముఖంమీద పడ్డ ఆ నల్లజుట్టుకూడా దాచజాలలేదు. నేను గట్టిగా నవ్వాను...నన్ను అంత గట్టిగా నవ్వించగలిగినందుకు యెంత తృప్తిపడ్డాడో మనసులో......ఇంతలో యెవరో వస్తున్న చప్పుడు అయింది. ఇహ నేను వెళ్ళిపోతానేమో అనుకుని, తన చేతిలోని 'శశిరేఖ'ను యిచ్చి నాకన్న ముందుగా తానే గదిలోకి వెళ్ళిపోయాడు. పుస్తకం యిస్తున్నప్పుడు నా వ్రేళ్లను తాకాలని అతను చేసిన ప్రయత్నం నాకు నవ్వు తెప్పించింది. కాని ఆతొందరలో అతను 'ఫీల్' కాలే దనుకుంటాను. నాకుమాత్రం అతని చిటికనవ్రేలులోనుంచి అతని రక్తపు ప్రతిఅణువూ నాలోకి ప్రాకివచ్చినట్టు అయింది. అతని యీ చర్య నాహృదయాన్ని ఒక నిముషంవరకూ కొట్టుకోకుండా చేసింది. వెళ్తూ అతడు చిరునవ్వు నవ్వాడేమో కాని నవ్విన్నట్టు కనిపించుకోలేదు. ఇహ ఆక్షణంనుంచీ నేను నాలుగేళ్లు చిన్నదాన్ని అయినట్టు అనిపించేది నాకు. అచ్చంగా ఓపదిహేనేళ్ల అమ్మాయిలా హుషారుగా వుండింది నా శరీరం. నా చేతులూ కాళ్లూ నావి కానట్టే యిటూ అటూ యెగురడం ప్రారంభించాయి. ఆగడియున మాత్రం యేదైనా కేకవేయుటమో, పిచ్చిపనో చేయాలనిపించింది.

అప్పటినుంచీ జానకితో ఒంటిగా మాట్లాడాలనీ, అతడిని యెప్పుడూ చూస్తూవుండాలనే కోరిక నాలో విజృంభించింది. అతని ప్రతిచేష్టా, ప్రతికదలికా, ప్రతిమాటా యేదో కొత్తసందేశము తెస్తూవుండేది. అతని తెలివీ, గుణగణాలూ వేయిరెట్లు యెక్కువగా కనపడ్డవి. నాకు తెలియకుండానే, నాఆజ్ఞ తీసుకోకుండానే నా సర్వశక్తులూ నన్ను అతని వైపు లాక్కువెళ్లేవి. నేను యేమేమి వెకిలిచేష్టలు చేశానో అతడు చెప్పాలి కాని నాకు తెలియవు. కాని నేనుకూడా మామూలుకన్నా యెక్కువ శ్రద్ధ, జాగ్రత తీసుకునేదాన్ని నా మేకప్ లోనూ, నడవడిలోనూ. నా టేస్టు (అభిరుచు) లన్నీ అతడు తెలుసుకోవాలని రుక్మిణిని నేనే బాగా అలంకరించి, అతనికి, మునుపటికన్నా యెంతో అందంగా ఆమెను కనుపడజేసేదాన్ని. ఇరవైనాలుగుగంటలూ అతని గురించిన ఆలోచనలతోనే నా మెదడు నిండివుండేది. ఆ భావాల భారం నాతల భరించేట్లు లేదు. భోజనం చేస్తున్నా, స్నానం చేస్తున్నా, చదివినా, పాడినా - యేపని చేస్తున్నా అతడు నన్ను చూస్తున్నా డనే తెలివి (consciousness) దేన్నిగురించి నేను అంత సంతోషంగా వున్నానో నాకే తెలియకుండా చేసింది. అది ఒక అమోఘభావం. అనుభవైకవేద్యం కాని యెట్లా చెప్పగలను నీకు? కథలు చదువుతూంటే—మనకథలన్నీ యెట్లా వుంటాయో నీకు తెలుసుగా—వాటిలోని ముఖ్యపాత్రల స్థలాల్లో నేనూ, జానకీ వుంటే యెట్లా ప్రవర్తించేవాళ్లమో భావన చేస్తుంటే యెంతో వుత్సాహంగా, ఉద్రేకపూరితం(Thrilling)గా వుండేది....'శశిరేఖ' యిదివరకెప్పుడో చదివాను. కాని ఆ పరిస్థితుల్లో మళ్లీ చదవా లనిపించింది. అయినా సీరియస్‌గా చదువజాలకపోయేదాన్ని. ఓ పేజీ చదవడం, పుస్తకం గిరవాటేసి తలగడలో మొహం దూర్చి పగటికలలు కనడం! ... ఇహ రాత్రిళ్లు మరీ అధ్వాన్నంగా వుండేది. రుక్మిణీ, జానకీ గదిలో చేరుకునేసరికి నా ప్రాణాలన్నీ వారిమధ్యే వుండేవి. కాని

రుక్మిణిమీద అసూయమాత్రం యేమీ కలుగలేదు. పాపం! ఆమె చాలా అమాయకురాలు. అయినా అంత 'డల్' గా, అంత 'మెకానికల్' గా, అంత నిరుత్సాహంతో, అంత 'అన్ రొమాంటిక్' గా రుక్మిణి తోటి అతని జీవితం యెంత దుస్సహంగా వున్నదో చూస్తే నామనసు నీరైపోయేది. రుక్మిణిని చూస్తే కూడా నాకు జాలి వేసేది. ఏనాడవా తెలుసుకునే ప్రయత్నం చేయదు. తనవల్ల తన భర్తకు తృప్తి వున్నదీ లేనిదీ కూడా తెలియదు. జీవితమే అసలు ఆమెలేతకళ్లకు యెంతో దాగివున్నట్టున్నది. మా యిద్దరిలో, పైకి యేమీ కనబడకుండా, లోలోపలనే జరుగుతున్న కోలాహలం—బహుశః ఈ రోజువరకూ—ఆమె తెలుసుకోనేలేదు, పాపం. నేనా యిద్దరినీ చూసి వలవలపోయి చెరి ఒకకంట తడిపెట్టేదాన్ని. ఒకోరోజు మూడు నాలుగింటిదాకా కూడా రాత్రిళ్లు నాకు నిద్రపట్టకపోయేది. నన్ను నేను యెంత అణచుకో ప్రయత్నించాననుకున్నావ్? ఒకోసారి యెక్కడాలేని పట్టుదలతో అన్ని ఆలోచనలనూ పారదోలి దేవుడిని ధ్యానించుకునేదాన్ని. మనసు తిప్పుకోడానికి పతివ్రతామతల్లుల చరిత్రలనూ, జానకి జ్ఞాపకం చేసిన స్త్రీల వ్రతకథలనూ చదువుకునేదాన్ని. కాని అట్టే రాత్రి దీపం వెలిగించి చదువుతూవుంటే యింట్లో వాళ్లు యేమనుకుంటారో అనే భయంతో పన్నెండు కాగానే దీపం ఆర్పి నిండా ముసుగుతన్ని పడుకోవడం చాలా కష్టంగా వుండేది. నాబుద్ధి నాతలకు అతుక్కుపోయినట్టు అనిపించేది. "ఎందుకొచ్చాడ్రా దేముడా యీవూరికి యిప్పుడు? వచ్చినా ఆయనైనా నాతో వచ్చి వుంటే యింత మనోబాధ వుండేదికాదేమో" అనిపించేది. ఈ జానకి — అసలు ప్రపంచంలో యేవ్యక్తైనా యిట్లా నాజీవితంలో అడ్డంవస్తారనుకోలేదు. ఆయనను తలచుకుంటే యేడుపొచ్చేది. మళ్లీ వెంటనే "ఇంత అసందర్భపు దాంపత్యాలను యెందుకు కూరుస్తాడో దైవం" అనిపించేది. ఘోరమైన ఆలోచనలు తోచేవి. ఏ అవాంతరమైనా జరిగి జానక్కీ, నాకూ వివాహం — పునర్వివాహం — జరుగుతుందా అనిపించేది. నిర్దాక్షిణ్యంగా ఓడను కొట్టుకపోయే తుపానులా నాగురదృష్టం నన్ను పీడిస్తూవున్నట్టు తోచేవి. అమాంతంగా జానకిగదిలోకి వెళ్లి అతడిని రుక్మిణిప్రక్కనుంచి లేపి నాబాధంతా వెళ్లబోసుకోవాలనుకునేదాన్ని. ఓగంటకోసం మగవాడినైపోయి అప్పుడతడి భావాలు యెలా వుండేవో తెలుసుకోవాలనుకునేదాన్ని. అతనూ లోలోపల బాధపడతాడు కాని ధైర్యంగా యే 'స్టెప్'(చర్య) తీసుకోడు. నావలెనే అతనూ బాధపడుతూంటాడని అనుకున్నప్పుడు నావల్ల నేకదా అని గర్వం కలిగేది....."యేమో యింతకూ అతని ప్రేమ వాంఛారహితమైందేమో! యేమో ఆనువిక ప్రేమ జిజ్ఞాసి మాత్రమేనేమో ...... నేనై నేను నాకోరికలను కనపరచుకుంటే తరువాత అతనికి నామీద వున్న ఆ కాస్తగౌరవమూ, సదభిప్రాయమూ పోతుందేమో" అని భయం కలిగేది. అప్పుడనుకునేదాన్ని: శరీరవాంఛల్ని అణచుకొని మోహపిశాచంతో పోరాడి యెంతో కష్టంతో 'శీలం' నిలబెట్టుకుంటే లోకం దాని నేమాత్రమూ గొప్పతనం (Achievement) అనుకోదు. ఒక Negative Virtue (అసహజమైనగుణం) అనుకుంటుంది. ఆ బాధకూ, ఆ త్యాగానికీ, ఆ విజయానికీ యేమీ క్రెడిట్ (విలువ) యివ్వదు. "కూనీచేయకపోవడం కూడా ఒక పెద్ద ఘనకార్యమా" అనేస్తుంది......బాగా ఆలోచిస్తే నాకు సౌఖ్యం యెక్కడా లేదేమో అనీ, నేను పంజరంలోని చిలకలాగ ఈ చెరలో బంధింపబడి, యితరుల సౌఖ్యాలను చూస్తూ కాలం వెళ్లబుచ్చాలని దేవుడు నానుదుట వ్రాశాడేమోననీ అనుకునేదాన్ని. కాని మళ్లీ వెంటనే యేదోశక్తి "నీభర్త నీమెడకొక బండవలె వున్నాడు. దానితో నీజీవితం దినదినమూ క్రుంగిపోతోంది" అని అరచినట్టనిపించేది.

## 3

ఆ రోజు వచ్చింది. అమావాస్యతరువాత మూడో రోజో నాలుగోరోజో అనుకుంటాను! రాత్రి సుమారు ఒంటిగంట అయివుంటుంది. దెబ్బలాట తర్వాత నవ్వుమొహంతో వచ్చే ప్రియుడిలా చంద్రుడు పైకివస్తున్నాడు. కిటికీలోనుంచి పెరట్లోని అరటిఆకులు చల్లగాలిని పంపిస్తున్నాయి. నాలుగునక్షత్రాలు-

అందులో రెండు చాలా ప్రకాశవంతంగా వున్నాయి-కూడా కిటికీలోనుంచే కనపడ్డాయి మేడమీద పడుకున్న రుక్మిణీజానకీల కళ్లవలె. వెన్నెల సరీగా వచ్చి నాకాళ్లమీద పడుతున్నది పైకి వెళ్లమని బ్రతిమాలుతున్నట్టు! యెవరన్నా లేస్తే నేను మొరిగి తెలియజేస్తానన్నట్లు మావాళ్ల కుక్క తన రెండుకాళ్లమీదా తల ఆనించి దీనంగా చూస్తోంది...ఇంతలో పైనుంచి జానకిపాట—రేడియోలో వినవచ్చినట్లు! ఆకంఠంలో మాధుర్యంమాత్రమే వినవచ్చింది కాని శబ్దాలు జ్ఞాపకంలేవు. ఇదివర కెప్పుడూ అతనలా పాడివుండడు. జలజలమంటూ వచ్చి కాళ్లకింద మట్టిని తోసి, లాక్కుపోయే మృదుతరంగాలవలె వినవస్తున్నవి ఆపాట నుడులు. నాకోసం కాకపోతే యింకెవరికోసం ఆపాట? రుక్మిణి విని ఆనందించినా తన్మయురాలు కాజాలదు. అంత ఉద్రేకపూరితం (Emotional) గా ఆమెముందర పాడగలడా?

ఇంక నాలోని సర్వశక్తులూ ఒక్కమారు చచ్చిపోయాయి. ఒకే నిశ్చయం కలిగింది. ఎలాగైనా ఆరాత్రి దాటితే మరునాడు ఆవూరినుండీ - జానకినుండీ వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాను. అన్నికోర్కెలూ, అంత ఉద్రేకమూ (Sensation) హఠాత్తుగా తిరుగబడిపోయాయి. "ఈ ఒక్కరాత్రీ నిగ్రహంతో నన్ను నేను అణచుకొని బయటపడితే నేను యెంతో ధన్యురాలిని. మరి యింకొక్కదినంకూడా—ముఖ్యంగా రాత్రి – వుండడం దుస్సహం" అనిపించింది. మావాళ్లు అంత త్వరగా వెళ్లనివ్వరుకాని యెలాగైనా పట్టుపట్టి వెళ్లాలి! "ఈరాత్రి తప్పించుకున్నానంటే నానిగ్రహానికీ, శీలానికీ నేనే యెంత సంతోషిస్తానో! జీవితమంతా ఆగర్వంతో గడపనూ?" అనుకున్నాను.

అంతా గాఢనిద్రలో వున్నారు. పాట సన్నగా పైనుంచి వినవస్తూనేవున్నది. కాని ధ్వని ఆకర్షణ మాధుర్యం అంతా నాకు అర్థరహితంగా అయింది. ఆధ్వని వికారధ్వనివలె కనపడసాగింది. బూతుకూతల్లా కనపడ్డాయి. పాట పూర్తిగాఆగిపోయింది. ఇహ మూడు గంట లాగితే తెల్లవారుతుంది. కళ్లు గట్టిగా మూసుకుని, రేపు యేమిషమీద అంత 'సడెన్'(అకస్మాత్తు)గా వెళ్తానని మావాళ్లకు చెప్పాలో, అట్లా వెళ్తే జానకిమనసు యెట్లా వుంటుందో ఊహించ ప్రయత్నిస్తూ పడుకున్నాను. ఉన్నట్టుండి "రాధా"అనేపిలుపు వినరావడం,యెలెక్ట్రిక్ సూదుల్లా జానకివ్రేళ్లు నా మెడమీద పాకడం ఒకేమారు జరిగింది. లాంతరు సన్నగా ఒకమూలను వెలుగుతున్నది. ఆమసకవెలుగులో అతని మొహం దీనంగా వంగి ప్రార్థిస్తున్నట్లుంది. అతని శ్వాసమాత్రం ఉద్రేకంతో వేలిపోతున్నది. అతడలా వస్తాడనుకోనేలేదు నేను. గడియక్రిందటి నాఆలోచనలన్నీ యేమయ్యాయో? ఏదో మాట్లాడాలని పెనుగులాడుతున్న అతని పెదవులను మాత్రం నిరీక్షిస్తూ నిశ్చేష్టురాలనైపోయాను. "ఈరాత్రి, ఈవెన్నెల్లో నీవు లేకుండా-దగ్గర వుండికూడా నాకళ్లముందర నాతో మాట్లాడుతూవుండకుండా యెట్లా గడపను? ఈ సౌందర్యం, జీవితములోని అపూర్వపుగడియలు వృథా అవుతున్నాయి...పైకి వెళ్లి మాట్లాడుతూ కూర్చోవచ్చు" అని, ప్రశ్నార్థకంగా నాకళ్లలోకి చూస్తూ నా మెడమీదనుండి చేయి తీశాడు. ఈమాటలు అతడు అన్నాడో, అన్నట్టు నాకనిపించిందో సరిగా చెప్పలేను. విరుద్ధభావాలు నాలో నిండి ఒకటి నొకటి హతమార్చుకొన్నవి. నాతల యుద్ధంతర్వాత కనపడే యుద్ధభూమిగా మారిపోయింది. ఏమీ అనజాలలేదు. కాని ఒక నిట్టూర్పుమాత్రం నన్ను తప్పించుకొని బయటపడ్డది.

"ఇందాకా నీవు మేల్కొని వుంటావని నాకు తెలుసు. ఈరాత్రి హృదయం, యవ్వనం వున్న యేవ్యక్తైనా యిట్లా ఒంటిగా పడుకోజాలదు. నీవూ నావలె బాధపడుతూంటావని తెలుసు. అందులో ఈరోజు వెన్నెల మాస్తే యింకెప్పుడూ యిలాంటి మాధుర్యం దానికి వుండదనిపిస్తున్నది... నీవై నీవు రాలేవని నేనే వచ్చాను"

నేను అప్పుడే అతనితో మేడమీద ఒంటరిగా వున్నట్టు అనిపించింది. "ఇంకా దగ్గరికి తీసుకోడేం, అతని చేతులు నన్ను పైకి యెత్తుకువెళ్తేనేం" అని హృదయంలో సంచలనం బయలుదేరింది. పైన రుక్మిణి

వున్న సంగతి ఓవైపు పెద్ద సమస్య అయి దయ్యంలా తయారయింది.

"రుక్మిణిని కూడా లేపుతాను. మనం ముగ్గురం మాట్లాడుకోవచ్చు ... పాడుకోవచ్చు హాయిగా" అన్నాడు.

"నీరసంగా వుంది"

"ఏం వంట్లో బావుండలేదూ" అని నా చెంప మీద చెయివేసి చూశాడు ఆదుర్దాగా.

"ఊఁ" అంటే ఆరోజు తప్పిపోయేది. అతడు వెళ్లిపోయేవాడు. కాని అబద్ధం చెప్పి ఆరాత్రిని పోగొట్టుకోవద్దని నా నరాలన్నీ యేకంగా అరుస్తున్నాయి. "ఏమీ లేదు" అంటూ కొంచెం తూల్తూ లేచాను. నే ననుకున్నంతా అయింది. అతడు నాచేయి పట్టుకొని పైకి తీసికెళ్లాడు.

మెట్లెక్కి వెన్నెట్లోకి వచ్చినాక నా మొహం చూశాడు. సంతోషమూ, యిష్టమూ తప్ప వేరే యే భావమూ లేనట్టు నవ్వాను. అతనితో బాగా మాట్లాడాలని నాలుక తొందరపడుతున్నది. ఏమి మాట్లాడాలో మాత్రం తోచక "రుక్మిణి యేదీ" అన్నాను. అదే ప్రథమం యిద్దరమూ యేకాంతంలో స్వేచ్ఛగా కలుసుకోవడం. అతడుమాత్రం నన్ను సరిగా అర్థం చేసుకోలేదని అతని మొహంలోని ద్వైధీభావమే చెప్తున్నది.

"అక్కడ పడుకుని నిద్రపోతోంది... లేపనా?" చాలా జాగ్రతగా అడిగినట్లు అతని కళ్లు సాక్ష్యం చెప్తున్నవి. కాని యీప్రశ్నకు యేం ప్రత్యుత్తరం చెప్పాలో తెలియదు. ఆలస్యం చేస్తే బాగుండదు. "వద్దు" అని త్వరగా అనలేను. "ఊఁ" అనడానికి గొంతు తిరుగబడ్డది...ప్రశ్న వినుపించుకోనట్టు, డాబా మీదికి ప్రాకివచ్చిన మల్లెతీగదగ్గరకు వెళ్లి ఓపూవు కోస్తూ, యేం చెప్పాలో ఆలోచిస్తున్నాను. జవాబుకు మారుగా నేనూ ప్రశ్న వెయ్యడమే మంచి దనిపించింది. అతడూ నావెంటనే వచ్చి మరి ఒక పువ్వును కోశాడు.

"మీరు మాత్రం యింకా నిద్రపోలేదే?" అంటూ కూర్చున్నాను ఆమల్లెతీగదగ్గిర.

"నిద్రపోతే స్వప్నంలో నీవు కనబడతావు. కలలో చూడడంకన్నా ప్రత్యక్షంగా నిన్ను చూడడంలో నాకు యెక్కువ ఆనందం కలుగుతుంది. అంచేత నిద్రపోలేదు. మరి నీవో?" అని అతడూ నా ప్రక్కనే కొంచెం దూరంగా కూర్చున్నాడు.

ఇంత గడుసుగా యిచ్చిన ప్రత్యుత్తరం అర్థమయ్యేసరికి నిముషమయింది.

"ఇంతవరకూ మీరు పాడుతూంటే వింటున్నాను" అన్నాను.

"అయితే నా పాట నీకు నిద్రాభంగం కలిగించింది....అంతేనా ?"

రుక్మిణి నిద్రలోనే పక్కకు తిరిగి పడుకుంది.

"మీపాటలు రుక్మిణిని నిద్రపుచ్చ గలిగాయి. నాకు నిద్రాభంగం కావడమేకాక — అసలు నిద్ర పడితేనా భంగ మయేందుకు ? — యెప్పుడో దీర్ఘ నిద్ర చెందిన నా కోర్కెలనుగూడా మేల్కొలిపాయి....నిజంగా మీరు చాలా అమోఘంగా పాడారు యిందాకా"

"నీకంటే బాగా పాడతానా?"

"నాపాటను మీరే మెచ్చుకోవాలి !"

"యేం...ఎవరు మెచ్చుకోరు ?"

"ఇప్పుడెందు కదంటే...అసలు నాజీవితం ఆగిపోయి యెన్నో యుగాలైనట్టుంది. గమ్యస్థానం కానకుండా పాకిపోతూన్న గుడ్స్ట్రెయినువలె యీ జీవితాన్ని లాక్కుపోతున్నాను."

ఈమాటలకు అతడు చకితుడైనాడు.

"కాలం అంతగా నీయవ్వనాన్ని వాడుకున్నట్లు లేదు. అందుచేతే నీ వింకా ఆకర్షణీయంగా, అందంగా వుండగలిగావు" అనిమాత్రమే ఓదార్చాడు.

నలువైపులనుంచి మేఘపురెక్కలు చంద్రుణ్ణి కప్పాలని చూస్తున్నాయి. రయ్యిన ఓగాలిపిల్ల నా పమిటను తోసివేయ ప్రయత్నించింది. కొంచెం చలి గూడా వేస్తోంది. పమిట తలమీదినుంచి కప్పుకున్నాను.

"పూర్వం రాజపుత్రస్త్రీలు ఈమోస్తరే కష్టపడుతుండేవారట... చలేస్తోందా?" అన్నాడు. అప్పటికి కూడా అతనిలో యేఉద్రేకమూ దాగిలేదు.

"ఊహూ" అన్నాను. కాని అతడు దగ్గిర కూర్చుని వుండడంవల్ల అతని మాటల తియ్యదనం నన్ను పాతాళానికో, ఆకాశానికో తీసుకువెళ్లుతున్నట్టున్నది. ఎక్కడ్నో బావిలోపడి చస్తున్నవాడి దీనాలాపంలా మనస్సు మారుమూలల్లోనుంచి "నీ నిశ్చయం, నీనిగ్రహం, నీభర్త, అతడు నీలో వుంచిన నమ్మకం యేమయ్యాయి?"అని ఒకచప్పుడు నీరసంగా వినవస్తూన్నది. కాని శరీరంలో ప్రతిగ్రంథీ, ప్రతిఅణువూ జానకిపెదవులను ఆక్రమించుకోవాలని ముందుకు తోసుకవస్తున్నాయి. ఈబాధ అతనికి యెట్లా తెలియజేయాలో నాకు తోచింది కాదు. మామూలువాళ్లకు ఏమీ లేనిచోట యెంతో అర్థం కనపడుతుంది. ఇతడు నాబాధను తెలుసుకోనేవుంటాడు కాని యేమీ ప్రోత్సహించకుండా, పైగా నిరుత్సాహకరమైన చూపుతో యేదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్టు వున్నాడు.

"నిద్రవస్తున్నదా?...వెళ్లిపడుకో" అన్నాడు. ఈమాటలు అంటూ అతడు లేవ ప్రయత్నించి వుండకపోతే, అతడు అన్నాడని నమ్మివుండేదాన్ని కాను. "నేను రేపు వెళ్లిపోతున్నాను మా వూరికి" అన్నాను. నాకళ్లలోని విచారాన్నీ, పెదవుల్లోనితొట్రుపాటునూ, ధ్వనిలోని నిశ్చయాన్నీ అతడు నమ్మకుండా వుండలేకపోయాడు.

"ఏం? ఏమిటంత త్వరగా..."

"లాభం లేదు. తప్పకుండా వెళ్లాలి" అన్నాను. నాకు తెలియకుండానే కళ్లలోనుంచి నీటిచుక్కలు దుమికాయి. కాని మనస్సుమాత్రం నిర్మలమైపోతూన్నట్టు తోచింది. ఎందుకైనా జానకిపట్టుదల, నిగ్రహం నా వాంఛల్ని ఓడించడం మంచి ధ్వనిపించింది. తప్పిన తోవనుండి సరియైన తోవ కనపడేముందు కలిగే థ్రిల్ (గగుర్పాటు) అప్పుడే కలుగుతున్నది...వెళ్లిపోవాలని లేచాను...ఇంతలో అతడు నాకళ్ల నీళ్లను తప్పు అర్థం చేసుకున్నాడు...అమాంతంగా వచ్చి, "నిన్ను సరిగా అర్థం చేసుకోలేదు." అంటూ ముద్దుపెట్టుకున్నాడు. మళ్లీ నా శరీరం అస్వాధీనంఅయింది. 'స్విమ్మింగ్ పూల్సు' లో జారుడుతిన్నెలమీదనుండి జారుతూ యిహ ఒక అడుగులో నీరు తాకుతుందనగా, పడబోయేముందు, ఆలోచించడానికి టైమువుంటుందా? అప్పుడానీరులో విషమున్నదని తెలిసినా అందులో పడకమాననూ. అలాగే యేమీ తోచక,పరవశురాలినై జానకిచేతుల్లో ఒదిగిపోయాను. రుక్మిణి దగ్గుచప్పుడు వినరాగానే నాకు హఠాత్తుగా ఆమె అక్కడే పడుకున్న సంగతి జ్ఞాపకం వచ్చింది. ఏ పాపమూ యెరుగని ఆమె మూసినకళ్లు వెన్నెల్లో కలువరేకులవలె సౌమ్యంగా వున్నాయి. మాకళ్లు ఆకలితో ఒకళ్లొకటిని కరుచుకుంటున్నాయి! "రుక్మిణి లేస్తుంది" అంటూ జానకిని తప్పించుకుని మెట్లవైపు వచ్చాను. అక్కడికీ, ఆమె పడుకున్న చోటికీ పిట్టగోడే అడ్డం. కాని మెట్లను చూడగానే తప్పించుకుని పోయే చివరి అవకాశం ఆహ్వానిస్తూ కనపడ్డది. ఇంతలో జానకి నా వెనకకి వచ్చాడు. కాని నేను అప్పుడే సగం మెట్లు దిగిపోయాను. దిగానో దూకానోకూడా తెలియలేదు. కాని చివరకు జానకితో యేమీ చెప్పకుండా వెళ్లడం మంచిదికాదనుకుని, "ఇన్నిరోజులూ యేలాగో గడచిపోయాయి. ఇంక ఒక్క గంటకోసం జీవితంలో శాశ్వతంగా బాధపెట్టే గాయం యెందుకు చేసుకోవాలి? మీ మొదటి నిశ్చయం, నిగ్రహం జ్ఞాపకం తెచ్చుకోండి. నాకూ తెలివి వచ్చింది. ఇలా వుంటే చాలు మన ప్రేమ" అని క్రిందికి వచ్చేసి మెట్లతలుపులు పెట్టాను...

మరునాడు యేలాగో ప్రయాణం సాగించాను. బండిలో కూచున్నాక తలుపుదాకా వచ్చిన జానకి అశ్రుపూరితనయనాలు చూసి దుఃఖం పట్టలేకపోయాను. గుమ్మం దాటగానే దోవంటా గంటసేపుదాకా నాకన్నీరు ఆగలేదు.

---

# సైకోఎనాలిసిస్

[Psycho-analysis]

= శ్రీ ఎ. యల్. యన్. శాస్త్రి =

నేటి వాఙ్మయకారులకు సైకోఎనాలిసిస్ ఒక నినాదంగా వుంది. అధునిక వాఙ్మయాడంబరాలు చేసే చాలామంది యువ కొంగ్రొత్త రచయితలు సైకో ఎనాలిసిస్‌తో కథలనూ, పద్యాలనూ, గేయాలనూ, వ్యాసాలనూ ప్రమాణం చేస్తున్నారు. పాశ్చాత్య దేశాలలో వ్రాతకారులంతా వాఙ్మయంలో సైకోఎనాలిసిస్‌ను ఒక ఉపకరణంగా, ఒక సాధనంగా తీసుకొన్న నాటి నుండీ మన తెనుగు కవికుమారులూ, కథకులూ కూడా దీన్ని గురించి తెలుసుకోవాలని ఉబలాటపడుతున్నారు. ఉబలాటానికి సరిపోయిన పరిశ్రమ కనపడకున్నా, సైకోఎనాలిసిస్‌ను గురించి చాలా తప్పు అభిప్రాయాలు వ్యాపిస్తున్నాయి. బూతులు రాస్తే సైకోఎనాలిసిస్ అని అనుకొనేవాళ్లు కొందరు. సైకాలజీకి ఆధునిక నామం అని అనుకొనేవాళ్లు మరికొందరు.

చరిత్రాత్మకంగా దీని పుట్టుపూర్వోత్తరాలను పరిశీలిస్తే గతమహాసంగ్రామానంతరమే ఈ మానసిక శాస్త్రపద్ధతి ప్రారంభించబడింది. సంగ్రామానంతరం ఫిరంగిగుండ్లవలన కొందరికి గలిగిన ఆకస్మిక విస్మయవ్యాధిని నిర్మూలం చేయుటానికి వారిని ఒకవిధమయిన యోగనిద్రయందు వుంచేవారు. అంతకుముందే చాలా మానసిక వ్యాధులనూ, నాడీసంబంధమైన అస్వస్థతలనూ బాగుచెయ్యడానికి యోగనిద్రను వుపయోగించేవారు. యోగనిద్రను కల్పించి నివారణ అయినట్లు అనుభూతం చేసే పద్ధతి చాలా కాలం వుండేది. యూరపులో ఇది శాస్త్రీయంగా వుంటే ఇండియాలో భూతాలూ, పిశాచాలూ, మంత్రనివారణలూ కూడా ఈ పద్ధతి ననుసరించి వున్నట్లే కనపడుతుంది. యోగనిద్రవలన లాభం లేని పక్షంలో ద్వీపాంతరవాసమో, దీర్ఘవిశ్రాంతో ఒక సాధనంగా వుంచేవారు. ఈ పద్ధతులవల్ల పైపై చిహ్నాలే నివారణచేయడ మయిందికాని, చాలామంది విషయంలో అసలు రోగమూలకారణం తొలగించబడకుండా వుండిపోయేది. యోగనిద్ర తాత్కాలిక నివారణే కాని శాశ్వత నివారణను చేయలేకపోయినది. కాని ఈ యోగనిద్రానివారణపద్ధతులవల్ల మానసికరోగం పూర్తిగా నివారణ కాకపోయినా, ఆవ్యాధుల కారణాన్ని సూచించగలిగింది. అణచివేయబడ్డ సంకీర్ణ మనోరథాలో (*complex*), వాటి కామరూపాలో ఈ మానసిక వ్యాధులకు కారణ మని తేలింది. అందుచేత మానసికావస్థలనూ, మనస్సునూ కొత్తరకంగా విభజించి, మానసిక వ్యాధుల మూలకారణాలను పరిశోధించవచ్చునని శాస్త్రజ్ఞులు గ్రహించేరు.

మన బహిర్గతచైతన్యానికి అతీతమైన మానసిక విషయాల కారణాలను శోధించడానికే సైకోఎనాలిసిస్ అంటున్నాము. యూరపులో సైకాలజీ చాలా కాలం ఆత్మమనస్సుల లౌకిక ఆధ్యాత్మిక సంబంధ నిర్ణయాలను చేస్తూవుండేది. అమెరికానుండి వాస్టోని యనుస్వభావవాదులు (*Behaviourists*) మనస్సు అనే ప్రకృతినే లాగివేసి ప్రతీమానసిక గుణాన్నీ శారీరిక శాస్త్రరీత్యా సమర్థించబోయేరు. సైకాలజీ కేవలం ఫిజియాలజీకి ఒక అనుబంధంగా పరిణమిస్తున్న కాలంలో ఫ్రాయిడ్ సైకాలజీని ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుల నిరర్థక సిద్ధాంతాలనుండీ, స్వభావవాదుల శారీరిక శాస్త్రీయ పద్ధతులనుండీ విముక్తరాలుగా చేసి మనస్సుకు ప్రత్యేక అస్తిత్వాన్ని ఇస్తూ, మనస్సు దాని చైతన్య శక్తులకు సంబంధించిన విషయంలో మిక్కిలి సూక్ష్మమయిన సత్యాలను వ్యక్తపరచగలిగింది.

ఫ్రాయిడ్ మనస్సును మూడు భాగాలుగా చేశాడు. అలాగే మానసికగమనాలను (*Mental*

*processes*) మూడు భాగాలుగా చేశాడు. మొదటిది చైతన్యావస్థ, లేక చలనచైతన్యం అందాం. ఈ చైతన్య గతిలో చలనము గలిగి ఏక్షణంలోనైనా పూర్తిగా తన కోర్కెలనూ, అవసరాలనూ తెలుసుకొనగలదు. అచలన చైతన్యం రెండోది. చైతన్యానికి వుండే చలనశక్తి లేకుండా తాత్కాలికంగా మరుగుపడి చలనచైతన్యావస్థకు సమీపంగానే వుంటుంది అచలనచైతన్యం. ఇది నివురుగప్పిన నిప్పులాగా వుండి బలమయిన ప్రేరేపణ వున్నప్పుడు చలనచైతన్యగతిలోకి మారగలదు. మూడోది అంతర్గతచైతన్యం. పురాతనంనుండీ శారీరకంగా జీవంలో వున్న మూలప్రకృతులు చితకబడి విధ్వంసిత మవుతాయి. ఆ మూలప్రకృతుల కామశిథిలాలు పుట్ట ఇది. శాశ్వతంగా - అఖండంగా నరకబడిన మూలప్రకృతులు గల యీ అంతర్గత చైతన్యావస్థలోని ప్రకృతులు చైతన్యావస్థలోకి చేరుట చాలా కష్టము.

*Conscious* - చలనచైతన్యం
*Pre-conscious* - అచలనచైతన్యం
*Un-conscious* - అంతర్గతచైతన్యం

పొరల్లాగ నిరూపింపబడిన యీ చైతన్యావస్థలన్నీ దృష్టాంతరీత్యా వర్ణింపబడినవేకాని, వీటికి బుద్ధిలోగాని, మరెచ్చటా కాని స్థలప్రమాణభావ మేమీ లేదు.

మనస్సు బాహ్యేక్షణ ప్రేరేపణవల్లా వుద్రేకించవచ్చును; సహజంగా వుండే మూలప్రకృతుల ప్రేరేపణవల్లా వుద్రేకించవచ్చును. కాని బాహ్యా ఆంతరంగిక ప్రేరేపణలు రెండూకూడా త్రివిధచైతన్యావస్థలలో మూలమయిన అంతర్గతచైతన్యమందే మొట్టమొదట వుద్రేకింపబడతాయి. అయితే, అంతర్గతచైతన్యంలో మొట్టమొదట వుద్రేకింపబడిన ప్రేరేపణలు చైతన్యపుసరిహద్దులలో, అనగా అచలనచైతన్యంవద్దర నిలిచిపోతాయి. కొన్ని మాత్రం చైతన్యావస్థలోకి పోతాయి. కొన్ని ప్రేరేపణలు అచలనచైతన్యంలోకికూడా పోకుండా, అంతర్గతచైతన్యంలోనే దహనమయి, అస్థికలతో పాతుకుపోతాయి. భౌతిక ఆంతరంగిక ప్రేరేపణలను ఇంద్రియాత్మకమయిన చైతన్యంలోకి ప్రవేశించకుండా చేయడము దేనితరమూ గాదు. కాని చలనచైతన్యంలోకి మాత్రం రాకుండా మనస్సు చేసుకోగలదు. ఇట్లా రాకుండాచేసే మానసిక అడ్డుదిడతనే సెన్సార్ (*Censor*) అంటారు. అంటే సంఘమూ, మతమూ, న్యాయమూ ఏర్పరచిన విధినిషేధాలు. దానివల్లనే కూడనివీ, అక్కరలేనివీ అయిన కోర్కెలు చైతన్యంలోకి ప్రవేశించకుండా వుండడం అవుతుంది.

ఈ త్రివిధచైతన్యావస్థలనూ ఒప్పుకోడు ఏడ్లరు. ఫ్రాయిడ్ సరికొత్తగా కనిపెట్టిన 'అంతర్గతచైతన్యము'ను శుద్ధఅబద్ధం అన్నాడు. యీ మానసికవిభజన అంతా నిరర్థకమయినది అంటా డాయన.

జంగు (*Jung*) అనే మరో మానసికశాస్త్రజ్ఞుడు అంతర్గతచైతన్యం వుందని ఒప్పుకొన్నాడు కాని అది ఫ్రాయిడ్ వర్ణించిన మురికిగుంటవంటిది కాదంటాడు. స్వజాతీయస్మృతులూ (*Racial memories*), పారమార్థిక పుకోరికలూ, ఇంకా వ్యక్తిగత సంస్కారవాసనలతో నిండిన గంగానదిలాంటిది అంటాడు అంతర్గత చైతన్యాన్ని జంగు.

మనస్సును మూడు భాగాలుగా చేశాడు ఫ్రాయిడ్. మొదటిభాగాన్ని *libdo* అంటారు. దీన్ని మనం సాధారణంగా 'మనస్సు' అంటాము. అవ్యక్త చైతన్యరహితమయిన మనశ్శక్తిచే ఇది నిండివుంటుంది. పురాతనమూలప్రకృతుల ప్రేరేపణ దీనివల్లనే కలుగుతుంది. మనస్సునుండి -అహంకారం వుద్భవిస్తుంది. త్రివిధచైతన్యావస్థలనుండీకూడా ఇది ఉద్భవిస్తుంది. వ్యక్తి భౌతికప్రపంచంతో సంబంధించినపుడు వానికి అహంకారం కలుగుతుంది. ఆ అహంకారమే తనకు కావలసినది దొరికినదనీ, దొరకలేదనీ భావిస్తుంది. సంఘం కొన్నినిబంధనలను విధిస్తుంది. వాటిని ఒప్పుకొనేదీ, ఒప్పుకోకుండా వుండేదీ అహంకారమే. మూలప్రకృతులకు శత్రుప్రాయంగా వుండే నాగరికనీతులకు అలవాటుపడ్డ అహంకారం మనస్సునూ, దాని మూలప్రకృతులనూ చీదరించడం ప్రారంభిస్తుంది. ఆత్మ అనీ, *soul* అనీ, *conscious* అనీ, అంతఃకరణ అనీ వర్ణించబడేది అహంకారంయొక్క మహాశక్తి రూపమే కాని మరొకటి కాదంటాడు ఫ్రాయిడ్.

మానసిక పరిణామంలో క్రమంగా అహంకారం సంఘనిబంధనలకు లొంగక తప్పదని భావిస్తుంది. అందుచేత మనస్సును లొంగదీయడానికి చూడాలి. పూర్తిగా తన అధికారంలో వుంచుకోవాలి. మనస్సుయొక్క కొన్ని కామాలూ, కోర్కెలూ, వికారాలూ సంఘనిబంధనలకు వ్యతిరేకం. అందుచేత అహంకారం—దానిలో ఒకభాగాన్ని ప్రత్యేకంగా ఒక 'పహరాను' వుంచవలసివస్తుంది. కూడని కోర్కెలూ, ప్రమాదకరమయిన కోర్కెలూ మనస్సునుండి వచ్చినపుడు ఈ 'పహరా' అహంకారం వాటిని చైతన్యావస్థలోకి వెళ్లకుండా ఆపివేస్తుంది. అహంకారంలోనికి ప్రవేశించకుండానే ఈపహరా అహంకారం చాలాకామాలను అణిచివేస్తుంది. అహంకారదుర్గానికి కావలికాచే యీ మహాఅహంకారానికే (*Super-ego*) ఆత్మ అంటాం మనము. వేదాంతులు మనస్సు చెడ్డదనీ, ఆత్మ నిర్వికారమయినదనీ చెప్పడం ఇందువల్లనే. ఇంతకన్న వేరేమీ లేదు. అహంకారం నుండి ఉద్భవించిన యీ మహాఅహంకారం క్రమంగా ఒక విశిష్టమానసికప్రకృతి అయి తప్పుపనులకు పశ్చాత్తాపపడుట మొదలగువాటికి బాధ్యురాలవుతుంది.

| ఫ్రాయిడ్ ఇచ్చిన పేరు | ఫ్రాయిడ్ పేరుకు తెనుగు | మన వేదాంతంలోని సరియైనపదం |
|---|---|---|
| *Libdo* | మనశ్శక్తి | మనస్సు |
| *Ego* | అహంకారం | అహంకారం |
| *Super-ego* | మహాఅహంకారం | ఆత్మ |

మూలప్రకృతుల పట్టిక యివ్వడానికి ఫ్రాయిడ్ ఏమీ శ్రద్ధవహించలేదు. ఆతను మూలప్రకృతులను రెండుభాగాలుగా చేశాడు: (i) ఆత్మరక్షణకు సంబంధించినవి, (ii) కామానికి— ముఖ్యంగా స్త్రీపురుష కామానికి సంబంధించినవి. రెండోదానికే ప్రాధాన్యమిచ్చి మనుష్య స్వభావంయొక్క క్రమం అంతా దానిమీదే ఆధారపడివుందంటాడు. ఆత్మరక్షణకూ, స్వాభిమానప్రదర్శనానికీ, ఇచ్ఛను శక్తిలోకి రూపించడానికీ అందరికీ—నూటికి ౯౯ మందికి— గోచరమయ్యే మార్గం కామమార్గమే అంటాడు. ఏడ్లరుమహాశయుడు వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడంలోనూ, ఇచ్ఛను శక్తిలోకి వ్యక్తంచేయడంలోనూ జీవితసమస్య వుందంటాడు. వ్యక్తిని రక్షించుకొనే మూలప్రకృతి సహజంగా వుండడంవల్లనే ఋషీశ్వరులు ఆత్మసిద్ధికోసం అంత తహతహపడుట. నిర్వాణం, కైవల్యం, ఐక్యం — ఇవన్నీకూడా ఆత్మరక్షణప్రకృతియొక్క అతిలక్షణాలే అనిపిస్తవి. మానసికశాస్త్రజ్ఞుల సిద్ధాంతాలరీత్యా స్వర్గలోకవర్ణనలను పరిశోధిస్తే వైదికుల యజ్ఞయాగాలు కొన్ని కేవలం కామప్రకృతుల ప్రేరేపణలకు సంబంధించినట్లే కనపడుతుంది.

ఈడిపియస్ కాంప్లెక్సుపైన ఫ్రాయిడ్ సిద్ధాంతం అంతా ఆధారపడివుందని అతనూ, అతని శిష్యులూ కూడా అంటున్నారు. ఫ్రాయిడ్ వర్ణించిన త్రివిధ చైతన్యావస్థలూ, త్రివిధమనస్సూ ఎవరికీ నొప్పికలుగ చేయలేదు. కొత్తగా ఇంతకుముం దెవరూ ఊహించని ఒక కొత్తరకపు సంకీర్ణమానసికమనోరథాన్ని కనిపెట్టేడు. అది మానవుని బాల్యంనుండీ ప్రారంభం అవుతుందనీ, భావివ్యక్తిశీలం అంతటికీ పునాదువేస్తుందనీ చెప్పేడు. జీవశక్తి అంతా కామశక్తి అనే నిర్వచించిన యీయన మానవుడు జన్మతః కామధారిఅనీ, పుట్టిననాటినుండీకూడా కామచిహ్నాలను చూపెట్టవచ్చుననీ ఈయనవాదం. అంతవరకూ ఎంతటి అతివాదిశాస్త్రజ్ఞుడుకూడా పసిపాపల అమాయికత్వమునూ, పవిత్రతనూ విశ్వసించేవారు. ఫ్రాయిడ్ సిద్ధాంతంతో పిల్లల 'పవిత్రత' ఎగిరిపోయింది. పసిపాపలకుకూడా కామచిహ్నాలను ఆరోపించే ఫ్రాయిడును ఎవరూ సహించలేకపోయేరు. విశ్వసించలేకపోయేరు.

జీవశక్తి అంతా కామశక్తిలోనే కేంద్రీకరించియుండుటచేత కామచిహ్నాలు చిన్నప్పటినుండీకూడా మనలో వున్నాయి. చన్నుగుడవడమూ, నోట్లో వేలు పెట్టుకోవడమూకూడా కామచిహ్నములే అంటాడీయన. ఈడిపియస్ తెలియకుండానే తండ్రిని చంపి తెలియక తల్లిని పెళ్లాడేడు. ఈడిపియస్‌లాగే ప్రతీపిల్లవాడికీకూడా బాల్యావస్థలో ఒకదశయందు తల్లిపై కామాకర్షణ ఉంటుందనీ, దానివల్లనే తనకు అడ్డంగా వున్న తండ్రిపై మాత్సర్యంకూడా కలుగుతుందనీ, అలాగే పిల్లదానికి తండ్రిపై కామాకర్షణ కలుగుతుందనీ

ఫ్రాయిడ్ వాదం. 'కామం' అంటే ప్రేమా, అభిమానమూ, భక్తీ అని తీసుకొన్నపక్షంలో మగపిల్లలు తల్లినీ, ఆడపిల్లలు తండ్రినీ ఎక్కువగా ప్రేమిస్తారనేది అనుభవానికి దగ్గరగానే వున్నది. ఇలాంటి దశ మానవుని బాల్యావస్థలో ఒక దశ, ఒక సహజావస్థ అని ఫ్రాయిడ్ వాదం. ఈ అవస్థలోని యీ లక్షణాలు సంకీర్ణములయిన అనేకమార్పులలో ఉండవచ్చును. లక్షణాలు పైకి వ్యక్తం అవడంలో అనేకవిధాలుగా రూపింపవచ్చును. అయినా ముఖ్యమయిన బాలకామచిహ్నాలుమాత్రం తప్పకుండా గోచరమవుతున్నాయి. 'బాలారిష్ట'మనబడే రోగపు చిహ్నములు కామచిహ్నములే అనిపిస్తుంది. పసివయస్సులోనే యీ సంఘర్షణ ప్రారంభం అవుతుందనీ, నిగ్రహంకూడా అప్పుడే వుద్భవిస్తుందనీ, బాల్యావస్థలోని ఈ సంఘర్షణఫలితమే తర్వాతి వ్యక్తి మంచిచెడ్డలనూ, శీలమునూ నిర్ణయిస్తుందనీ, ప్రాథమికమయిన యీ సంఘర్షణయే భావివ్యక్తిశీలానికీ, ఆత్మవికాసానికీ కారణం అనీ అంటాడు ఫ్రాయిడ్. పైకి కనపడినంత చులకనగానూ, నీచంగానూ దీన్ని తీసుకోకూడదు. ఆగమం వ్యక్తిశీలం అంతా చిన్నప్పుడు దగ్గరగా వుండే మాతాపితరులతో వుండే సంబంధాన్ని పట్టే ఏర్పడుతుందని గ్రహించవలసియుంటుంది.

ఫ్రాయిడ్ మానవజీవితానికి అతిముఖ్యమయిన చలనశక్తి స్త్రీపురుషసంబంధపు కామమే అని నిర్ణయించాడు. వ్యాసుడు స్త్రీ మూలప్రకృతి అని నిర్వచించడంకూడా యీ విషయాన్నే అనుసరిస్తోంది. 'స్త్రీపురుషసంబంధం' అని స్థూలంగా అనడానికి బదులు 'జీవితంలో స్త్రీ మూలప్రకృతి' అన్నాడు. అంతర్గతంగా మనిషివ్యక్తిత్వాన్ని రూపుమాపే వివిధమానసికసంఘర్షణలన్నిటికీ సెక్సు చాలామట్టుకు బాధ్యత వహిస్తుందని ఫ్రాయిడ్ చెప్తున్నాడు. నాగరికత చెందిన మనుష్యుడు మతాభినివేశంవల్లా, సాంఘికమర్యాదల అనుసరణవల్లా, తన మూలజీవప్రకృతులను కొంతవరకూ అణుచుకొన్నాడు. సాధారణంగా సంఘంలో ప్రతీ వ్యక్తికీ కాముకజీవితరంగంలో సంఘంతో సంఘర్షణ వస్తోంది. నీతిమర్యాదలను అనుసరించడానికి పవిత్రమయిన మానవుడు చాలా ప్రియమయిన ఖరీదును చెల్లిస్తున్నాడు. స్త్రీపురుషనీతివిషయంలోని నియమాలూ, విధినిషేధాలూ, ఆచారాలూ చాలామట్టుకు మానసికపరిణామానికి కృత్రిమ అడ్డంకులు అవడంచేతనే మానసికవ్యాధులూ, హిస్టీరియాలూ, ఉన్మాదాలూ సంభవిస్తున్నాయని వీరి వాదం. వివిధప్రపంచజాతుల సాంఘికనైతికచరిత్రను పరిశీలించి ఫ్రాయిడ్ తన వాదానికి ఆధారాలు కలుగచేసికొన్నాడు.

ఈ ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని తిరస్కరిస్తూ ఏడ్లరు మానసిక ఆంతరంగిక సంఘర్షణలన్నిటికీ కారణం ఆత్మజయాపజయనైరుద్ధ్యమే అంటాడు. ఇచ్ఛాశక్తిలోకి ప్రదర్శించుటలోని జయాపజయములే మానసికపరిణామాలకూ, సంఘర్షణలకూ కారణం అంటాడు. ఆత్మీయమయినదానిని శక్తిలోకి ప్రదర్శించి వ్యక్తిత్వానికి సంపూర్ణవికాసం కలిగించిననాడే మానసికశాంతి వుంటుందని వీరి ఊహ. ఆత్మీయమయిన ఇచ్ఛను బాహాటంగా శక్తివంతంగా ప్రదర్శించుటయే వీరికి ప్రధానం. అందుకే ఇతనిది వ్యక్తిగతనిరూపణ సైకాలజీ అయింది. సంప్రదాయాలూ, ఆచారాలూ, నియమాలూ, సాంఘికనిబంధనలూ అని మొత్తంమీద గ్రహించి మానవస్వభావాన్ని సమన్వయిస్తాడు ఫ్రాయిడ్.

రెండు విషయాలు గమనించాలి. మానవజాతి యౌవనాన్నీ, మూలప్రకృతులనూ నాగరికకృత్రిమ నియమాలలో దగ్ధంచేసుకోడం ఒకటి. రెండోది మానవ జంతువు తన ప్రాథమిక ఇచ్ఛాస్వాతంత్ర్యాన్ని పోగొట్టుకోవడం. ఫ్రాయిడ్ మూలప్రకృతులమీద సంఘం నిబంధించిన ఆంక్షలే మానవుణ్ని నీరసుడుగా, అలసుడుగా, మానసికరోగిగా, వ్యర్థుడుగా చేశాయంటాడు. ఏడ్లరు మూలప్రకృతులకు ప్రాధాన్యమియ్యక ఆత్మీయరక్షణమే, ఇచ్ఛాశక్తిసాధనమే ముఖ్యమంటాడు. స్వార్థమునకు సంబంధించిన వ్యక్తిస్వాతంత్ర్యరక్షణమే మనస్సుయొక్క సమస్య అంటాడు. కాని పరిశీలించిచూస్తే స్త్రీపురుషసంబంధపు వాంఛకూడా వ్యక్తినిరూపణకూ, ఇచ్ఛాశక్తి

ప్రదర్శనానికీ ఒక మార్గమే కాని వేరే కాదనిపిస్తుంది. పారిభాషికపదాల్లో నే ఇద్దరికీ చాలా అభిప్రాయభేదం వుంది.

జంగు వీరిద్దరిపంథా కాకుండా మరోపంథాలో నడిచాడు. అంతర్గతచైతన్యమును గురించి మరింత స్పష్టీకరించాడు. ఫ్రాయిడుకు అంతర్గతచైతన్యంలో సంఘర్షణశిథిలాలూ, కూకటి వ్రేళ్లతో నరకబడిపోయిన కామాలూ తప్ప మరేమీ కనపడవు. జంగుకు అంతర్గత చైతన్యంలోనే మన ఆదర్శాలు, పరమార్థాలు, ఉన్నత ప్రేరేపణలూ గోచరమయ్యాయి. ఈ అంతర్గతచైతన్యం ఊటచెలమ గాని మురికిగుంట కాదంటాడు (*Not a cess-pool but a well-spring*). శిథిల కామాలతోనూ, విదగ్ధ వాంఛలతోనూ గుమిగూడిన మురికి కాల్వ కాదు. చైతన్యంనుండి అంతర్గతచైతన్యం ఉద్భవించిందంటాడు ఫ్రాయిడ్. అలా కాకుండా చైతన్యంలాగే మొదటినుండీ అంతర్గతచైతన్యం వుందనీ, వాటి కోర్కెలే అప్పుడప్పుడు చైతన్యావస్థలోకి వస్తాయనీ జంగుయొక్క వాదం.

మానసికవిభజనశాస్త్రంలోని యీ పరస్పర విరుద్ధాభిప్రాయాలన్నిటికీ అతీతమైన కొన్ని ముఖ్య సత్యములు వీరందరూ కలిసి తేల్చగలిగినారు. ఏమయి నప్పటికీ మానవబుద్ధివికాసచరిత్రయందును, ముఖ్యముగా సైకో ఎనాలిసిస్ యందును ఫ్రాయిడ్ సిద్ధాంతాలు చాలా ప్రాథమికసమస్యలకు జవాబు ఇచ్చినవని ఒప్పుకోకతప్పదు. సైకాలజీకి ప్రత్యేకశాస్త్రీయ అర్హతను కలిగించి దానిని ఒక శాస్త్రీయదర్శనంగా చేసింది ఫ్రాయిడే. అంతకుముందు సైకాలజీ అర్థమూ పర్థమూ లేకుండా మానవాతీత ప్రగల్భాలతోనూ, నిర్జీవమానసికస్థితుల వర్ణనలతోనూ వుండేది. అటువంటి యూరోపియన్ సైకాలజీలో బ్రహ్మాండమయిన విప్లవ మార్గం చూపించి, ఉత్సాహాము, ప్రేరేపణలు, సంఘర్షణలు, మూలప్రకృతులు, త్రివిధచైతన్యములు, త్రివిధ చైతన్యావస్థలు మొదలగు పారిభాషికపదాలను సృష్టించేరు. నీతిశాస్త్రజ్ఞులు విధించిన 'మంచి'లోని చెడ్డను, 'చెడ్డ'లోని మంచిని బయటపెట్టగలిగేరు.

మానసికశాస్త్రజ్ఞులు చాలా ఇంద్రియనిగ్రహాలూ, బ్రహ్మచర్యాలూ కోర్కెలను అణుచుకోడము వల్లనే సాధ్యమవుతున్నా యంటున్నారు. కామశక్తులను నిగ్రహించి వాటిని అంతకన్న ఉన్నతమయిన, అధికమయిన దివ్యశక్తులలోకి మార్చవచ్చును. కామాగ్నిశక్తులను భస్మీకరణంచేసి, పుటంవేసి, వాటినుండి నవ్యకళాశాస్త్ర విభూతులను సృష్టింపవచ్చును. బ్రహ్మచర్యంవల్లా, ఇంద్రియనిగ్రహంవల్లా మానవాతీతశక్తులను పొందవచ్చునని చెప్పే ఆర్యతత్వజ్ఞుల అభిప్రాయం కూడా దీన్నే అనుసరిస్తోంది. అయితే కామశక్తులను కళాశాస్త్ర జ్ఞానాన్వేషణలలోకి మార్చుకోగలిగే ప్రతిభా, మానసిక శారీరకబలమూ అందరికీ లభ్యం అవడం చాలా కష్టతరం. ఈదృష్ట్యా కవిత్వాలూ, కథలూ, శాస్త్రీయవిమర్శనలూ, లలితకళలూ, జ్ఞానాన్వేషణలూ, అన్నీకూడా నిగ్రహింపబడిన కామరూపంయొక్క మారురూపములే కాని మరేమీ కావని అనవచ్చును. రక్తిమార్గాలను అసహ్యించుకొనే భక్తుల మార్గం ఇదే అంటారు. కాని యీవిధంగా ప్రతిభా, రసికత్వమూ నిగ్రహిత కామరూపమే కాని మరొకటి కాదనడం అసందర్భం. ఏమంటే శ్రీనాథుడు, తిమ్మకవి, ధూర్జటి, భర్తృహరి, జయదేవుడు, వేమన, షెల్లీ, కీట్సు మొదలగు ప్రాచ్య పాశ్చాత్యకవు లెవరూకూడా ఇంద్రియనిగ్రహంవల్లా, కోర్కెలను అణచుకోడం వల్లా కవిత్వం చేసినట్లు కనపడదు. కోర్కెలను, కామాలను మరింత విజృంభింపజేసుకొని కేవలం కామార్థులై కవిత్వం చెప్పేరు. కామశక్తులను భస్మీకరణం చేసి యోగులూ, వైరాగులూ ఏవేవో మానవాతీతశక్తులను సంపాదించినట్లు మనవారు పురాణాల్లో వ్రాశారు. కాని కామశక్తులను కళాశాస్త్రీయజ్ఞానశక్తులలోకి మార్చడం అనేది సాధ్యంగా తోచదు. ఉత్కృష్టమయిన ప్రపంచకవిత్వం అంతా నిగ్రహం లేని స్వేచ్ఛామూర్తులయిన కళోపాసకుల నుండే ఉద్భవించినది. అందుచేత తాత్కాలికపు వ్రాతగాళ్లకూ, వైరాగులకూ ఈ సిద్ధాంతం వర్తిస్తుందేమోకాని ప్రముఖకళాకోవిదు లెవరికీ చెల్లదు.

కామం ఒక్కటే ప్రధానమయిన చలనశక్తి జీవితానికి. క్రోధలోభమాత్సర్యాను లన్నీ కామం అవకతవకగా నిగ్రహింపబడినప్పుడూ, దగ్ధం అయినప్పుడూ ఉద్భవిస్తాయి. మనస్సుకు ప్రధానమయిన కామశక్తి ఎప్పుడు సరిగా వినియోగం చేయబడకుండా తన శారీరక మానసిక నైజములకు వ్యతిరేకంగా వినియోగించబడుతుందో అప్పుడే మానసిక సంఘర్షణ ప్రారంభం అవుతుంది. సంఘర్షణకు కారణమయ్యే ప్రేరేపణలు భిన్నభిన్నంగా వుంటాయి. ఇటీవల, అనగా గత మహా సంగ్రామానంతరంమాత్రం సంఘర్షణ చాలామట్టుకు స్త్రీపురుష కామానికే సంబంధించినది అవుతున్నది. ఇటీవలి పాశ్చాత్య గద్యపద్య వాఙ్మయం అంతా సెక్సుకు సంబంధించిన దేఅవుట గమనించదగ్గ విషయం. లారెన్సు, జాయెస్, హక్స్లే, ఎఫ్రీలేమెనీర్, వుల్ఫ్-వీరందరి నవలలలోనూ కనపడే అరాజక ఆవేశరాజ్యం అంతా వలపుసంఘర్షణలకు సంబంధించినదే. వ్యక్తి నీతికీ, సంఘనీతికీ ఉన్న ఘోరసంఘర్షణ ఈ వాఙ్మయంలో ప్రతిఫలిస్తోంది.

అంతర్గతచైతన్యం విధ్వంసిత కామజాలం అవడంచేత చిహ్నాలతోనూ, సాంకేతికాలతోనూ తప్ప మరోవిధంగా వ్యక్తంకాదు. అంతర్గతచైతన్యం వ్యక్తం అవడానికి అవే సాధనాలు. సెక్సుజీవితాసక్తి సంబంధించిన సాంకేతికా లన్నిటినీ ఫ్రాయిడూ, అతని అనుచరులూ వందలకొలది చెప్పేరు. ఇంచుమించుగా ప్రతీవస్తువూ ఈ సెక్సు సాంకేతిక పట్టీలో వుంది. దేవాలయపుగంట, దోసకాయ, ఏటిప్రవాహం, కలం, సిరాబుడ్డి-అన్నీకూడా సెక్సు సాంకేతికాలే అంటారు ఫ్రాయిడియనులు.

ఇరవయ్యో శతాబ్దంవరకూ సైకాలజీ కేవలం సిద్ధాంతాలూ, తాత్వికచర్చలతో నిండివుండేది. అంతవరకూ సాంఘికజీవనస్మృతా లన్నిటినీ ఒక మోస్తరుగా మంచివనీ, పురాతన జీవమూలప్రకృతుల్లనూ, నేటి నాగరికలోకపు నీతిసంప్రదాయాలనూ తైపారువేసి, ఇప్పటి నాగరిక సంప్రదాయాలే మానసిక శాస్త్రరీత్యా సాధ్యమయినవీ, శ్రేయోదాయక మైనవీ అని వర్ణించేరు. నిజమే కాని, మనిషి ఆ మూలప్రకృతులను వదలి సంప్రదాయాలను అనుసరించడానికి ఎంత సంఘర్షణతో ఎంత వరాలబిసవుకు ధ్వంసం చేయవలసివచ్చిందో సైకోఎనాలిసిస్ ఋజువుచేసింది. ఈ మానసికవిభజనశాస్త్రం ముఖ్యంగా మూడు విషయాల్లో మానవవికాసానికీ, నాగరికతాభివృద్ధికీ తోడ్పడుతున్నది.

౧. చాలా కష్టసాధ్యమయినా మానసికరోగులకు ఇది ఒక నివారణపద్ధతిగా వుపయోగము కాగలదు. సైకో ఎనాలిసిస్ వల్ల సంకీర్ణమయిన మానసిక రోగాలను కుదర్చడం కష్టమయినా బిడ్డల శిక్షణలోనూ, విద్యాశిక్షలోనూ, సాంఘికజీవనంలోనూ ఈశాస్త్రరీత్యా మానవమానసికవికాసానికి మొదటినుండీ వాతావరణం కల్పించవచ్చును.

౨. మనస్సుయొక్క ప్రకృతిని శాస్త్రీయంగా విభాగించి, నగ్నంగా మూలప్రకృతులను ప్రదర్శించింది. అంతర్గతచైతన్యంయొక్క ఉనికిని కనిపెట్టి, కలల స్వభావాలనూ, మానసికగుణాల కార్యకారణాలనూ చెప్పగలిగింది.

౩. సాంఘికజీవనంలోనూ, నైతికజీవనంలోనూ చాలాసంప్రదాయాలనూ, ఆచారాలనూ, వ్యక్తిగతస్వభావాలనూ విశదపరచగలిగింది. ఈవిషయవిమర్శనవల్ల సారస్వతంలో పాత్రవర్ణనలోనూ, విషయవర్ణనలోనూ సంప్రదాయపరాయణత్వం పోయి, ఒక కొత్తరకపు వాస్తవికతత్వం ఏర్పడ్డది.

మార్క్సుగారి అధిభౌతికవాదమూ, ఐన్‌స్టీయనుల పదార్థవాస్తవికతత్వమూ ఫ్రాయిడ్‌వాదంతో సరిపోతోంది. ఫ్రాయిడ్‌సిద్ధాంతాలు నీతి అవినీతుల పరస్పరసంబంధవిషయమై నవీనసిద్ధాంతాలకు ఆధారం కలుగచేసినవి. నైషిజీ అనుయాయుల ననుసరించి ఏడ్లరు *Will to power*కు ప్రాధాన్యమిచ్చాడు. జంగు జాతిప్రకృతులకూ, వ్యక్తిగత సంస్కారప్రకృతులకూ ప్రాధాన్యమిచ్చాడు. రాజకీయంగా ఫ్రాయిడ్ సామ్యవాదానికీ, ఏడ్లరు బూర్జువా ప్రజాప్రభుత్వానికీ, జంగు దేశీయఫాసిస్టు ఆదర్శాలకూ దోహదం ఇచ్చారు. పరిణామసిద్ధాంతంతర్వాత మానవమానసికవికాసానికి

గొప్పప్రభావం కలుగచేసింది ఫ్రాయిడూ, అతని అనుచరుల సిద్ధాంతాలే. జీవపరిణామసిద్ధాంతంలో డార్విను ఎంతటివాడో మానసికపరిణామశాస్త్రంలో ఫ్రాయిడ్ అంతటివాడు. మనస్సుయొక్క మూల ప్రకృతులను విభజించి మానవమనస్సుయొక్క ప్రత్యేక పవిత్రతబుసగలను బద్దలుకొట్టేడు.

సైకోఎనాలిసిస్‌కు ఫ్రాయిడ్ - జంగు-ఏడ్లర్లు త్రిమూర్తులవంటివారు. సృష్టి అంతా ఫ్రాయిడ్ బ్రహ్మగే. అతనిసృష్టికి కొత్తస్థితిని కల్పించేడు ఏడ్లరు. ఫ్రాయిడ్ ప్రాథమిక సిద్ధాంతాలనే ఖండించి సంహారించేడు జంగు.

ప్రకృతివిశ్వరూపం పరిశోధించడానికి దూరదర్శినియంత్రాన్ని ఉపయోగించాము. శరీరయంత్రాన్ని అణువుస్థితిలో చూడ్డానికి ఎక్సరే ఉపయోగిస్తున్నాము. మన స్వభావం కనిపెట్టడానికి సైకిక్-టెలిస్కోపులు కావాలి. ప్రకృతిపురుషులను విభజనచేసి అవగాహనచేసుకొన్నాం. ఆధ్యాత్మిక మనబడే మనో ఆత్మల భౌతికస్వభావాలను విభజనచేసి గ్రహించాలి. ఆపని సైకోఎనాలిసిస్ చేస్తున్నది. ఇంకా చేయగలను.



# సాహితీసమితి కవులు

= శ్రీ నోరి నరసింహశాస్త్రి =

౧

సాహితీసమితికవులు తెలుగుదేశములో నవ్యకవిత్వము వ్యాప్తిలోకి తెచ్చినవారని ఇప్పటి కవిలోకములో వారియందు కొంత అభిమానమున్నది. అయితే,—అనేకవిధమైన రోహిలాల క్రాపింగులు పెట్టుకొని కవిత్వపుచూపులు చూస్తూ రెండుకాళ్లతో తిరిగే విచిత్రమైన మృగాలనే భావం కూడా కొందరికి లేకపోలేదు. సాహితీసమితియందు విశేషాభిమాన మున్నవారికిగాని, అసహ్యము ఉన్నవారికిగాని సమితిసంగతి ఎక్కువ తెలియదు. సమితినీ, సమితిసభ్యులనూగూర్చి కల్పితకథలు—మంచివీ, చెడ్డవీ కూడా—ఎన్నో వినడం తటస్థించినది. చివరకు ఆ కల్పనాకథలు కొన్ని విశేషప్రచారమున్న పత్రికలలోకి ఎక్కడముకూడా తటస్థించినది. అందువల్ల సాహితీసమితిస్వరూపము ప్రస్తావించవలసిన అవసరము కలిగినది.

అంతేకాక ఈ సమితికవులు అనేకమార్గములు తొక్కినారు. ఇప్పటికీ వారి నవ్యత సజీవమై ఉన్నది. సమితికవుల స్మరణవల్ల తెలుగుకవులలో నవ్యకవితామార్గాలు సమగ్రముగా స్మరించినట్లుకూడా అవుతుంది. ఇది ప్రగల్భోక్తి కాదని సహృదయులు గ్రహించగలరని మా విశ్వాసము.

౨

సాహితీసమితిస్వరూపం తెలుసుకోవలెనంటే ముందు కొంచెము శ్రమచేసి మన ఊహను ౧౯౧౮, ౧౯౧౯ సంవత్సరములలోకి ప్రసరింపచేయవలసి ఉంటుంది. అప్పటికి రేడియోలు లేవు, టాకీలు లేవు. భారతరాజకీయరంగంలో సత్యాగ్రహం లేదు, మహాత్మునికి కాంగ్రెసులో సర్వాధిపత్యం లేదు. తెలుగుదేశంలో వాఙ్మయపత్రిక అంటే ఏమిటో తెలియదు. 'ప్రతిభ' లేదు. 'భారతి' పుట్టలేదు. 'సాహితి' ఇంకా తెలుగుతల్లిగర్భంలోనే ఉన్నది. ఆ రోజులు ఊహించుకోవలె! కవులు తమ ఖండకావ్యాలు ఆంధ్రపత్రికలోగాని, కృష్ణాపత్రికలోగాని ప్రచురించవలసి వచ్చేది. 'గ్రంథాలయసర్వస్వము' అనే మాసపత్రికలోకూడా కొన్ని ఖండకావ్యాలు ప్రచురించేవారు. అన్నిటికంటె ముఖ్యశరణ్యము ఆంధ్రపత్రికవారి సంవత్సరాదిసంచిక.

ఆ రోజులు మన మూహించుకోవలె! 'చిన్నకథలు' ఒక్కటి దజనుకంటే వచ్చి ఉండవు అవికూడా చిన్నకథలే కాని 'చిన్నకథ' స్వరూపం ఎరిగి వ్రాసినవి కావు. 'ఏకాంకనాటిక' లే — సంస్కృతమర్యాదలో వచ్చినవి కాక — ఎరగము. శ్రీ రాయప్రోలు సుబ్బారావు తృణకంకణాది ఐదు కావ్యాలూ, శ్రీ అబ్బూరి రామకృష్ణరావు 'మల్లికాంబ' — ఇవి తప్ప పుస్తకరూపంగా వచ్చిన ఆధునికకవుల కావ్యాలు లేవు. శ్రీయుతులు గురజాడ బసవరాజు అప్పారావులు మాత్రము గేయాలు వ్రాసేవారు. అప్పటి ఆధునికకవిప్రపంచము అంతే! చదువుకున్నవారిలో సామాన్యముగా కవిత్వముపరమావధి అవధానాలూ, ఆశుకవిత్వమూ. అభినవకవు లని ప్రతీతి కల కొందరు సంఘసంస్కరణోపన్యాసాలు ఛందోబద్ధము చేస్తూ ఉండేవారు. తెలుగుదేశములో శిష్టుల వ్యావహారికభాష 'గ్రామ్యభాష' అనే పేరు సంపాదించుకొని పండిత పామరులచేత పనికిమాలిన దనిపించుకున్నది. ఆ రోజు లవి! శ్రీ గిడుగు పిడుగు ఉపన్యాసాలు అరణ్యరోదన మైన రోజు లవి! అటువంటి రోజులలో ఈ 'సాహితీసమితి' పుట్టింది.

ఈ సాహితీసమితి ఒక రిజిస్టర్డు సంఘమూ కాదు, ఏవో కొన్ని నిబంధన లున్న సామాన్యసంఘమూ కాదు. పోనీ, అందులో సభ్యులు కావడానికి నియమాలైనా లేవు. సభ్యత్వానికి చాలా 'అర్హుల' మనుకునేవారికి చాలామందికి, అందులో సభ్యు లయ్యే అవకాశమే ఉండేది కాదు. చాలా 'అనర్హులకు' చిత్రముగా అందులో సభ్యత్వము వచ్చేది. సభ్యులకుకూడా వారు అందులో ఎప్పుడు సభ్యులైనారో తెలిసేది కాదు. సభ్యుల పెద్దకు పాతికేళ్లూ, చిన్నవానికి పద్దిహేడేళ్లూ.

3

ఈ సమితి పుట్టడానికి ముఖ్యమైన కారణము ఆ రోజులలో తెనాలిలో జరిగిన ఒక విచిత్రసంఘటన. ఆ చిన్న పట్టణములో ఒక్కసారిగా కవిత్వమూ, లలితకళలూ అంటే విశేషము అభిమాన మున్న అనేక మంది కూడడము తటస్థపడ్డది. వారందరూ మిత్రులైనారు. అందరూ యువకులు, కార్యదీక్ష కలవారు. ఓర్పు లేనితనమూ, ఉడుకుబోతుతనమూ ఎరగనివారు.

అందులో ముఖ్యులూ, అన్నివిధాలా జ్యేష్ఠులూ, శ్రీ శివశంకరశాస్త్రి. శ్రీయుతులు వీర రాఘవస్వామి, వెంకటసుబ్బయ్య, శివకామేశ్వర రావు, పూర్ణశర్మ, హనుమంతరావు, బాబు రావు — వీరు ముఖ్యులు. వీరెవరూ పెద్ద పరీక్షలు ప్యాసయినవారు కారు. అయితే ఇంగ్లీషువాఙ్మయము, అందుమీద ఉన్న ఆదరమువల్ల, చదివినవారు. పరీక్షలకోసము చదివిన చదువు కానందున వారికి వాఙ్మయస్వరూపము అవగాహనమైనది. శుష్కమైన మాటలతో వారు కావ్యవిమర్శ చేసేవారు కారు. ఇంగ్లీషులోకి చేసిన తర్జుమాలద్వారా వారు ఫ్రెంచి, జర్మను, రష్యను, స్పానిషు, స్కాండినేవియను, జాపనీసు, పర్షియను ఇత్యాదిభాషలలోని ప్రసిద్ధకావ్యాలు కూడా పఠించారు. ఈవిధంగా ప్రపంచవాఙ్మయమూ, దానితోపాటు లలితకళల సంగతీ తెలుసుకోవలె నని తీవ్రముగా ప్రయత్నము చేసినారు.

కాని అట్లా, ఇతరదేశభాషలతో ఊరుకోక మన దేశములో బంగాలీ హిందీ మరాఠీ ఇత్యాది భాషలుకూడా అభ్యసించి కావ్యాలు చదవసాగినారు. వారిలో ఆధునికకవుల తీరులు తెలుసుకుంటూఉండేవారు.

మొదటినుంచీ వీరికి చింతా దీక్షితులు మిత్రుడే. ఆమిత్రులలో ఏ ఒకరికి కవిమిత్రు డున్నా శీఘ్రముగా అందరికీ మిత్రు డయ్యేవాడు. వారిలో కొందరు గుంటూరులో కాపురముండడము తటస్థించినది. అప్పుడు ఈవ్యాసకర్త, ఇతనిద్వారా శ్రీమాన్ కోమాండూరి కృష్ణమాచార్యులు, శ్రీ చామర్తి రాజశేఖరరావు ఆ మిత్రకోటిలో కలిసిపోయినారు. ఆమిత్రులు కూడినప్పుడు నిరంతరసాహిత్యగోష్ఠితోను, మనస్సు నొప్పించని చమత్కారభాషణములతోనూ రోజులు నిముషాలుగా గడిచిపోయేవి.

అందులో ఏ ఒకరు కొత్తకావ్యము వ్రాసినా అందరూ వినేవారు. విని తమతమకు తోచిన మార్పులు సూచించేవారు. శ్రీ శాస్త్రిసూచనలు ముక్కుకు సూటిగా ఉండేవి. శ్రీ శివకామేశ్వరరావుని పాండిత్యప్రకర్షకముగా ఉండేవి.— ఈవిధంగా ఆసూచనలలో వారివారి అభిమానాలు ద్యోతమయ్యేవి. ఆసూచించిన మార్పులమీద ఒకరి నొకరు హాస్యమాడుకునేవారు. అందరి మనస్సూ ఆకావ్యముమీద ప్రసరించి పని చేసినందువల్ల ఆకావ్యము కొంత మార్పు చెందేది. ఆ సూచనలు చేసినవారికి గర్వముగాని, మార్పులు సూచించినందుకు కవికి కోపముగాని ఉండేవి కావు. అంతా మహానందంగా వెళ్లిపోయేది.

అటువంటి రోజులలో ఈమిత్రులకు ప్రత్యేకముగా — సారస్వతానికి చిత్రకళకూ శిల్పానికీ — ఒక పత్రిక పెట్టవలె ననే సంకల్పము కలిగింది. ఇందులో ధనవంతుడు ఒక్క శ్రీ హనుమంతరావు గనుక ఆయన పెట్టుబడి పెట్టేట్లూ, అందరిలో సమర్థుడైన శ్రీ శివశంకరశాస్త్రి సంపాదకుడుగాఉండేట్లూ నిశ్చయమయింది. అది ఒక సంఘము ప్రచురిస్తున్నట్లు వేయడము ఆ కాలములో ఆచారమైపోయినందున ఈమిత్రబృందానికి ఒక

పేరు పెట్టుకోవలసిన అవసరము కలిగింది. చాలా రోజులలో, నెలలో మథనపడ్డతర్వాత 'సాహితీసమితి' అనే పేరు నిర్ధారణమైనది. కాని ఆపేరు 'సాహితి' పత్రిక వచ్చేదాకా గట్టిపడలేదు.

ఎప్పటికప్పుడు పత్రిక ప్రచురిద్దామనుకుంటున్నా, ధనము రానందువల్ల పత్రిక చాలాకాలము రాకుండానే ఉండిపోయింది. ఇంతలో సభ్యులలో ఒక పెద్ద మార్పు కలిగింది.

౪

అప్పటికి ఆ మిత్రబృందమువారంతా గ్రాంథిక భాషావాదులే. వారికి వ్యావహారికభాష పనికిరాదు. దానికితోడు ఆరోజులలో వ్యావహారికభాషలో సరియైన సాహిత్యరచనలులేవు. అట్టిసమయంలో శ్రీశివశంకరశాస్త్రి వ్యావహారికభాషలో రచనచేయడము రసవంతముగా ఉంటుందనేనిశ్చయానికిముందువచ్చినాడు. తర్వాత కొన్ని నెలలపాటు ఆయనతో 'గ్రామ్యవాదము' పనికిరాదని వాదించి ఈ వ్యాసకర్తకూడా అంగీకరించినాడు. మిగిలినవారు ఒప్పుకోలేదు. శ్రీ వీరరాఘవస్వామి ఒక్కడుమాత్రము 'కొంత మార్పు' పనికివస్తుందని అంగీకరించినాడు. శ్రీ శివకామేశ్వరరావు అసలే పనికిరాదు, అపమార్గాన పోతున్నారని పట్టుపట్టినాడు. శ్రీ వెంకటసుబ్బయ్య ఇష్టము లేకపోవడము కనపరచే మౌనము అవలంబించినాడు. శ్రీ చింతా దీక్షితులు ఎప్పుడు మారినదీ తెలియదు కాని 'సాహితి' మొదటి సంచికలోనే ఆయన వ్యావహారికభాషారచనలు పడ్డవి.

సాహితి ౧౯౨౦ జనవరిలో వచ్చింది. ఆ రోజులలోనే శ్రీ మునిమాణిక్యం నరసింహారావు 'సమితి'బృందములో చేరసాగినాడు. ఆయనకు పూర్వభాషాజ్ఞానము తక్కువ అనే భయముతో రచన చేసేవాడు. కాని మొదటినుంచీ ఆయనకు సుఖమైన రచన అలవడ్డది. ఆయన 'షఫీ' 'సాహితి' మొదటి సంచికలోనే ఉన్నది. ఆ ప్రాంతాలలోనే శ్రీ పెద్దిభట్ల రామచంద్రరావుకూడా ఈ బృందములో కలిసినాడు.

'సాహితీ' పత్రిక ప్రచురణతో 'సాహితీసమితి'కి దేశములో కొంత ఖ్యాతి వచ్చింది. ఈసమితి సభ్యులు తమ రచనలు ఎందులో ప్రచురించినా తమ పేరుప్రక్కన 'సాహితీసమితి' అనికూడా వేసుకోవడము అలవాటుచేసినారు. దానితో దేశములో ఇప్పుడు మనము ఊహించుకోలేనన్ని సారస్వతసమాజాలు బయలుదేరినవి. సాహితీసమితిలో సభ్యత్వము కోసము దరఖాస్తులు రావడం మొదలుపెట్టినవి.

'సాహితి' పుట్టినతర్వాతనే శ్రీయుతులు వేదుల సత్యనారాయణశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి సభ్యులైనారు. శ్రీ శ్రీనివాసశిరోమణికూడా ఆ ప్రాంతాలలోనే సభ్యుడైనాడు. శ్రీ కె. ఎచ్. వి. యస్. నారాయణ శ్రీ దీక్షితులుద్వారా సభ్యుడైనాడు. శ్రీ స్వామిద్వారా శ్రీ కొత్తపల్లి సుబ్బణ్ణాచార్యులు సమితిలో చేరినాడు. శ్రీ వింజమూరి పార్థసారథి కొన్ని చక్కని కథలు వ్రాసి సభ్యత్వము సంపాదించినాడు.

శ్రీయుతులు విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు సమితిసభ్యులైనారు. ఇప్పుడు వారికున్న ప్రసిద్ధి వారి కప్పుడు లేదు. వారు నలుగురూ సమితిలో ఒక ప్రత్యేకబృందముగా ఉండేవారు.

సాహితీసమితి లోకములో స్థిరప్రతిష్ఠ సంపాదించినతర్వాత అందులో శ్రీ గిడుగు రామమూర్తిపంతులును అందులో గౌరవసభ్యునిగా చేర్చినాము. ఆ గౌరవము అసమానమేధాశాలియైన వారి కొక్కరికే సాహితీసమితివారు చేసినారు.

౫

సాహితిలో మొదటినుంచీ వ్యావహారికభాషలో రచనలు ప్రచురణమైనవి. శ్రీ శివకామేశ్వరరావుకు అది ఇష్టములేకపోయింది. కొంతకాలము ఆయనకావ్యాలు 'సాహితి' లో ప్రచురణకు ఇచ్చినాడు. కాని మొత్తమువీద ఆయనకు ఈ 'అపండిత' సమూహములో కలిసి రచనలు చేయడము ఇష్టము లేక

## ఆంధ్ర గ్రంథమాల, పోస్టుబాక్సు 212, మదరాసు.

**పండితారాధ్య చరిత్ర :** శైవమత ప్రతిపాదకమగు ద్విపదకావ్యము. పాల్కురికి సోమనాథ కవి రచితము. డా. చిలుకూరి నారాయణరావు గారు సంస్కరించిరి. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతములను పంచ ప్రకరణములును ఒకే సంపుటమున గలవు. ఇంత నిర్దుష్టముగ ఈ గ్రంథము నిదివర కెవ్వరును ప్రకటించలేదు. నారాయణరావుగారు రచించిన **అమూల్య మైన పెద్ద** పీఠికకూడ కలదు.

**బసవపురాణము:** పాలకురికి సోమనాథ కవి రచించిన ద్విపదకావ్యము. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన చక్కని, విపులమయిన పీఠికతో సహితము.
రెండూకలిపి రూ. 6-0-0 మాత్రమే.

**తంజాపురాంధ్రనాయక రాజచరిత్ర :** కురుగంటి సీతారామయ్యగారు రచించినది. తంజావూరును పరిపాలించిన ఆంధ్రనాయకరాజుల చరిత్రో దంతములు యుక్తియుక్తములైన ఆధారములతో సవిస్తరముగా వివరింపబడి యున్నవి. అనేక చిత్రపటములు గలవు. వెల 1-0-0.

**అళియరామభూపాలుడు:** టి. శివశంకరముగారు రచించినది. విజయనగరపు రాజగు అళియరామరాయల సమగ్రజీవితచరిత్ర. త్రివర్ణ, ద్వివర్ణ, ఏక వర్ణ చిత్రములతో సర్వాంగసుందరముగా ప్రకటితమైన చరిత్రగ్రంథము.
వెల 1-0-0.

**ఆత్మకథ :** నేటికాలమునకు యుగపురుషుడుగా పరిగణింపబడుచున్న గాంధీ మహాత్మునియొక్క సమగ్రజీవిత చరిత్ర ఇది. ఈ చరిత్రను మహాత్ముడే స్వయముగా వ్రాసియున్నాడు. శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు దానిని సరళమైన శైలిలో ఆంధ్రీకరించి యున్నారు. 2-వ భాగము వెల 1-0-0.

**జీర్ణవిజయనగర చరిత్ర :** కుందూరు ఈశ్వరదత్తుగారు రచించినది. కృష్ణదేవ రాయల రాజధానియైన హంపీవిజయనగరముయొక్క ప్రాచీన వైభవమును కన్నులకు కట్టినట్లు వివరించుచున్న చారిత్రక గ్రంథము. అనేకచిత్రములతో సంకలితమైనది. వెల 1-0-0.

# ఏకలవ్యునికి

= శ్రీ సుందరాచారి =

నిలుము నిషాదవీర! ఇది నీసరివానికి సేవగింపు; కా
వలయునటన్న నీ చురకుబాణముల న్మరలించి జాలి చూం
పుల హరిణాలకూనలకు పోయుము ప్రాణము; నీదు నైపుణిన్
నిలుపగజాలు వ్రేలి నిటు నెత్తుట ముంచుట నీతి కాదురా!

ఎవడో శ్రీయుతు డస్త్రవిద్య లరయన్ ఏ దేశికాచార్యునో
అవలంబించెనటంట; ఆతడును సాధ్యాసాధ్యము ల్గాంచకే
భువిలో నిన్నసమాను జేతు ననియో పొంకంబుతో; దానికై
తవ శౌర్యాంగుళి ధారవోతువటరా! త్యాగంబు చాలించరా!

అమ్ముల నేయు తీరులను నారయ నాడట కేగి నీవు పా
దమ్ముల వ్రాలి వేడితివి దాత యతండని—ఏమియిచ్చె? పో
పొమ్ము నిషాదు డీవనియె; పూజ్యు డతండని పూజసేతు వా
రమ్మిక చాలు—వాని గతి వ్రాసిన తీరగుగాని తమ్ముడా!

మానము వాపి పంపినను మానకయే గురుభావ మొప్పగా
పూని రచించినా వతని బోలిన రూపును బంకమట్టితో
ప్రాణములేని బొమ్మ యను భావ మెఱుంగక కొల్చినావు కం
వా! నయమూర్తి! నీ కదియు పాతకమయ్యె! నిదేమికర్మరా!

నడుముల్ గట్టి, తదేకనిష్ఠుడయి, తా నా దేశికాచార్యునిన్
విడకే గొల్చియు రిక్తహస్తుడయి నీ పేర్విన్న దేపాటిగా
పడియేడ్వంగను సిగ్గుచేటుగదరా! వాడేటి విద్యార్థి; నీ
అడుగుల్ గొల్చుటకేని చాలునటరా! అన్యాయమా దీనికై!!

---



'తెల్లజాతి'

యిక కథలోకి వద్దాం. ఈ స్వల్పజీతం ఎలా పంచడమనేది ఒక గొప్ప సమస్య ఔనంటారా కాదంటారా చెప్పండీ తగు మనుషులు! దేశనాయకులకు వుండే సమస్యలకంటే ఇదే గొప్ప సమస్యగా నాకు తోచదూ మరి!

నే నిలా ఆలోచిస్తూ వుండగానే "అదుగో నాన్నగారూ!" అంటూ పాపాయిని ఎత్తుకుని, నవ్వుముఖంతో వస్తూ, మా ఆవిడ రెండు చేతుల్నీ నా కందిస్తున్న పాపాయిని నావొళ్లో కూలవేసింది.

"ఏమి టలా ఆలోచిస్తున్నారు కోటన్నా తీయకుండా?"

"………………"

"ఓహో! ఈవాళ జీతాలు వచ్చే రోజు కదూ; కోటు బరువుగా వుంది కాబోలు తియ్యడానికన్నా వీలుకానంత!"

"అవును! జీతమంతా కానులుగానే యిస్తే రిక్షా చేయించుకునే రావలసి వుండును"

"అయితే ఆ బరువుమూటని జేబులోంచి యిలా పడవెయ్యండి: నాకూ వుపయోగపడుతుంది ఎల్లుండి దీపావళిఖర్చుకి; మీ కోటూ చులకనపడుతుంది"

నాకు వొళ్లు మండింది.

"ఇవ్వడానికి యేమీ అభ్యంతరం లేదు. నువ్వు దీపావళికి నీ యిష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టుకోవచ్చు-తీర్చవలసిన బాకీలన్నీ తీర్చి…"

"అలాగైతే బాకీలకే చాలదు! ఈమహా గొప్ప జీతమూ పుచ్చుకుని నేను నోర్లుకునే దేమిటి?"

"అయితే ఏ బాకీ తీర్చకుండా నీకే యిచ్చివెయ్యమంటావా?"

"బాకీలు వచ్చే నెలైనా తీర్చుకోవచ్చు; పండుగు వచ్చేనెల రమ్మంటే వస్తుందా? చెప్పండి మీరే."

"……………………"

"నా సలహా వినండి! అద్దె వచ్చేనెల సర్దుబాటు చేస్తామని యింటావిడతో చెప్తాను. బట్టలవాడికీ ఆరీతినే కబురు చెయ్యండి. షాహుకారుకీ చాకలికీ సగంసగం యిచ్చి నోరు కట్టివెయ్యవచ్చు. నేతిసెట్టికి అందరూ యాభైలూ, అరవైలూ బాకీ వుండగా మనం పదిహేనేగదా బాకీవున్నది! వాడిని దబాయించి పంపెయ్యొచ్చు; అంతగా నిర్బంధిస్తే 'మరి నీ వాడిక అక్కర్లేదు' అని చెబితే వాడే నోరు మూసుకుని మారుమాట చెప్పక గమ్మని వెళతాడు. పాలదానికి నాలుగు రూపాయిలు చేతిలో పెట్టి పంపేసే పూచీ నాది. ఎటొచ్చీ పనిమనిషికి యివ్వక తప్పదు. దాని కిచ్చే రెండురూపాయిలూ వక లెక్కలోవి కావు. మిగతా ముప్ఫయి రూపాయిలూ పండుక్కి ఉపయోగించుకుందాం."

నా కీ సలహా యేమీ నచ్చలేదు. ముప్ఫయి రూపాయిలు వొక్క పండుగుకోసం ఖర్చుపెడితే జీవితం గడిచేది యెట్లా? ఇన్ని బాకీల బరువూ తలమీద పెట్టుకుని పండుగు చేసుకుంటేమాత్రం యేం సంతోషం? ఈబాకీలు వచ్చే నెలన్నా

# సిల్కు చీర

[కథానిక]

●

= 'రావు' =

౧

ఆఫీసునుంచి అప్పుడే రావటం. కొళాయి దగ్గిర కాళ్లూ, చేతులూ, ముఖమూ కడుక్కొని, తాడుమీద వేసివున్న తువ్వాలు తీసి ముఖం అవీ తుడుచుకుంటూ గదిలోకి వెళ్లి యీజీఛైరులో కూలబడ్డాను. పగలల్లా పని చెయ్యడంచేత సాయంకాలం అయ్యేసరికి నాలాంటి గుమాస్తాలకి నడుంపడిపోయి కాళ్లులొటలొటలాడిపోవడం ఆశ్చర్యంకాదు. అందులోనూ ఈరోజు జీతాలరోజు! జీతం అందుకోవడం అంటే అందరికీ సంతోషమే. కాని అది పెద్ద జీతగాళ్లకి! నాలాంటి స్వల్ప జీతగాళ్లకి అది విచారకరమైన రోజే.

కుర్చీలోనైతే కూలబడ్డాను. కాని మనస్సుకి శాంతి యేదీ! ఈ చేతిలోపడ్డ నలభై అయిదు రూపాయలూ ఎవరెవరికి ఎలా సర్దుబాటు చెయ్యడ మనేదే పెద్ద సమస్య! దాన్ని 'సాల్వ్' చెయ్యలేక కొట్టుకుపోతున్నాను.

"ఇది నీ దృష్టిలో స్వల్పజీతమా?" అని ప్రశ్నించేవారు ఉండవచ్చును. ఏపల్లెటూరులోనో అయితే ఈ డబ్బుతో జమీందారీ దర్జా వెలిగింపవచ్చు; ఏ చిన్న బస్తీలోనో అయితే పెద్దమనుష్యుల జీవనం జరపవచ్చు, కాని చెన్నపట్నంలాంటి గొప్పగొప్ప పట్నాల్లో యిది ఒక జీతంలో లెక్క కాదు. దీన్ని ఆధారం చేసుకుని సుఖంగా జీవనాన్ని గడపా లేము. గుమ్మం దిగాలంటే పర్సు జేబులో లేకుంటే యిక్కడ మనిషి దమ్మిడీకి మారడు.

ఇంటి అద్దె పన్నెండు రూపాయలూ పుట్టమీద పెట్టినట్టు వేరే వుంచవలసిందే! కిరాయికొట్టులో పద్దు పదిహేనుదాకా పెరిగి వుంది. బట్టలకొట్టుకి చెల్లించవలసిన పదంటికీ నాల్గురోజుల క్రితమే బిల్లు చేరింది. పనిమనిషికి రెండురూపాయిలూ దవ్వాబిళ్లల్లాగ పడవెయ్యక తప్పదుగదా! నేతిసెట్టికి ఇవ్వవలసిన రూపాయిల లెక్క ఎదురుగా వున్న గోడమీద పదిహేను చుక్కలూ భూతంలాగ కనబడుతూ వున్నాయి. కేలండరులో దినదినమూ ఎక్కించే పాలవాడిక పదహారు పళ్లకి మించి వుంది. చాకలికి నాలుగు రేవులకి పైగా పొడకూలి యివ్వవలసి వుంది. నాకు గణేశ్ కాఫీపొడీ, మా ఆవిడకి నర్సాన్ టీ డబ్బు చెల్లిస్తేనే గాని రావు గదా! ఇంతకీ ఖర్చు లేనిది మంగలిని గురించి. ఎంచేతా? నేను "స్వయంమంగలిః" కాబట్టి.

తీర్చాలా వద్దా? అప్పుడుమాత్రం పైకం ఎక్కువగా ఎక్కడనించి వస్తుంది తీర్చడానికి? ఇంతకీ ముప్ఫయి రూపాయిలు - అంత పెద్ద మొత్తం ఒక్కరోజు కెందుకేమిటి?

నేనిలా ఆలోచించుకుంటూ వుంటే మా ఆవిడ తొందరపాటూ, ఆలోచన లేక పోవడం ... శరీరాన్ని మండింపజేశాయి. నేను కోపాన్ని దిగమింగి —

"ఆరేళ్లనుంచి కాపరం చేస్తున్నా నీకు ప్రపంచజ్ఞానం కొంచెమన్నా లేక పోవడం ఆశ్చర్యంగా వుంది. తగని పరుగులకి ఎప్పుడూ సిద్ధపడకూడదు. ఏమన్నా అంటే 'నీలకంఠాయ స్వాహా!' చేస్తావు. నువ్వు యీ పండుక్కి ముప్ఫయి రూపాయిలు ఖర్చుపెట్టదలచడం మన తాహతుని ఆలోచించేనా?" అని కొంత రూక్ష స్వరంతోనే అడిగాను.

ఆమె ముఖం మూరెడు చేసుకుంది.

"ఏమో ముప్ఫయిరూపాయిలు, ముప్ఫయిరూపాయిలు అంటూ ముక్కుమీద వేలేసుగుంటూ మరీ ఏకరువు పెడుతున్నారు. చలివేంద్రలుపెట్టిస్తారా, సత్రాలకిస్తున్నారా? లేకపోతే మనిద్దరితిండికీ ఒకనాటికి ఈసొమ్ము కాజేస్తాననుకున్నారా?... ఎప్పుడైనా ఒక విలువైనచీర కొమ్మని ఈ నోటితో అడిగేనా? ...పోనీగదా అని సంతోషంతో మీరన్నా తెచ్చారా? నోరు విడిచి యిప్పుడే నే అడుగుతూవుంట! ఓ ముప్పై రూపాయిలకి మంచి బెంగుళూరు సిల్కుచీర తప్పక ఈపండుక్కి కొనిపెడితే మరి మిమ్మల్ని ఎప్పుడూ నిర్బంధించను. మీరో అయిదు రూపాయిలకి మంచి పంచెలచాపు కొనుక్కోండి. పాపాయికి ఒక టోరకం రెండు ఫ్రాకులు కొని తెండి. ఇదే నాకోరిక. ఒక విలువైన చీర లేకపోవడంచేత నాకు నలుగురిలోనూ నామోషీగా వుంది. మీరు ఈసారి ఎన్ని తిట్టినా వొప్పుకుంటాను. కాని ఈసారిమాత్రం నాకోరిక నెరవేర్చక తప్పదు."

"లేకపోతే—"

"లేకపోతేనా? పండుక్కి పుట్టింటికే వెళ్లిపోతాను. మా అమ్మగారింటికి వెళ్లడానికి నాకు పిలుపులు అవసరం లేదు. ఆడబొట్టె యింటికి వస్తే వాళ్లు ఆమాత్రపు చీర కొని యివ్వలేకపోరు; అంత లేనివాళ్లూ కారు! మీకూ ఈ బాధ తప్పిపోతుంది."

"............"

"అలా అని సంతోషించబోయేరు. నేను మళ్లీ యిక్కడికి రావాలంటే మీ చేత్తో నేనుచెప్పిన చీర కొని పట్టుకొచ్చిపిలుచుకు వస్తేనే కుదురుతుంది. లేకపోతే..."

"అబ్బో! గొప్ప పట్టుదలే!"

"అలాంటి పట్టుదల వుంటేనేగాని మీలాంటి మహానుభావులు దారికి వస్తారా?"

ఇంక ఈవిషయంలో ఎక్కువగా ప్రసంగించడం అనవసర మని తోచింది. ఏది ఎలాగ కానిండి, నేను చేయదలచుకున్నట్లు నేనున్నూ చేసే తీరుతాను. అందుకోసం ముందస్తుగా నాఅభిప్రాయాల్ని వెలిబుచ్చడమూ, ఇప్పట్నుంచీ మనస్తాపాలు పెట్టుకోవడమూ ఎందుకూ? మరో సంగతి. నేను సిల్కుచీర తేకపోతే ఆమె పుట్టింటికి వెళ్లిపోతుందట. అదీ ఒకందుకి మంచిదే. ఆవిడగారు రెన్నెల్లపాటు అక్కడ వుంటే

యిక్కడ అప్పులన్నా తీరుతాయి. యిరవై రూపాయిలతో నా కాలక్షేపమూ జరిగి పోతుంది. ఆమీద ఎలాగూ సిల్కుచీర కొన డానికి అవకాశం ఏర్పడనూ ఏర్పడుతుంది. తర్వాత ఆమె రానూవస్తుంది.

నేను అందుకున్నాను —

"ఇప్పుడు సిల్కుచీరా, అవీ తెస్తా ననుకో. ఆమీదనన్నా అప్పులు ఎలా తీరు తాయి! ఈ నెల ఎలా జరుగుతుంది?"

"సంసారం వున్నంతవరకూ ఇవన్నీ మనని వెంటాడుతూనే వుంటాయి. సముద్రంలో అలలు లేకపోవడం యెప్పుడు? స్నానం చేసే దెప్పుడు? ఒకనాడన్నా దర్జాగా, సంతోషంగా గడపకపోతే ఈ జీవితం మరెందుకూ?"

"................."

"నా వొక్కర్తెకోసమే చెప్పలేదు. నేను చక్కని సిల్కుచీర కట్టుకుని ముస్తాబైతే మీకుమాత్రం చూసి ఆనందించాలని వుండదేమిటి? మిమ్మల్ని సంతోషపెట్టడానికేగదా యీ వేషం అంతాను!"

"....................."

"ఏ రంగన్నా సరే-కలరు లైటుగా వుండాలి. బోర్డరు వెడల్పుగా వుండాలి. నల్ల బోర్డరైతే మరీ మంచిది."

"..................."

"ఫ్రాకులు మరిచిపోవద్దు...ఇదిగో! మీరు పంచెలు కొనుక్కోకపోతే ఒప్పుకోను. మీరూ కొనుక్కోడానికి సిద్ధపడితే నే నాకూ చీర కొనండి. లేకపోతే యేమీ వద్దు."

"..................."

"పొద్దున్నే యిడ్లీ, కాఫీ రెడీచేస్తాను. అవి తీసుకుని మరీ వెళ్లండి షాపుకి. నేను రానక్కర్లేదు. మీకు నచ్చితే నాకూ నచ్చినట్లే సెలెక్టుచెయ్యడంలో మీరు గట్టివారు!"

౨

రోజూ చూపించే మర్యాదకన్న ఎక్కువ మర్యాదతోనూ, ఎక్కువ ప్రేమతోనూ ఆమర్నాడు ఉదయం మా ఆవిడ కాఫీ ఫలహారాలు తయారుచేసి పెట్టి, షాపులు తిరగడానికి కొంత శక్తినీ, ప్రోత్సాహాన్నీ కలగజేసింది. పాపం! ఆమెఆప్యాయం చూసి నాకే నవ్వు వచ్చింది. ఈ ఉబలాట మంతా వృథాగదాఅనుకున్నాను. ఏమంటే, నేను ననేమిరామనుషుల్లో లెక్క. ఆమె పట్టుదలని మించిన మూర్ఖపుపట్టు నాది. అటు సూర్యుడు ఇటు వుదయించినా నే నీ దీపావళికి పది రూపాయిాలకంటె ఒక్క దమ్మిడీ ఎక్కువ ఖర్చుపెట్టను. అదీ ఆమె ఏడుస్తుందనే కారణంచేతే గాని, వుత్సాహం చేతమాత్రం కాదు. నేను కొనదలచుకున్న వేమిటంటే—నాలుగో నాలుగున్నరో యిచ్చి వక చీరా, మూడున్నరకి ఓపంచెల చాపూ, ఒకటిన్నర రూపాయికి పాపాయి కో రెండు ఫ్రాకులున్నూ. నేనూ ఆలోచించాను. ఉదయాన్నే యివన్నీ తెస్తే అప్పట్నించే ప్రారంభమౌతుంది యుద్ధం! సాయంకాలమే షాపుకి వెళ్లి తెస్తే రాత్రి భోజనాలయాక వాటిని ప్రదర్శింపవచ్చు. అంతవరకూ ఏ పేచీలూ లేకుండా సుఖంగా గడపనూ వచ్చు. ఇలా అనుకుని సాయంకాలమే షాపుకి వెళ్ల డానికి వీలు అవుతుందనీ, ఇప్పుడు తొందర

పనిమీద వెళ్లాలనీ చెప్పి మా ఆవిడను ఎలాగో ఒకలాగు ఒప్పించాను.

*        *        *

సాయంత్రం ఏడుదగ్గిరౌతుంది. చంకలో పార్సెలు పెట్టుకుని బ్రాడ్వే టర్నింగు దగ్గర నేను ట్రిప్లికేను ట్రాముకోసం ఎదురు చూస్తున్నాను.

ఇంతలో వెనకనుంచి వచ్చి నాభుజాన్ని తట్టుతూ, మా ఆఫీసులోనే పని చేస్తూ వున్న భూషణం "హాలో రావ్! దీపావళీ పర్చేసెస్‌లాగున్నాయే!" అన్నాడు.

నేను వెనక్కి తిరిగి చూశాను. అతని చంకలోనూ వుంది వొక పార్సెలు. అతని భార్యా కూడా నా భార్యావంటిదే అయి వుండాలి అని అనుకున్నాను.

"ఏమి పర్చేసెసో లెద్దూ! అసలే స్వల్పజీతగాళ్లం! అందులోనూ ఈ 'వారు' నుంచి ప్రతీ వస్తువుకీ డబుల్ ది కాస్టు!..."

"ఎంత ఖర్చుపెట్టే వేమిటి?"

"ఏం ఖర్చుపెట్టగలం భాయ్! ఏదో అమాంబాపతులు పదిరూపాయలకి ఇటో అటో...నువ్వు చాలా ఖర్చు పెట్టా వనుకుంటాను."

"ఏదో నిన్ననే గదా జీతం అందుతా! యీదీపావళికి అది అంతా ఖర్చుకావా లని నా వుద్దేశం. ముప్ఫయి రూపాయిలూ ఖర్చు చేస్తే యీ చిన్న పార్సెలు వచ్చింది."

నేను నవ్వుతూ అందుకున్నాను—

"అవును! కొత్తకాపరంకూడాను నీది. విలువైనవి పట్టుకువెళ్లకపోతే ఇంట్లో మూతిముడుపులూ అవిన్నీ!"

"ఎందుకూ? అనుకుంటే పాపంకూడాను. మా ఆవిడకు ఎక్కువ ఖర్చు పెట్టడమంటే యిష్టం లేదు. ఈ పండుగ ఖర్చంతా పది రూపాయిలకి ఎంతమాత్రమూ మించకూడదని ఆమెఅభిప్రాయం."

"మరి యింతెందుకు ఖర్చుపెట్టేవూ?"

"నాసంతోషంకొద్దీనీ. వాళ్లంటే అక్కరలేదంటారు గాని, మనం ఆలోచించొద్దూ? రాకరాక ఏడాది కొక్కసారి యిలాంటి పండుగ వస్తుంది. ఏం ఖర్చుపెట్టినా యిదే సమయం. ముందుకీ అంటే —— ఏమో! అప్పు డెలా వుంటాయో పరిస్థితులు! ఎవరి కెవరో? అయితే నీకో సందేహం ఉండొచ్చు-నెల ఎలా గడపడమనీ, అప్పు లెలా తీరుతా యనిన్నీ. ఈ విచారం మనకి యావజ్జీవమూ వున్నదే. మనిషిజన్మ ఎత్తినందుకు ఒకనాడన్నా ఆనందంగా వుండొద్దూ?"

ట్రాము వచ్చింది. ఇద్దరం ఎక్కి కూచున్నాం.

నా మనస్సు ఆలోచనలలో పడ్డది. క్లుప్తంగా ఖర్చుచేయించి, పొదుపుగా సంసారం నడుపుకునే ఉత్తమురాలు భార్యగా లభించినందుకు భూషణం గొప్ప అదృష్టవంతు డని చెప్పాలి. నాకు అలాంటి భార్య దొరికివుంటే ఎంత బాగుండునో అని పించింది. నాభార్యపెద్దతనాన్ని కొంత విమర్శించుకున్నాను. సిల్కుచీర కొమ్మనటంతప్ప మరేమీ ఆమెతప్పు కనబడలేదు. ఔను! అదీ తప్పు కాదు. ఏడాది కొక్కటే ఒక్క-దీపావళి! మా ఆవిడా ఎప్పుడూ కోరనూ లేదు. నోరు విడిచి అడిగింది. కొనకపోవడం తప్పే ననిపించింది. భార్య కోరకపోయినా

కొన్నాడు భూషణం. కోరినా కొనలేక పోయాను నేను. ఆలోచిస్తే అతనికీ నాకూ భేదం వుంది. వాళ్లది కొత్తకాపరం. మాది కొంత పాతబడింది; సంసారం మరో ప్రాణితో పెరిగిందికూడాను. అంచేత నేను చేసిందీ తప్పుకాదని సమాధానపడ్డాను.

ట్రాము ట్రిప్లికేను చేరింది. అల్యూమినియం ఫాక్టరీదగ్గర అతను దిగిపోయాడు; పైక్రాఫ్ట్సరోడ్డుదగ్గర నేను దిగాను.

ఇంటికి వెళ్తున్నానే గాని, బలవంతాన్ని ఎవరో వెనకనుంచి నెట్టుతున్నట్లే నడుస్తున్నాను. ఇల్లు దగ్గిర అయినకొద్దీ దిగులు ఎక్కువ కాజొచ్చినది. ఇక ఎలాగూ కలతలూ, మనస్పర్ధలూ తప్పవనుకున్నాను. ఇంతకీ ధైర్యంమాత్రం విడవలేదు.

## 3

గుమ్మంలో అడుగు పెట్టాను. నవ్వుముఖంతో మాఆవిడ పాపాయిని ఎత్తుకుని ఎదురుగా వచ్చింది.

" మీకోసమే ఎదురుచూస్తున్నాను. ఎంతసేపటికీ రాలేదు మరీ. చీకటి! దానికి సాయంబ్రాకొటూ చినుకులున్నూ! మనస్సు పరిపరివిధాల పోయి బెంగపెట్టుకున్నాను కూడాను."

"ట్రాము దొరక్క. ఆలస్యం అయింది" —నేను కొళాయిదగ్గిర కాళ్లు కడుక్కుంటూ పార్సెలు ఆమెకు అందించాను.

"ఇప్పుడే విప్పకు. భోజనా లయాక చూసుకోవచ్చు."

"అలాగే లెండి. పాపాయి ఫ్రాకులకి ఎంత ఏడ్చిందనుకున్నారు, పక్కవారిపిల్లకి కొన్న కొత్త గౌనులు చూచి. పెట్టెలోంచి చాకింటిమడతలు తీసి యిచ్చినా పాతవంటూ వాటిని విసిరికొట్టింది."

"ఇదంతా పెద్దపాపాయి ఉబలాటం కాదూ సిల్కుచీరకి?"

"చాలు లెద్దురూ — మీ మాటలూ, మీరున్నూ" అంటూ ఆమె లోపలికి వెళ్లిపోయింది.

*    *    *    *

నాభోజనం అయింది. మాఆవిడ అన్నానికి కూర్చుంది. పాపాయి కూటంలోని ఉయ్యాల్లో నిద్రపోతున్నది.

బట్టల పార్సెలు గదిలో టేబిలుమీద భద్రంగా వుంది.

నేను గదిలోకి వచ్చి మంచమ్మీద వెల్లకిలా పడుకొని ముందు జరగబోయే సన్నివేశాన్ని ఎదుర్కోడానికి సిద్ధంగా వున్నాను.

నాకు ఆలోచనలమీద ఆలోచనలు పోతున్నాయి.

"మా ఆవిడ ఇల్లంతా చక్కబెట్టు చేసుకునివచ్చిఆప్యాయంతో పార్సెలువిప్పుతుంది; నేను తెచ్చిన వస్తువులు చూసి మండిపడి, కొంచెం కూనిరాగం తీసి మూతిముడుచుకు పడుక్కుంటుంది. తెల్లవారినతర్వాత ప్రయాణం కట్టి పుట్టింటికి వెళ్లిపోతుంది, పండుగ రోజని అయినా ఆలోచించకుండా. నలుగురూ ' ముక్కుమీద వేలేసుకుంటారు. నాకు నలుగురిలోనూ సామర్థ్యం......ఒంటరిగాణ్ణి గనక యింత యిల్లు అవసరం ఉండదు. పలాణ్జిలోనో తక్కువ అద్దెకి వక గది తీసుకుంటాను. హోటల్లో భోజనం.

ఏ లాడ్జి అనుకూలంగా వుంటుంది? ఏ హోటల్లో టిక్కెట్లు కొనడం?"

ఇవే నా ఆలోచనలు!!

ఇలా అరగంట జరిగిపోయింది. మా ఆవిడ నైట్ డ్రస్సు పూర్తిచేసుకుని ఉయ్యాల్లో పడుకున్న పాపాయిని తీసుకు వచ్చి గదిలో చిన్నమంచంమీద పడుకోబెట్టి, వెచ్చగా బట్టకప్పింది. ఇదంతా క్రీగంటితో చూస్తూవున్న నేను నిద్ర నటించి కళ్లు మూసుకున్నాను, దడదడ కొట్టుకుంటున్న గుండెతో.

పార్సెలు కట్టు విప్పిన చప్పుడయింది. తర్వాత పొట్లం విప్పి బట్టలుతీసిన చప్పుడూ అయింది.

"చీర ఎంత బాగుందో! ఒకటో రకం! బోర్డరుకే యివ్వొచ్చు ఎంత డబ్బయినా. ఫ్రాకులు కళ్లు మిరిగిపోతున్నాయి! పంచెలు కూడా మంచి సెలెక్షనే" అనే మాటలు నాచెవిని పడ్డాయి.

ఆమె వేళాకోళానికి ప్రారంభించిందని అనుకున్నాను. ఇక వాగ్యుద్ధానికి ప్రారంభమేమో ?

ఆమె మంచందగ్గిరికి వచ్చి నన్ను మెల్లగా తట్టింది.

"చూడండీ! అప్పుడే నిద్రా ? మీరెంత మంచివారండీ! నే ననుకున్నవాటికంటె మంచిరకాలు తెచ్చారు, మొదట విసుక్కున్నా! మీకుమాత్రం అభిమానం లేదేమిటి నామీద? ఎంతో బాగున్నాయి!"

నిద్రనుంచి లేచినట్లు నటిస్తూ నేను చటుక్కున లేచి బట్టలవేపు చూశాను. చూసి ఆశ్చర్యపోయాను. అవి మా ఆవిడ చెప్పినట్లే చాలా ఆకర్షణీయంగా వున్నాయి.

ఎంతపని జరిగింది!!

అవి భూషణం కొన్నవికాబోలు పార్సెళ్లు తారుమారైనాయి!

మా ఆవిడముఖం చాలా వికసించి వుంది! అందులో ఒక కొత్తతళుకు ప్రకాశిస్తున్నది!

"ఏమిటలా దిగాలుపడి చూస్తున్నారు?" అంది ఆమె.

ఒక్కసారిగా నా మనస్సు కుంగిపోయింది. మా ఆవిడే గెలిచింది. నేనే వోడిపోయాను. వున్న సంగతి చెప్పి ఆమెమనస్సు ఎప్పటికీ పాడుచెయ్యడం సరసమైన పనిగా తోచలేదు. ఆమెచేతిలో పడ్డ వస్తువులని 'మనవికా' వంటూ తీసుకోవడం పశుత్వాన్ని తెలుపుతుంది. తానొకటి తలిస్తే దైవ మొకటి తలచిన ట్లయింది. భూషణానికి మర్నాడు జరిగినదంతా చెప్పి వచ్చేనెల సర్దుబాటు చేస్తానని సమాధానపరచవచ్చు.

ఇలా అనుకుని మా గృహలక్ష్మిమాటకి సమాధానంగా వెంటనే జబాబిచ్చాను.

"మరేమీ లేదు. నా సెలెక్షను నీకు పూర్తిగా నచ్చిందో, లేకో అని ఆలోచిస్తున్నాను."

"ఏమి చమత్కారమండీ! వీట్లోనే కాదు, అన్నిట్లోనూ ఎంచడంలో మీరు చాలా గట్టివారని మిమ్మల్ని పెళ్లాడ్డానికి ముందునుంచి బాగా తెలుసుకున్నానుగా"

" .......... "

"చీరా, పంచెలూ, ఫ్రాకులూ—అన్నీ ఒకదానికొకటి ఈడుతీయకుండావున్నాయి."

" .......... "

"చూడండీ! రేపు ఈ చీర కట్టుకుంటే నేనుఎంతో బాగా వుంటానుకదండీ!"

ఇలా అంటూ ఆమె నావైపు వాలింది. "ఇప్పుడుమాత్రం బాగా లేవా యేమిటి?" అంటూ ఆమెని దగ్గరకు లాక్కున్నాను.

౪

మర్నాడు — అంటే దీపావళినాడు చీకటితోనే లేచి భూషణంగారింటికి వెళ్లాను.

"తమాషా జరిగిపోయిందోయి భూషణం! రాత్రి!"

"ఇంటికి వచ్చి చూసుకున్నాక తెలిసింది నాకున్నూ. పోనీ! దానికేం లే! మా ఆవిడ కోరినవే ఆమెకి వచ్చాయి. నాకేమీ విచారం లేదు. మీ రే డిజపాయింటయి ఉండాలి."

"లే" దంటూ నవ్వుతూ నా సంగతంతా అతనికి చెప్పాను. అతను నాకు చాలా ఆప్తుడు. మరెవ్వరినోటా ఈ సంగతి వెయ్యడని నాకు గట్టి నమ్మకం కూడాను.

"సరే! మంచిపనే జరిగింది. ఇకనైనా బుద్ధి తెచ్చుకో! వాళ్ల మనస్సుని ఎప్పుడూ మనం కలతపెట్టకూడదు. ఒకవేళ మనం ఒకలాగ తలిచినా వాళ్లకోరికే నెగ్గిస్తాడనుకో భగవంతుడు!"

"వచ్చేనెల నీకు లెక్క సర్దుబాటు చేస్తాను, మన్నించు."

"దానికేం లేవోయ్. నీకు వీలయినప్పుడే యివ్వవచ్చు. నువ్వు మా కొక సేవింగ్సుబ్యాంకిలాంటివాడవు!"

"ఫ్రాకులు నీకు అనవసరంగదా! నా కిచ్చెయ్యి."

"అవి అప్పుడే మా టెనెంట్సు చిల్ డ్రనుకి ప్రజెంటు అయిపోయాయి. వాళ్లు పూర్ పీపుల్! అందుకోసమనే సాదావి రెండు ఫ్రాకులు తెమ్మని మా ఆవిడ మొదటే చెప్పింది."

"ఏం దర్జా నీది! ధర్మానికి ఇచ్చేవి కూడా అంత ఖరీదువి తెచ్చావు!"

"బాబూ! నువ్వు నా పార్సెలు తీసుకోపోవడం మంచి ఉపకారం చేసినట్టు! అదే నే నింటికి తెచ్చినట్టాయనా—నా దూబరతనానికి నాకు గట్టిగా బహుమానాలు అందివుండేవి! చచ్చినట్లు ఈవాళ మళ్లా షాపుకి-వాట్ని మార్చడానికి వెళ్లవలసీ వుండేది."

*　　*　　*

భూషణం నిర్బంధించినా వుండక, కాఫీ టిఫిన్లకి వేగంగా ఇంటికే చేరుకున్నాను. మా ఆవిడ నాకోసం కనిపెట్టుకుని కూచుంది.

అల్పాహారస్వీకరణం అయింది.

"మిమ్మల్ని నిర్బంధించి అన్నీ కొనిపించేనే గాని—రాత్రి నిద్దరలోకూడా ఇదే ఆలోచన—ఈనెల ఎవరెవరికి ఎలా సమాధానం చెప్పడమంటూనూ. ఇంటావిడ అద్దెకోసం రెండుసార్లు నావేపు చూసింది."

"నువ్వేమీ ఆలోచించ సక్కర్లేదు. మనం అందరికీ తగినట్లు సర్దుబాటు చెయ్యవచ్చు. నిన్నటిడబ్బులో పదిరూపాయిలే ఖర్చు పెట్టాను."

"మరి నిన్న తెచ్చినవి?"

"భూషణందగ్గిర పాతిక రూపాయలు చేబదులు తెచ్చాను, వీ లున్నప్పుడు ఇస్తానని!"

[ఒక ఆంగ్లకథను మనసులో ఉంచుకొని]

# యుద్ధవ్యయము - భారత ప్రభుత్వ సమస్యలు

= శ్రీ మోచర్ల కృష్ణమూర్తి =

రెండవ ప్రపంచసంగ్రామము ప్రారంభమై మూడు వత్సరములు దాటినవి. ప్రజాప్రతినిధులను సంప్రదించి వారి అంగీకారమును పుచ్చుకొనక పోయినను, రాజప్రతినిధి ప్రకటన మూలముగా బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశమును సాంగ్రామిక దేశములలో నొకటిగా జేర్చిరి. అప్పటినుండియు భారత ప్రభుత్వము యుద్ధనిర్వహణమున భాగస్వామియై పాల్గొనుచున్నది. అందుచే, తమ కిష్టమున్నను లేకున్నను గూడ, ప్రజలు యుద్ధ భారమును వహించక తప్పుట లేదు. ఇట్టి పరిస్థితులలో, భారతీయులు యుద్ధ నిర్వహణమునకుగాను తామిప్పుడు భరించుచున్న వ్యయ భారములను గురించియు, వాని ఫలితములను గురించియు ఇంచుక పరిశీలించుకొనుట అనవసరము గాదు.

ఈ దేశమున సైనికశాఖ కేంద్రప్రభుత్వమునకు సంబంధించినది. దేశరక్షణబాధ్యతగూడ వారిదే. అందుచే కేంద్రప్రభుత్వము వెచ్చించుచున్న మొత్తములను లెక్కగట్టినచో యుద్ధవ్యయముల పరిమాణము దెలియవచ్చునని తలంపవచ్చును. కాని అది పొరబాటు. ఆధునిక సంగ్రామములలో కేవలము సైనిక వ్యయముతే గాక యుద్ధమునకు సంబంధించిన ఖర్చులనేకముండును. అందు ముఖ్యముగ, విమాన దాడులవలనను, ఇతర శత్రుచర్యలవలనను గల్గు ప్రమాదముల నివారణకు అవసరమగు సౌకర్యముల నేర్పరచుటకు రాష్ట్రీయ ప్రభుత్వములు వెచ్చించుచున్న మొత్తములను ముఖ్యముగ గమనింపవలసి యున్నది. సంగ్రామమునకు పూర్వముకంటె ఇపుడు రాష్ట్రీయ ప్రభుత్వముల వ్యయములును, చాల హెచ్చినవి. యుద్ధారంభమునకు వెనుకటిదగు 1938-39 సంవత్సరమున రాష్ట్రీయప్రభుత్వములన్నిటికిని కలిసి రూ. 84.74 కోట్ల ఆదాయమును, వ్యయము 85.76 కోట్లును గలదు. అనగా ఆవత్సరమున రూ. 1.(2 కోట్లు లోటు తేలినది. 1939-40 సంవత్సరమున రూ. 1.85 కోట్లు లోటుండునని అంచనా వేయబడెను. దానిని భర్తీ చేయుటకుగాను వివిధరాష్ట్రములలో క్రొత్తపన్నులు విధింపబడెను. వాని వలన సంవత్సరాంతమునకు అనుకొనిన లోటునకు బదులు రూ. 1.61 కోట్లు మిగులు తేలెను. ఆ మరు వత్సరమున రూ.2 30 కోట్లు నిలువ తేలెను. 1941-42 సంవత్సరమున మరికొన్ని రాష్ట్రములలో కొన్ని క్రొత్త పన్నులు విధింపబడెను. వీనివలన ఖర్చు పోను రూ. 42 లక్షల ఆదాయము నిలువ తేలునని అంచనా వేయబడెను లెను. కాని ఈ మూడు వత్సరములలోను రాష్ట్రీయ ప్రభుత్వముల ఆదాయము రూ. 105.65 కోట్లకును, వ్యయము రూ. 105.23 కోట్లకును హెచ్చెను. సంగ్రామపు పూర్వపు వ్యయముతో పోల్చినయెడల ఇది ఇంచుమించు 20 కోట్లు అధికము. ఈ వ్యత్యాసమంతయు సంగ్రామకార్యములకొరకు ప్రత్యక్షముగనో, పరోక్షముగనో రాష్ట్రీయ ప్రభుత్వములు వెచ్చించుచున్న మొత్తముగా పరిగణింపవచ్చును. 1938-39 సంవత్సరమున రూ. 85.76 కోట్లు వెచ్చించిన రాష్ట్రీయ ప్రభుత్వములు 1939-40 సంవత్సరమున రూ. 89.22 కోట్లును, 1940-41 సంవత్సరమున రూ. 95.18 కోట్లును, 1941-42 సం. న రూ. 105.23 కోట్లును వెచ్చించెను. 1942-43 సంవత్సరమున నీవ్యయము

రూ. 104.67 కోట్లుగా నుండునని అంచనావేయబడెను. దీనిని బట్టి ఈనాల్గు వత్సరములలోను రాష్ట్రీయ ప్రభుత్వములు రూ. 53.66 కోట్లకు తక్కువగాకుండ యుద్ధకార్యములకు సొమ్మును వెచ్చించెనని తెలియవచ్చును.

1939-40 సంవత్సరమున కేంద్రప్రభుత్వమునకు రూ. 82.65 కోట్లు వ్యయమును, రూ. 82.15 కోట్లు ఆదాయమును ఉండునని కేంద్రప్రభుత్వ ఆర్థికసభ్యుడు అంచనా వేసెను. కాని అప్పటి కిట్టిసంగ్రామము సంభవించునని యెవరును తలచియుండలేదు. ఈ వ్యయము 1942-43 సంవత్సరమున రూ. 187.07 కోట్లకు హెచ్చునని గత మార్చి మాసమున ఆర్థికసభ్యుడు అంచనా వేసెను. అనగా ఈమూడు వత్సరములలో కేంద్రప్రభుత్వపు వ్యయము రూ. 105 కోట్లు హెచ్చినది. దానికంతకును సంగ్రామమే కారణమని వేరుగా చెప్పనక్కరలేదు. విపరీతమగు నీ క్రొత్తఖర్చులను ప్రభుత్వమువా రెటుల చెల్లించుచున్నారు, దానివలన దేశీయార్థికస్థితియం దెట్టి మార్పులు గల్గుచున్నవి అను విషయములను దెలియవలసియున్నది.

ఇక కేంద్ర ప్రభుత్వమున గూడ, పరోక్షమగు యుద్ధ కార్యములచే ప్రతిశాఖయందునుకూడ క్రొత్తఖర్చులు పెట్టవలసి వచ్చుచున్నది అయినను ప్రత్యేకముగా సైనికశాఖకొరకును, యుద్ధకార్యముల కేర్పడిన సివిల్ డిఫెన్సు మొదలగు ఇతర శాఖలకొరకును వెచ్చించుచున్నది మాత్రమే ప్రత్యక్షమగు సంగ్రామ వ్యయములుగా పరిగణింపవచ్చును. సంగ్రామారంభమునకు పూర్వము భారతదేశరక్షణ సన్నాహములను గురించి విచారణ చేయుటకు బ్రిటిషు ప్రభుత్వముచే నియమింపబడిన కమిటీవారు ఈ దేశరక్షణ విషయమున బ్రిటనుయొక్కయు ఇండియా ప్రభుత్వముయొక్కయు బాధ్యతలను వేర్వేరుగ నిర్ణయించి సాధారణముగా భారతదేశము సైనికకార్యముల కొరకు రూ. 36.77 కోట్లు వెచ్చించుచుండవలెనని నిర్ణయించిరి. అంతకంటె అదనముగా వెచ్చింపవలసిన కొన్ని సందర్భములకు బ్రిటిషుప్రభుత్వమునుండి విరాళముల నేర్పాటుచేసిరి. యుద్ధము 1939 సం.ననే ప్రారంభమైనను, 1939-40 సం.న భారతప్రభుత్వపు సైనికశాఖ వ్యయమునం దెక్కువమార్పు గలుగలేదు. 1940-41 సం.న భారతప్రభుత్వము భరించవలసివచ్చిన సైనికవ్యయము రూ. 73.61 కోట్లకు పెరిగినది. 1941-42 సంవత్సరమున నీ వ్యయము 102.45 కోట్లకు హెచ్చెను. 1942-43 సంవత్సరమున నీ మొత్తము 133 కోట్లవరకును హెచ్చును. అనగా నీ మూడు వత్సరములలోను భారతప్రభుత్వము ప్రత్యక్షముగ యుద్ధకార్యములకు రూ. 348 కోట్లు వెచ్చించెను. అందు సాలీనా సాధారణ వ్యయముగా పరిగణింపబడిన మొత్తమును (రూ. 36.77 కోట్లు × 3 = 110.31 కోట్లు) తగ్గించినచో ఈ సంగ్రామముకొరకు అదనముగా రూ. 238 కోట్లు వెచ్చించినదన్నమాట.

ఇది భారతప్రభుత్వము స్వంత సంగ్రామ సన్నాహముల కంతకును ఖర్చుపెట్టుచున్న మొత్తమని యెవరును తలంపరాదు. ఇదిగాక ఇంకను చాల ధనమును చెల్లించుచున్నది. 1941-42సంవత్సరమున భారతప్రభుత్వము సంగ్రామమునకు పెట్టినపూర్తి ఖర్చు సుమారు 300 కోట్లు. అందు సుమారు రూ. 200 కోట్ల వరకును బ్రిటిషు ప్రభుత్వము తనకు సంబంధించిన వ్యయముగా నంగీకరించి ముజరా యొసగినది. మిగిలినదే భారతదేశమునకైన నికరపుఖర్చు. అటులనే 1942-43 సంవత్సరమున ముందుగా రూ. 533 కోట్లవరకును ఖర్చుపెట్టవలసియుండునని అంచనావేయబడెను. దానిలో సుమారు 400 కోట్లవరకును బ్రిటిషు ప్రభుత్వమునుండి ముజరా రావలసియుండును. ఇదిగాక మిగిలిన 133 కోట్లుమాత్రమే భారతప్రభుత్వపు బడ్జెటులో సైనికశాఖావ్యయముగా చూపించబడెను.

బ్రిటనుకొరకు ఈవిధముగా వెచ్చించు మొత్తములు తిరిగివచ్చును గనుక వానికి మనమంతగ దిగులుపడ నక్కరలేదు. అదిగాక ఇంకను విపరీతముగా హెచ్చిపోయిన సైనికవ్యయములను భారతదేశమున కంటగట్టుట ఎంతవరకు న్యాయమనునదియే ప్రశ్న. 1938 సంవత్సరమున ఆంగ్ల-భారతదేశముల సైనికసంబంధములను విచారణజేసి, ఇండియాయందలి సైనిక వ్యయములను ఎవరెంత వహింపవలెనో నిర్ణయించుటకు నియమింపబడిన సంఘమువారు,

ఈ దేశమున ప్రజాశాంతి రక్షణయును, శత్రుదండయాత్రలు సంభవించినపుడు స్థానికరక్షణయును మాత్రమే ఇండియా ప్రభుత్వపు బాధ్యతయనియు అంతకంటె బలవత్తరమగు దేశముల నుండి దండయాత్ర సంభవించినపుడు దానిని నివారించుట బ్రిటను యొక్క బాధ్యతయనియు నిర్ణయించిరి. ఆ సిద్ధాంతమును పురస్కరించుకొనియే, భారతదేశము సాలీనా 36.77 కోట్లు దేశరక్షణకు సైనికశాఖపై వెచ్చింపవలసియుండునని ఆంగ్ల-భారత ప్రభుత్వ ప్రతినిధులు ఉభయులును అంగీకరించియుండిరి. ఆ మొత్తము - వస్తువుల ధరల విలువయందును, వేతనాధికములయందును గలుగు మార్పులనుబట్టి తప్ప - ఇపుడు హెచ్చించుట కెట్టికారణమును గనుపింపదు. ఇది ప్రపంచమున ప్రాముఖ్యతను సంపాదించుకొనుటకు బ్రిటను అమెరికా, జర్మనీ ఇటలీ జపానులకు జరుగుచున్న సంగ్రామము. అంతియగాని భారతదేశమును గురించి సంభవించినది గాదు. సంగ్రామము ఇపుడు భారతసరిహద్దులను సమీపించినమాటనిజమే. అంతమాత్రమున నది భారత దేశమునకు సంబంధించినదిగా మారలేదు. బ్రిటనుతో పోరాడుటకు శత్రువులీ దేశముపైకి వచ్చెదరుగాని, భారతదేశముతో తమకుగల శత్రుత్వమువలన గాదు. అందుచే, ఈసంగ్రామము భారతదేశమునకు వ్యాపించి ఇది యుద్ధరంగమైననుగూడ, దానిని "స్థానికరక్షణ"గ పరిగణించుటగాని, అందు కగు వ్యయమును భారతదేశము చెల్లింపవలెననుటగాని న్యాయముగాదు. సాధారణముగా భారతప్రభుత్వము సైనికకార్యములకు వెచ్చించు మొత్తము తప్ప మిగిలిన వ్యయము నంతను బ్రిటిషుదేశమే వహించుట న్యాయము. అటులగాక బ్రిటిషుప్రభుత్వము యుద్ధవ్యయమునగూడ మరికొన్ని కోట్లు భారతదేశముపై విధించుటయు, ఈ దేశమునందలి అధికారవర్గమంగుకు అంగీకరించి చెల్లించుచుండుటయు గూడ ఆక్షేపించవలసియున్నది. సంగ్రామమున విజయమందిన యనంతరము పొందు లాభము లన్నియు బ్రిటనుకే లభించునుగాని భారతదేశమునకు గాదు. ఆ విధముగా జూచినను, అదనపు యుద్ధవ్యయభారమును వహించవలసిన నైతికమగు బాధ్యత బ్రిటనుకే నున్నది గాని భారతదేశమునకు లేదు.

ఇక కేంద్రప్రభుత్వమీ అదనపువ్యయము నేవిధముగా చెల్లించుచున్నదను విషయ మాలోచింపదగియున్నది. దీనిలో కొంతభాగమును (1) ఇతరశాఖల వ్యయములను తగ్గించుటవలనను, (2) కొత్తపన్నులవలనను ఇదివరకు గల పన్నులవలని ఆదాయము హెచ్చుటవలనను సర్దుబాటు చేయబడెను. రైల్వేలు, తంతి తపాలాశాఖల ఆదాయము హెచ్చుటవలన మరికొంతభాగము సర్దుకొనినది. రైల్వే తపాలాల ఆదాయములు హెచ్చుటకు వానిరేటులు హెచ్చింపబడుట గూడ చాలవరకు కారణము. ఇదిగూడ ప్రజలపై పన్నులవంటివే. అందుచే వీనివలన వచ్చిన అదనపు ఆదాయమును గూడ పన్నులవలని ఆదాయముగానే పరిగణింపవచ్చును.

క్రొత్తపన్నులలో అధికలాభములపై (ఎక్సెస్ ప్రాఫిట్సు) విధింపబడిన సుంకము మొదట పేర్కొనవలసియున్నది. సాధారణ లాభములకంటె యుద్ధపరిస్థితుల నవకాశముగా గొని సంపాదింపబడు లాభములలో నూటికి 50 వంతులు సుంకముగా చెల్లింపవలెనని మొదటిసారి 1940-41 సంవత్సరమున విధింపబడెను. (2) దేశమునం దుత్పత్తి చేయబడు చక్కెరపై పన్ను హం. వె. కు రూ. 2నుండి రూ. 3 లకును (దిగుమతులపై పన్ను గూడ ఇదేరీతిని హెచ్చింపబడెను), (3) పెట్రోలు విక్రయముపై పన్ను గాలను 1 కి 10 అణాలనుండి 12 అణాలకును హెచ్చింపబడెను. అయినను ఆవత్సరమున ఇంకను రూ. 6.58 కోట్లు లోటు తేలెను. ఇతర కార్యముల కుద్దేశింపబడిన మొత్తములను కొన్నిటి నుపయోగించుటవలన ఈలోటు 1940-41 సంవత్సరాంతమునకు 53 లక్షలకు తగ్గెను. 1941 సం. న 20.46 కోట్లు లోటు తేలునని అంచనా వేయబడెను. అందులో కొంత ఈ క్రిందిపన్నులవలన భర్తీ చేయుటకు ప్రభుత్వమువారు నిశ్చయించుకొనిరి. 1. అధికలాభముల పన్నును నూటికి 50 వంతులనుండి 66 $\frac{2}{3}$ వంతులకు హెచ్చించుట (2) ఆదాయపు పన్ను సూపరుటాక్సులపై సర్ చార్జీలను నూటికి 25 వంతులనుండి 33 1/3 వంతులకు హెచ్చించుట, (3) అగ్గిపెట్టెలపై పన్నును రెట్టింపుచేయుట (4) పట్టు,

మాయపట్టునూలుపై పన్నును పౌ 1 కి 3 అణాల నుండి 5 అణాలకు హెచ్చించుట (5) రబ్బరు టైరులపై విలువ బట్టి నూటికి 10 చొ॥ సుంకము. ఈపన్నులవలన రూ. 6.61 కోట్లు ఆదాయము వచ్చునని తలచిరి. మిగిలిన లోటును భర్తీ చేయుటకు ఋణము గావించుకొనుటకు నిశ్చయించిరి. క్రొత్త ఋణముల అవసరమును తొలగించుకొనుటకు ప్రత్యేకింపబడు రూ. 3 కోట్లను గూడ ఉపయోగించుచు వెడల ఇంకను రూ. 14 27 కోట్లు లోటు తేలును. 1942-43 సంవత్సరమున ఆదాయము రూ. 140 కోట్లు, వ్యయము రూ. 187.07 కోట్లు ఉండునని అంచనావేయబడెను, అనగా 47.07 కోట్లు లోటు. దీనిలో రూ. 35 07 కోట్లు క్రొత్తఋణమువలనను, రూ. 12 కోట్లు ఈక్రింది క్రొత్త పన్నులవలనను సంపాదించుకొనుటకు నిశ్చయించిరి. 1. ఆదాయపు పన్నును హెచ్చించుట. 2. కార్పొరేషను పన్నును హెచ్చించుట. 3. కొన్ని దినుసులపై సుంకములను, 4. టెలిఫోను తపాలా రేటులను హెచ్చించుట. వీనివలని ఆదాయ 1942-43 అంచనాల ప్రకారము 32.07 కోట్లు లోటు తేలవలసియున్నది. కాని, అమెరికా ప్రభుత్వ మిటీవల భారతదేశమునకు అరువు-కవులుపద్ధతిని సరకులనంపుట కంగీకరించినది. ఆ పద్ధతిక్రింద ప్రభుత్వము వారు సైనికశాఖ కవసరమగు వస్తువులనుకొనుచో, ఈ లోటుగూడ సర్దుకొనిపోవచ్చును. అప్పుడు 1941-42 సంవత్సరాంతమునకు తేలిన 14 కోట్ల లోటును భర్తీచేయుటకు గావించినది తప్ప, యుద్ధకార్యములకు ప్రత్యేకముగా గావింపబడిన ఋణముండదు.

యుద్ధవ్యయమునంతను పన్నులరూపమున నేటి ప్రజలనుండియే రాబట్టి, భావితరములవారిపై నీభారము పడకుండచేయుట ఇదివరకు మంచిసూత్రముగనే పరిగణింపబడు చుండెడి దనుటకు సందియము లేదు. ప్రాతకాలపు యుద్ధములయం దట్టి పద్ధతి అనుసరింపబడుచుండెడిది. కాని అధునిక యుద్ధములయందు - అందు ముఖ్యముగా గత మహాసంగ్రామమునుండియు—నాగరక దేశము లాపద్ధతిని వదలి యుద్ధపుఖర్చులలో అధిక భాగమునకు ఋణములు చేయు పద్ధతినుసరించుచున్నవి.

గత మహాసంగ్రామమున జపాను మాత్రము యుద్ధకార్యములకైన వ్యయమునంతను పన్నులరూపమునసే సంపాదించినది. కాని మరే దేశము నటుల చేయలేదు. అమెరికాసంయుక్తరాష్ట్రములు తమకైన ఖర్చులందు నూటికి 50 వంతులు, బ్రిటను 69 వంతులు ఋణమును గావించినవి. 1914 సంవత్సరమున బ్రిటనుకు పౌ॥ 65 కోట్లు ఋణ ముండెను. 1920 సంవత్సరమున కది 783 కోట్లకు హెచ్చెను. ఫ్రాన్సు, సంగ్రామవ్యయములో 83 వంతులు, ఇటలీ 72, రష్యా 95, బెల్జియం 97 వంతులు ఋణములుగావించినవి. శత్రుపక్షమునందలి జర్మనీ నూటికి 90, ఆస్ట్రియా 87 వంతులు స్వదేశములయందే ఋణము లొనర్చి వెచ్చించెను. ఈ ఋణములలో కొన్ని స్వదేశములందు గావింపబడెను. మరికొన్ని విదేశములయందు గావింపబడెను. మొత్తముమీద మిత్రదేశములు యుద్ధపుఖర్చులలో నూటికి 69 వంతులు స్వదేశములందునను, 10 వంతులు ఇతర మిత్రరాజ్యములనుండియు, 1 వంతు తటస్థరాష్ట్రములనుండియు ఋణముచేసినవి. మిగిలిన 20 వంతులను మాత్రమె ప్రజలపై పన్నులవలన రాబట్టబడెను. జర్మనీపక్షదేశములు నూటికి 90 వంతులు ఋణముగావించినవి. మిగిలిన 10 వంతులు దేశమునందలి ప్రజలపై పన్నులరూపమున సేకరింపబడెను.

అటులగానిచో నేటి యుద్ధముల కగు వ్యయమునంతను పన్నుల రూపముననే సంపాదింపవలెనని రెండల సాధ్యముగాదు. ఉదాహరణకు గత మహాసంగ్రామమునే చూడుము. దానికైన వ్యయములను పూర్తిగా నెవరును లెక్కకట్టగలుగలేదు. అనేకు లనేక విధములుగా అంచనాలనువేసిరి. అందు, న్యూయార్కునందలి బ్యాంకర్సు ట్రస్టువారు 1924 సం.న లెక్కలు కట్టగా, ఆ యుద్ధమునకు గాను మిత్రరాజ్యములు పౌ. 4036 కోట్లును, శత్రురాజ్యములు పౌ. 1512 కోట్లును వెచ్చించినటుల గన్పించెను. నేటి మహాసంగ్రామమునకగు ఖర్చు అంతకంటె చాల రెట్లుండును ఈ యుద్ధములందు ఉపయోగింపబడు అయుధసామగ్రియు, మందుగుండును, యంత్రపరికరమును గూడ వెనుకటిసంగ్రామముకంటె అనేకరెట్లు అధికముగా నున్నవి.' అదిగాక

ఉభయపక్షదేశములయందును ప్రజల ఆస్తులకు గల్గు నష్టము యుద్ధవ్యయములకంటె కొన్నిరెట్లధికముగా నుండవచ్చును. ఒక్క బ్రిటిషుప్రభుత్వమే ఇపుడు యుద్ధకార్యములకొరకు రోజు 1 కి పౌ. 120 లక్షలకు పైగా వెచ్చించుచున్నది. మొత్తము వ్యయములో నాల్గవవంతుకంటె, బ్రిటిషు ప్రభుత్వము పన్నుల ఆదాయమునుండి వెచ్చించుటలేదు. మిగిలిన మొత్తమంతయు స్వదేశమునందును అమెరికానుండి 'అరువుకవులు' పద్ధతియందు ఋణమొనర్చియును భరించుచున్నది. ఇతర దేశము లన్నియు నీ విధముగా ఋణముల ఆదాయముతో యుద్ధపు ఖర్చులయం దధికభాగమును చెల్లించుచుండ, భారతప్రభుత్వము మాత్రము ప్రజలపై అదనపు పన్నులనే ఆధారముగా నిడుకొనుట ఉచితము గాదు. సంగ్రామానంతరము బ్రిటను అమెరికాలును, ఇతర మిత్రరాజ్యములును పరస్పరము లెఖ్ఖల జూచుకొని పరిష్కరించుకొనునపుడు, ఋణభారము నధికముగా గనుపరుప గల్గిన ఇతర దేశములు ఎక్కువ అనుకూలములను సంపాదించుకొనగల్గుట ఆశ్చర్యము లేదు.

అంతియగాక, క్రొత్తపన్నులను విధించు విషయము నాలోచించునపుడు, ప్రజల ఆర్థికస్థితినిగూడ గమనింపవలసియున్నది. భారతదేశ మిపుడిపుడే, పది సంవత్సరములక్రిందట ప్రారంభమైన ఆర్థికమాంద్యపు ఫలితములనుండి కోలుకొనుచున్నది. ఇదివరకే ప్రపంచములోకెల్ల అధికతరమగు పన్నుల భారమును వహించుచున్న ఈ దేశమునందలి ప్రజలు అదనపు పన్నుల భారమును వహింప గల్గుట దుస్సాధ్యము. అందును, విదేశములకు ఎగుమతులు తగ్గిపోవుటచేతను, దేశమునం దెక్కువ పరిశ్రమలు లేకపోవుటచేతను ప్రజల నిజమగు ఆదాయము తగ్గినది. ఉదాహరణకు వేరుశనగ, ప్రత్తి మొదలగు పైరులను సాగుచేయు రైతులను దీసుకొనుడు. ఎగుమతులు పోవుటచే నీరైతులు తమ సాగుబడిని చాలవరకు తగ్గించుకొనవలసి వచ్చెను. ఉన్న సరకునకైనను వెనుకటితో పోల్చిన యెడల ఎక్కువ ధరలు వచ్చుట లేదు.

కనుక ఇట్టిస్థితిలో, యుద్ధమువలన ప్రజల ఆదాయము అధికమైనదని నిరూపింప గల్గిన వ్యక్తుల సందర్భములయందు తప్ప క్రొత్తపన్నులను విధించుట సరిగాదు. భారతప్రభుత్వమువారు గత మూడువత్సరములలోను విధించిన పన్నులలో, సాధారణమగు వానికంటె అధికమగు లాభములపై విధించిన పన్నుతప్ప, మరేదియు నీ సిద్ధాంతముప్రకారము సమర్థనీయముగాదు. గత మహాసంగ్రామమున, బ్రిటిషు ప్రభుత్వమువారు అధికలాభముల నంతనుగూడ ప్రభుత్వమునకు పన్నురూపమున చెల్లింపవలెనని విధించిరి. ఈసారిగూడ యుద్ధారంభమునుండియు మరల నీపన్నును అమలులోనికి దెచ్చిరి. భారతప్రభుత్వము, అధికలాభములలో నూటికి 50 వంతులనుమాత్రమే 1940-41 సంవత్సరమున పన్నుగా విధించిరి. మరువత్సరమున 66 2/3 వంతులకు హెచ్చించిరి. ప్రభుత్వమువారు విధించిన ఇతర పన్నులలో ఆదాయపుపన్ను, సూపర్ టాక్సుల హెచ్చింపులును, సర్ చార్జీలును ధనికులు చెల్లించుకొనవలసినవి. కాని పంచదార, అగ్గిపెట్టెలు మొదలగువానిపై విధింపబడిన సుంకములును, తపాలారేటులు, రైల్వేరేటుల హెచ్చింపులును, పన్నుల నేమాత్రమును భరింపజాలని పేదలుగూడ చెల్లించుకొనవలసియుండును. అందుచే నవి చాల ఆక్షేపణీయము.

ఇండియా ప్రభుత్వపు ఆర్థికసభ్యుడగు సర్. జె. రెయిస్మన్ గారు ఇటీవల, ఆంగ్ల — భారత దేశముల ఆర్థిక సంబంధములగురించి బ్రిటిషు ప్రభుత్వముతో సంప్రదించుటకు గాను ఆంగ్లదేశమునకు వెళ్లియుండిరి. వారచటనే యే విషయముల గురించి చర్చించిరో ఇంతవరకును వెల్లడించి యుండలేదు. కాని అచట చర్చింపబడిన విషయములలో సైనిక వ్యయ విభజన సమస్యయే ముఖ్యమైనదనిన రెయిస్మన్ గారు కాదనలేరు. ఈ సందర్భమున బ్రిటిషు ప్రభుత్వము భారతదేశమిప్పటికంటె యుద్ధపుఖర్చుల యందింకను హెచ్చుభాగమును వహింపవలెనని గోరియుండునని తలంచుట తప్పుగాదు. యుద్ధరంగము భారతదేశమును సమీపించినది గనుక, ఇచట జరుగు పోరాటములు భారతదేశమునకు సంబంధించినవే ననియు దీనిని "స్థానిక రక్షణ" గనే పరిగణించి, అందుకగు వ్యయములలో చాలభాగము భారతదేశమే

వహింపవలెనని బ్రిటిషు ప్రభుత్వము కోరవచ్చును. ఈ యుద్ధము లిపుడెచ్చట జరిగినను, ఇది బ్రిటను — అమెరికాలకును అక్షరాజ్యములకును ఆధిపత్యము కొరకేర్పడిన సంగ్రామమను విషయము మరువకూడదు. దాని స్వభావమునందెట్టి మార్పును గలుగలేదు. కనుక, వెనుక విచారణ సంఘమువారు నిర్ణయించిన మొత్తముకంటె సైనికవ్యయము నందెక్కువభాగమును భారత దేశము వహింప నక్కరలేదు.

భారతప్రభుత్వపు సైనిక వ్యయమును గురించి పైన వివరించియుంటిని. అదిగాక, బ్రిటనుతరపున గూడ ఇండియా ప్రభుత్వ మీ దేశమున కొన్ని ఖర్చులను చెల్లింపవలసివచ్చుచున్నది. ప్రస్తుత మీ దేశమున పలురకములగు ఆయుధసామగ్రులను తయారుచేసి, మధ్యప్రాచ్యరంగములకును, దూరప్రాచ్యరంగములకును పంపుచున్నారు. దానికితోడు ఆసియారంగముల కుద్దేశింపబడిన బ్రిటిషుసైన్యము లనేక మీ దేశమునకు వచ్చియున్నవి. వీనికగు ఖర్చులను గూడ ఇండియా ప్రభుత్వమే ఇపుడు చెల్లించుచున్నది. ఆవిషయముగా 1941-42 సం.న చెల్లింపబడిన మొత్తము రూ 200 కోట్లు. 1942-43 వత్సరమున నది రూ. 400 కోట్లకంటె హెచ్చునని అంచనా వేయబడెను. ఈవిధముగు వ్యయము మొత్తములు పోనుపోను ఇంకను అధికమగుచుండును. వీనికిగాను బ్రిటిషుప్రభుత్వము చెల్లించిన సొమ్మును ఇండియా దేశమునకు మార్చుటయం దవలంబింపబడుచున్న పద్ధతులచే, మరికొన్ని క్రొత్తసమస్య లేర్పడుచున్నవి. ప్రభుత్వమువారీ సందర్భమున, బ్రిటను ఇవ్వదేలిన మొత్తములో కొంతభాగమును వెచ్చించి, భారతప్రభుత్వమునకు, ఆంగ్ల దేశమునకు గల ఋణములలో రూ. 122 కోట్లు తీర్చిరి. దానికి బదులు ఇండియాలో మరల ఋణముగావించిరి. దీనివలన, బ్రిటనునందు ఇండియా ప్రభుత్వము తీర్చవలసిన ఋణము ఇండియాకు మారుటతప్ప, భారతదేశమునకు గల్గినలాభ మెద్దియును లేదు. బ్రిటిషుప్రభుత్వమునుండి ఇంకను రావలసియున్న మొత్తమును వెచ్చించి, బ్రిటిషుప్రభుత్వపు ఋణపత్రములను కొనుచున్నారు. వానిని ఆధారముగా నిడుకొని, ఈదేశమున ప్రభుత్వమువారు క్రొత్తగా నాణెములను, నోట్లను ముద్రించి ఇచటి ప్రజలకు చెల్లించుచున్నారు. ఈపద్ధతివలన, ఈదేశమునందు వ్యాప్తియందున్న 'చలామణి' గత మూడు వత్సరములలోనూ రూ. 179 కోట్ల నుండి రూ. 503 కోట్లకు హెచ్చెను. ఇండియా పేరిట నిలువదేలిన బ్రిటిషుఋణపత్రముల నిలువ రూ. 317 కోట్లవరకు హెచ్చినది.

ఇండియాకు బ్రిటనునందు నిలువదేలిన మొత్తములతో ఋణముల తీర్చుటను, బ్రిటిషుఋణపత్రములను కొనుపద్ధతియు గూడ ఈదేశమున విమర్శలకు లోనగుచున్నది. ఇండియా ప్రస్తుత మీఋణమును తీర్చవలసిన అవసరము లేదు. దాని కింకను కొన్ని వత్సరముల వాయిదాయున్నది. ముందుగానే దానిని తీర్చుటకంటె, ఈమొత్తములను యంత్రసామగ్రినికొని దిగుమతిచేసుకొనియున్నచో ఇంతకంటె మెరుగుగా నుండెడిది. భారతదేశము పరిశ్రమలను పెంపొందించుకొనుటకు ఇదియే మంచి అదను. సంగ్రామానంతరము అమెరికా, బ్రిటను, జర్మనీ, జపాను మొదలగు దేశములన్నియు అసంఖ్యాకములగు తమ యంత్రశాలలలో వస్తువుల నుత్పత్తిచేసి, వానితో ఇండియావంటి దేశములను ముంచిరెత్తును. సంగ్రామానంతర మీదేశమున నెలకొల్పబడు పరిశ్రమలు రక్షణసుంకముల సహాయము లేకుండ, దిగుమతిసరకులతో పోటీచేయజాలవు. అట్టి రక్షణసుంకముల పద్ధతికి, విజయమందిన దేశములు అంగీకరించుట సందియము. ఇపుడా దేశములన్నియు యుద్ధమున నిమగ్నమైయున్నవి. ఈ దేశమున వస్తువులందుబాటులేక చిక్కుపడుచున్నారు. అందుచే, ఇపుడు పరిశ్రమలను నెలకొల్పుకొనినయెడల, విదేశముల పోటీభయము లేకుండ నిలబడగలవు. సంగ్రామము ముగియునసరికివి, కొంతవరకు కాలూనిలద్రొక్కుకొనుటకు శక్తివంతము లగును. అందుచే, బ్రిటనునందలి నిలువధనమును భారతదేశము యంత్రసామగ్రిని కొని దిగుమతి చేసుకొనుటకంటె లాభకరమగువినియోగము మరియొకటుండదనుట నిర్వివాదము. దానితరువాత, ఈ దేశమునందలి రైల్వేలు, ఇతరపరిశ్రమలు మొదలగువానిపై బ్రిటిషు ధనస్వాములు గావించియున్న పెట్టుబడులను కొనివేయుట యుత్తమమైనపద్ధతి. అటుల చేయుచో, రైల్వేలును, పరిశ్రమలును పూర్తిగా భారతీయము లగును. అట్టి పద్ధతుల ననుసరింపక బ్రిటనునందలి ప్రభుత్వఋణములను తీర్చుట అన్నిటికంటెను హీనమైనది. సంగ్రామానంతరము అంతర్జాతీయ ఋణముల సమస్య యేటులనో చర్చకువచ్చును. యుద్ధమునకుగాను వేర్వేరు దేశము లిపుడు గావించుచున్న అపారమగు ఋణములు ఎన్నటికైనను తీర్చబడుట సందియము. గత మహాసంగ్రామమునకు గావింపబడిన ఋణములను తీర్చుటకు, నిరాకరించి,

బ్రిటను మొదలగు దేశము లిదివరకే ఒక మార్గము నేర్పరచినవి. ఈ సంగ్రామానంతరముగూడ అట్టి మార్గమునే యుద్ధదేశము లనుసరింపవని తలచుటకు కారణము గనుపింపదు. అట్టిసందర్భమున ఆంగ్లప్రభుత్వము, ఇండియా ప్రభుత్వము తనకు తీర్చవలసిన ఋణమునుగూర్చి ఎక్కువ పట్టుపట్టజాలదు. అందుచే నీ ఋణములను ఇప్పుడు దీర్చుట అంతవివేకము గాదు. దాని నిప్పుడు దీర్చకుండుటవలన గలుగునష్ట మేదియును లేదు.

ఆంగ్ల దేశమున ఇండియాకు నిలువ దేలిన మొత్తములతో స్టర్లింగు ఋణపత్రములను కొని వాని ఆధారముపై ఈ దేశమున చలామణిని హెచ్చుచేయుట మరింత ఆక్షేపణీయము. స్టర్లింగువిలువ ఎప్పుడే విధముగా నుండునో యెవరికిని దెలియదు. దానిని బ్రిటిషుప్రభుత్వము, పరిస్థితులనుబట్టి తన కనుకూలమగు విధముగా మార్చుకొనవచ్చును. బ్రిటిషుప్రభుత్వము వ్యాప్తియందున్న చలామణిని హెచ్చించి, స్టర్లింగుయొక్క విలువను తగ్గించుచో, మన దేశము చాల నష్టపడవలసివచ్చును. సంగ్రామానంతరము ఏర్పడు ఆర్థికచిక్కులయం దట్టిమార్పులు జరుగవని తలచుటకు వీలులేదు. బ్రిటిషుప్రభుత్వము అట్టిపద్ధతి ననుసరించునెడల, ఈ దేశమునందలి చలామణియొక్క విలువగూడ క్షీణించి, అనేకవిధములగు కష్టములు సంభవింపవచ్చును. ప్రస్తుత మీ మొత్తముతో బ్రిటిషుఋణపత్రములను కొనుటవలన, బ్రిటనుకు ఋణమొసగిసహాయ మొనర్చినటులైనది. మిత్రులకట్టిసహాయము గావించుట తప్పుగాకపోవచ్చును. కాని అట్టిసహాయ మొనర్చునపుడు భారతదేశమునందలి కరెన్సీ అనవసరమగు కష్టనష్టములకు గురికాకుండ జూచుటవసరము.

ఈ దేశమున వ్యాప్తియందున్న చలామణీ కొలది కాలములో ఆకస్మికముగ ఇంతగా హెచ్చిపోవుటవలన రూపాయి నాణెములకు విలువతగ్గుచున్నదనియు, ఇటీవల వస్తువుల వెలలు అధికమగుటకు ఇదియే కారణమనియు కొందరు తెలుపుచుండిరి. అందుచే వ్యాప్తియందున్న చలామణిని తగ్గించుట వసరమనియు, అప్పుడుగాని ధరలు తగ్గవనియు వీరివాదము. గత మూడు వత్సరములలో కొన్ని వస్తువుల ధరలు హెచ్చిన విషయము నిజమే. 1939 సం. ఆగస్టు మాసముతో పోల్చినయెడల 1942 మే మాసమున మదరాసునందలి టోకు ధరలు 100 నుండి 170 కి హెచ్చినవి. ప్రజల కుటుంబ ఖర్చుల ప్రమాణము 98 నుండి 140 కి హెచ్చినది.

అనవసరముగా హెచ్చుచలామణీ ప్రజలచేతులయం దుండుట మంచిదిగాదను విషయము నిజమే. యుద్ధసమయములందు పరిశ్రమలు చాలవరకు యుద్ధసామగ్రి నుత్పత్తి చేయుటయందు నిమగ్నమైయుండును గనుక, సాధారణముగా ప్రజ లుపయోగించుకొను సరకుల ఉత్పత్తితగ్గును. అందుబాటునందున్న సరకుల పరిమాణము తగ్గినకొలదియు అవి కావలసినవారు డబ్బును విలువచేయక పోటీపడి హెచ్చుసొమ్మొసగి కొనుటకు సిద్ధపడుచుందురు. వారివద్ద విరివిగా సొమ్ము ఉన్నయెడల, మరింత సొమ్మొసగుటకు వెనుదీయరు. దీనివలన ఇదివరకు ఒకరూపాయికి వచ్చువస్తువునకే ఇప్పుడు రెండురూపాయలుగూడ చెల్లించుచుందురు. ఈ విధముగా ధరలు హెచ్చిపోవుటచే సొమ్ముగలవారికి తమ సొమ్మునకు తగిన సరకు లభింపదు సరిగదా హెచ్చుధరలను చెల్లించుకొనలేని పేదలస్థితి దుర్భరమై సకలకష్టములను గుడువవలసివచ్చును. దీనివలన ప్రజలలో చాల అశాంతిగూడ ఏర్పడును. వ్యాప్తియందున్న చలామణి హెచ్చుటచే ధరలు పెరుగును. ధరలు పెరుగుచో వేతనములు పెరుగవలసియుండును. వేతనములు పెరిగిన, మరల ఎక్కువ చలామణి కావలసియుండును దానితో మరల ధరలు పెరుగును. ఈవిధముగ నీ విషచక్రమున కంతముండదు.

అందుచే, ఎక్కువసొమ్ముగలవారి వద్దనుండి కొంతభాగమును తొలగించుచో, పై విధమగు పోటీయుండదు, దానితోబాటు వస్తువులధరలుగూడ కొంతవరకు తగ్గును. ఈ విధముగా చలామణిలోనున్న నగదును తగ్గించుటకు రెండుమార్గములు కలవు 1. క్రొత్త పన్నులను విధించి, ప్రజల ఆదాయమున కొంత భాగమును ప్రభుత్వమునకు సంక్రమింపజేయుట, 2. ప్రజలనుండి ప్రభుత్వమువారు ఋణము జేసి, నగదును ప్రచారమునుండి తగ్గించుట. ఋణమునిచ్చినచో ఎప్పటికైనను తిరిగి వచ్చుననియు, ఈలోపున వడ్డీగూడ లభించుననియు ఆశతో, ప్రజలు, పన్నులను చెల్లించుటకంటె ఎక్కువ సంతోషముతో నీపద్ధతినంగీకరించెదరు. కాని పన్నులువిధించినను, నిర్బంధముగ ఋణముగ దీసుకొనినను గూడ, ప్రభుత్వము వారు—జీవితావశ్యకతల కవసరమగు కనీసపు ఆదాయము మాత్రమే గలవారిని మినహాయింపవలసియుండును. ఈపద్ధతివలన వస్తువులపోటీయును, ధరలును కొంతవరకుమాత్రమే తగ్గును గాని, ప్రజలందరకును వస్తువులు (1) న్యాయమగుధరలకు (2) వారివారి ఆవశ్యకతలను

అనుసరించి సరిసమానముగా లభింపజాలవు. ఆయుధ్యమును గూడ నిర్ణయింపవలె ననినచో ధరల నిర్ణయింపవలెను. దానికితోడు దేశమున లభ్యమగు వస్తువుల పరిమాణమును తెలిసికొని, దానిలో ప్రతివారికిని యెంతెంత యొసగవచ్చునో నిర్ణయించి, ఆవిధముగా పంచిపెట్టుపద్ధతిని అనుసరింపవలెను. అప్పుడే అన్నితరగతుల ప్రజలకు నుగూడ న్యాయము జరుగును.

భారతదేశమున నిపుడు వ్యాప్తియందున్న చలామణీవలన పైనుదాహరించిన (ఇన్‌ఫ్లేషనరీ) అనర్థములు సంభవించుచున్నవా యను విషయము నిక ఆలోచింపవలసి యున్నది. వెనుకటికంటె ఇపుడెక్కువ చలామణీ వ్యాప్తియందున్నంతమాత్రమున అనర్థముల నన్నిటిని దానికే ఆరోపించుటకు వీలులేదు. ఈసందర్భమున వ్యాప్తియందున్న చలామణీ — ప్రజలందరును కనీసపుసౌకర్యములతో జీవితములను గడపుటకు అవసరమగునంతగ నున్నదా, లేక అంతకంటె నెక్కువగనున్నదా యను విషయమునుగూడ గమనింపవలెను. ఏ కారణముచే నింత చలామణీ వ్యాప్తిలోనికి వచ్చినదో పరిశీలించినచో నీవిషయము దెలియుట సులభము. ప్రభుత్వమువారిపుడు లక్షల కొలది ప్రజలను సైన్యములో చేర్చుకొనుచున్నారు. వేలకొలది యువకులను నిపుణులను కార్మికులుగా తయారుచేసి ఆయుధకర్మాగారములలో పనిచేయించుచున్నారు. ఇతర విధములను ముడిపదార్థములను క్రొత్తగా ప్రజలనుండి కొనుచున్నారు. ఇది లేనిచో, ఈతరగతుల ప్రజలలో నూటికి 90 వంతులు పనిలేక అల్లాడుచు, కనీసమగు జీవితసౌకర్యములుగూడ లేకుండ కాలముగడుపుచుండెడివారు. ప్రజలలో అందరునుగూడ సామాన్యసౌఖ్యముగల జీవితములు గడుపుచున్నచో - 40 కోట్ల జనాభాగల భారతదేశమునకు - సంగ్రామమునకు పూర్వము వ్యాప్తియందున్న రూ. 179 కోట్లచలామణీ చాలదు. ఇపుడు వ్యాప్తియందున్న రూ. 503కోట్లకంటెను ఎక్కువచలామణీ అవసరమయ్యెడిది కనుక ఈవ్యాప్తినిగాంచి, చలామణిని ప్రజలనుండి తొలగింపవలసిన సమయము వచ్చినదని భావించుటకు వీలులేదు. ప్రజలందరకును గూడ కనీసజీవితసౌఖ్యముల నొసగుటకు (సంగ్రామపు పూర్వపు వస్తువుల ధరల ప్రకారమే) ఇంతకంటెను గూడ హెచ్చు చలామణిని దీసుకొనిరావలసియుండును.

ఈ సందర్భమున ఆంగ్ల దేశపుసామ్యమును [illegible] దేశమునకుగూడ వర్తింపజేయుటకు వీలులేదు. ఆ దేశమున ఇదివరకే ప్రజలందరకును వృత్తులు గలవు. వారి జీవితవ్యయప్రమాణమును బట్టి కనీసవేతనములందునట్లు ప్రభుత్వమువారిదివరకే చర్యగైకొనిరి. పనులు లేనివారెవరైన నున్నచో, ప్రభుత్వమువారే వారికి భృతి నొసగుచు, ప్రజలందరును కనీససౌఖ్యములకు లోటు లేకుండ జీవితమును గడపుటకు సౌకర్యములు కల్పించిరి. అందుచే, సంగ్రామమునకు పూర్వము వారిదేశమున వ్యాప్తియందున్న చలామణి వారికి చాలును. అంతకంటె, చలామణి విశేషము వ్యాప్తియందుండుచో, పైనుదాహరింపబడిన అనర్థములకు కారణమగునని భయపడవచ్చును. భారతదేశమున సంగ్రామారంభమునకు పూర్వము వ్యాప్తియందున్న చలామణి ప్రజావశ్యకతలకు నిజముగ చాలినంతగా లేదు. ఈభేదమును గుర్తింపనిచో చాల పొరబాటులకు లోనుగావలసివచ్చును.

కాని ఇంతమాత్రమున తమకు కావలసిన దానికంటె విపరీతముగ హెచ్చు ఆదాయములు లేనివారీదేశమున లేరని చెప్పుట గాదు. యుద్ధకార్యములకు ప్రభుత్వమువారిటీవల నియమించుచున్న వందలకొలది పెద్దయుద్యోగులలో దేశపు ఆర్థికస్థితినిబట్టి చూచుచో విపరీతమగు వేతనములుగలవారు పెక్కుమంది గలరు. వారామొత్తములను ఇతరసౌకర్యములకొరకు వెచ్చించునట్లుల చేయుచో, ఇంకను వృత్తులు లేకయున్న ప్రజలలో చాలమందికి వృత్తులు లభించి జీవనాధారము లేర్పడును. వారివద్ద అనవసరముగా కేంద్రీకరింపబడియున్న ధనమును, ప్రజలలో వ్యాపించునట్లుల చేయవలెను. ఇతరపరిశ్రమలను దేశమునందు ఉత్పత్తిని ప్రోత్సహించుటవలన నీలక్ష్యము సులభముగా సిద్ధించును. ప్రభుత్వమువారు ధనికులనుండి చలామణిని పన్నులరూపముననో, నిర్బంధ ఋణముల రూపముననో తామే తీసుకొని వ్యాప్తినుండి తొలగింపజూచుటకంటె, ఈ పద్ధతి దేశమున కెక్కువ శ్రేయస్కరము. భారతదేశమునకు స్వపరిపాలితమగు జాతీయప్రభుత్వమున్నచో ఈ పద్ధతినే అవలంబించెడిది. అటులగాక చలామణిని వ్యాప్తినుండి తొలగించవలెనని సంకల్పించుకొనినను తక్కువ ఆదాయములు గలవారిని పూర్తిగా మినహాయించి, వానివలన వచ్చిన ఆదాయమునం దధికభాగమును పరిశ్రమల పెంపొందించుకొనుటకు వినియోగించెడిది.

# భారతీయ చిత్రకళ



బుద్ధభగవానుడు



దీర్ఘాలోచన

చిత్రకారుడు : కుమారిలస్వామి

[త్రివర్ణచిత్రములకు ప్రతికృతులు]

కథ:

# తీర్పు

= శ్రీ ధనికొండ హనుమంతరావు =

( గతసంచిక తరువాయి )

## ౬

ఏతుకున్న గంటదాకా శర్మ మామూలుమనిషి అవనేలేదు. ఈరాత్రి తను చెప్పదలుచుకున్న దాంట్లో నూరోవంతుమాటల్నికూడా కల్యాణిదగ్గర చెప్పలేకపోయ్యాడు. తను ఇంతవరకూ ఆలోచించిన హేతువాద మంతా సమయానికి మరిచిపోయ్యాడు. ఆమె తనను— చిన్నపిల్లాడికి కాకమ్మకథ చెప్పి మరిపించినట్టు - ఇంకోలోకానికి లాక్కుపోయి తన శక్తులన్నింటినీ కట్టివేయగలిగింది! ఆమెలో ఉండే మాతృత్వమంతా తనను చిన్న కుఱ్ఱాడిగా చేసి ప్రయోగింపబడ్డది !

ఏవిధంగా తనకు ఓటమి సమకూరిందో మొదట్లో అతనికి అంతుపట్టలేదు.... కొంత ఆలోచన మీదట తేల్చుకున్నాడు — ఒణికే ఆమెకంఠం తనను అర్థించే దయా, జాలీ, ఆమె కన్నీటిసూపాన వదిలిన అస్త్రాలిలా తనను ఎందుకూ పనికిరానివాడినిగా చేసినయ్. కాదు— ఆమెను తను యీనాటికీ హృదయపూర్వకంగా ప్రేమిస్తూండబట్టే, ఆమెకు అంత తేలిగ్గా లొంగిపోగలిగాడు. అదే ఇంకో స్త్రీదగ్గరైతే తన విజ్ఞానమంతా పనిచేసితీరేది! తను మొండిగా చేసుకున్నా ననుకొని అపోహపడ్డ రక్తమాంసాలహృదయం తనకు విశ్వాసంగా పనిచెయ్యలేదు. బలహీనుడికి కన్నీరు కొత్తబలాన్ని ఇవ్వగలదు కాబోలు!

అతను మెల్లిగా కల్యాణి మాట్లాడిన ప్రతి మాటనూ నెమరువేసుకుంటూ, ఒక్కొక్కవిషయాన్నే తనలో తను విమర్శించుకోసాగాడు.

ఆమె హాయిగా బతుకుతూంటే, తనొచ్చి ఆమెసౌఖ్యాన్ని పాడుచేశాడట! ఇది తన క్రూరత్వాన్ని చూపటంకాదు; తనమీద ఆమెకున్న ప్రేమనే చాటుతోంది. ఇది నిజమే ఐతే తనకు ఎప్పటికైనా విజయం తప్పదు. కనపడని యీప్రేమపాశంతో కల్యాణిని— యీ అందాలరాశిని— సాంఘికంగా బలమైన స్థానాన్ని సంపాయించుకోగలిగిన యీకులీనురాల్ని, ఇంకోరి ఆస్తిలో భాగంగా పరిగణిస్తూన్న లోకాన్ని మోసపుచ్చి, దాని మొహంలో విజయసూచకంగా వికటంగా నవ్వినట్టు— ఎరను చూసి ఆశపడే చేపలాగు, విశ్వాసంతో యజమానికాళ్ల చుట్టూ తిరిగే పెంపుడుకుక్కలాగు — ఆమెను తనచుట్టూ తిప్పించుకో గలుగుతాడు !... ఇంకోవిషయంకూడా అతనికి చప్పున జ్ఞాపకం వచ్చింది. ఇది తను ఇన్నాళ్లూ గుర్తించని బ్రహ్మాస్త్రం! దీని ప్రయోగంతో ఆమె తన కాళ్లపైన పడగలదు! తనకు ఆమెను జయించటమే ముఖ్యోద్దేశంకనుక ఏవిధంగానైనా తను గెలవటమే తనకు కావాల్సింది !

కల్యాణి తనను పొమ్మన్నది. అందుకు తను సమాధానం ఇవ్వలేదు. ఒకవేళ తను ఒప్పుకొనివున్నా మించిపోయిం దేమీ లేదు. మానవులకు వాగ్దానాల్ని చెల్లించట మొక్కటే ఆదర్శమైతే అనేకజీవితాలే తలక్రిందులై ఉండేవి!...త నెందుకు వెళ్లిపోవాలి? పొట్టను చేత్తో పట్టుకొని లోకాన్ని గాలిస్తూన్న తనకు

ఇక్కడ జీవనోపాధి దొరికింది. ఈకాస్తా పాడుచెయ్యటంలో ఆమె ఉద్దేశ మేమిటి? తను ఐశ్వర్యవంతురాలనీ, తనకన్న తక్కువవాళ్లందరూ తనకై త్యాగం చేసేందుకు సిద్ధంగా ఉండాలనీ ఆమెఅభిప్రాయం కాబోలు!...కోపాన్ని క్షణక్షణానికీ అంతరాత్మసహాయంతో ప్రజ్వలింపచేసుకుంటూ — ఎరగా కల్యాణిని నిలబెట్టి శర్మ పరీక్షకు దిగాడు.

ఆమె ఎందుకు సౌఖ్యపడాలి? ఒకే సమస్యను ఎదుర్కొన్న ఇద్దరు వ్యక్తులు ఒకరు దక్షిణధ్రువానా, వేరొకరు ఉత్తరధ్రువానా తేలారు; ఒక్క సమస్యకు రెండేసి తలలు కాబోలు!...త నెందుకు బాధపడాలి? అసలు లోకంలో సౌఖ్యమనేది, తన కళ్లయెదుట, తనకు చిక్కకుండా ఇతర్లపా లెందుకవాలి? తను బాధపడుతున్నాడు — లోకమంతా బాధపడితే ఎంత బాగుండును! తను సౌఖ్యపడటంకన్న ముఖ్యమైనది ఆమె బాధపడటం! తనకు అందని ఫలం ఇతర్లు — ఎవరైతేనేం — అందుకోగలగటం మానవుడైన శర్మకు మొయ్యలేనంత భారంగా కనిపించింది...

ఇంకా ఆమెసౌఖ్యానికని తను త్యాగం చెయ్యాలట! శర్మ తనలో తను క్రూరంగా నవ్వుకున్నాడు. తను ఎవరికోసమై ఇంత జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాడు? తన కేం లాభం? తనకోసమే తను త్యాగంచేసుకోలేని శర్మ — ఆమెకు త్యాగం చెయ్యాలనే ఉద్దేశాన్ని ఎలా రానివ్వగలడు?...ఆమె కుటుంబాన్నంతట్నీ బాగుచేసుకుందట! కాని తన కుటుంబమంతా యీసరికి నాశనమై వుంటుంది. అంతతో పోక, తనను ఇంకా అధఃపాతాళానికి తొక్కాలని చూస్తోంది. ఎంత స్వార్థం!

ఆమెను చూసి తను నేర్చుకోవాల్సిన గుణపాఠం వొకటి అతనికి కనిపించింది. అది తన సౌఖ్యానికై, ఇతర్ల మీద జాలిపడకుండానే, గట్టిగా ప్రయత్నించటం! ఆమె తనను జీవితంలో అవసరాలకై ఎలా ఉపయోగించుకోవాలని కుటిలంగా ప్రయత్నించిందో, అలాగే తనూ ప్రయత్నించాలి. దుర్మార్గులను జయించాలంటే దుర్మార్గంకన్న బలమైన ఆయుధం ఉండబోదేమో?

ఇది ఎలాటి పరిణామానికి లాగినా, దీనిపైనే శర్మ తన జీవితభారాన్నంతట్నీ మోపుకొని తూచుకున్నాడు. తన రాణింపో, క్షీణింపో చివరిసారి జీవితంలో ఏకాకిగా పోట్లాడి తేల్చుకోదలిచాడు. తేల్చుకోకపోతే, తన ఆయువులో ఇక మిగిలిన కొద్దిరోజులూ కూడా వృథాయే!...తనకు అనుభవం వుంది; దేశదేశాల నీళ్లూ తన రక్తంలో ప్రవహిస్తూ, రకరకాల ఆలోచనల్ని ఇవ్వగలవు. తను చూసిన అనేకమంది ప్రవర్తనలు, తను మొట్టమొదటివాడై నష్టపడకుండా, చెయ్యబోయ్యే పనికి ఇదివరకే లాగిన ఫలితాలుకూడా తనకు అందుబాటులోనే ఉన్నయ్.

ఈవిధంగా అతను ముందు తనకు తను నచ్చచెప్పుకున్నాడు. తను చెయ్యబోయ్యే ప్రతిపనీకూడా మానవసహజమైందనీ, ప్రతిప్రాణీ విధిగా తన సౌఖ్యానికై పాకులాడటంలో తప్పు లేదనీ తన అంతరాత్మను తొక్కిపట్టుకున్నాడు. ఈసారికూడా తన శక్తులు తనను మోసంచెయ్యకుండా ఉండేందుకై — అనేకసార్లు పైవిషయాల్ని 'రిహార్స్' చేసుకున్నాడు. ఆమెతో మాట్లాడేప్పుడు ఉపయోగించాల్సిన కంఠధ్వనినికూడా జ్ఞాపకం పెట్టుకున్నాడు...ఈసారి తనకు తిరుగులేదు; ఏది తప్పిపోయినా తన బ్రహ్మాస్త్రం తప్పేందుకు వీల్లేదు!

తెల్లవారుజాము మూడుగంటలైనా కల్యాణి గదిలోని లైటింకా ఆర్పివేయబడకపోవటం శర్మను కాస్త ఆశ్చర్యపెట్టింది. త నిక్కడికి వచ్చినరోజునుంచీ యీవింతను చూస్తూనే ఉన్నాడు; కాని నిజమేమిటో అతని ఊహకు అందలేదు. తనలాగే ఆమెకూడా బాధపడుతోందా? మొదటినాటినుంచీ లోపల ఏం జరుగుతోందో తెలుసుకోవాలనే కుతూహలం అతనిలో నానాటికీ అధికమవుతూనేవచ్చింది. ఇక యీనాడు అది అతని స్వాధీనంకూడా తప్పింది.

మానవప్రపంచానికి ఇది గాఢతమనిద్రాసమయం; తనను ఇప్పుడు ఎవరు చూడబోయ్యారు? త నిలా భయపడుతూ, తనను తనే నిరుత్సాహపరచుకుంటూండటంమూలానే జీవితం తనపైన సవారీలు చెయ్యగలుగుతోంది. త నిక యీమానవుల్నీ, లోకాన్నీ భయపెట్టాల్సిన సమయం వచ్చింది. ఇందుకు మొట్టమొదటి

కథ:

# తీర్పు

= శ్రీ ధనికొండ హనుమంతరావు =

(గతసంచిక తరువాయి)

## ౬

పడుకున్న గంటదాకా శర్మ మామూలుమనిషి అవనేలేదు. ఈరాత్రి తను చెప్పదలుచుకున్న దాంట్లో నూరోవంతుమాటల్నికూడా కల్యాణిదగ్గర చెప్పలేకపోయ్యాడు. తను ఇంతవరకూ ఆలోచించిన హేతువాదమంతా సమయానికి మరిచిపోయ్యాడు. ఆమె తనను— చిన్నపిల్లాడికి కాకమ్మకథ చెప్పి మరిపించినట్టు – ఇంకోలోకానికి లాక్కుపోయి తన శక్తులన్నింటినీ కట్టివేయగలిగింది! ఆమెలో ఉండే మాతృత్వమంతా తనను చిన్న కుర్రాడిగా చేసి ప్రయోగింపబడ్డది!

ఏవిధంగా తనకు ఓటమి సమకూరిందో మొదట్లో అతనికి అంతుపట్టలేదు.... కొంత ఆలోచన మీదట తేల్చుకున్నాడు —— ఒణికే ఆమెకంఠం తనను అర్థించే దయా, జాలీ, ఆమె కన్నీటికూపాన వదిలిన అస్త్రాలూ తనను ఎందుకూ పనికిరానివాడినిగా చేసివయ్. కాదు— ఆమెను తను యీనాటికీ హృదయపూర్వకంగా ప్రేమిస్తూండబట్టే, ఆమెకు అంత తేలిగ్గా లొంగిపోగలిగాడు. అదే ఇంకో స్త్రీదగ్గరైతే తన విజ్ఞానమంతా పనిచేసితీరేది! తను మొండిగా చేసుకున్నా ననుకొని అపోహపడ్డ రక్తమాంసాలహృదయం తనకు విశ్వాసంగా పనిచెయ్యలేదు. బలహీనుడికి కన్నీరు కొత్తబలాన్ని ఇవ్వగలదు కాబోలు!

అతను మెల్లిగా కల్యాణి మాట్లాడిన ప్రతి మాటనూ నెమరువేసుకుంటూ, ఒక్కొక్కవిషయాన్నే తనలో తను విమర్శించుకోసాగాడు.

ఆమె హాయిగా బతుకుతూంటే, తనొచ్చి ఆమెసౌఖ్యాన్ని పాడుచేశాడట! ఇది తన క్రూరత్వాన్ని చూపటంకాదు; తనమీద ఆమెకున్న ప్రేమనే చాటుతోంది. ఇది నిజమే ఐతే తనకు ఎప్పటికైనా విజయం తప్పదు. కనపడని యీప్రేమపాశంతో కల్యాణిని— యీ అందాలరాశిని— సాంఘికంగా బలమైన స్థానాన్ని సంపాయించుకోగలిగిన యీకులీనురాల్ని, ఇంకోరి ఆస్తిలో భాగంగా పరిగణిస్తూన్న లోకాన్ని మోసపుచ్చి, దాని మొహంలో విజయసూచకంగా వికటంగా నవ్వినట్టు— ఎరను చూసి ఆశపడే చేపలాగు, విశ్వాసంతో యజమానికాళ్ల చుట్టూ తిరిగే పెంపుడుకుక్కలాగు —— ఆమెను తనచుట్టూ తిప్పించుకో గలుగుతాడు!... ఇంకోవిషయంకూడా అతనికి చప్పున జ్ఞాపకం వచ్చింది. ఇది తను ఇన్నాళ్లూ గుర్తించని బ్రహ్మాస్త్రం! దీని ప్రయోగంతో ఆమె తన కాళ్లపైన పడగలదు! తనకు ఆమెను జయించటమే ముఖ్యోద్దేశం కనుక ఏవిధంగానైనా తను గెలవటమే తనకు కావాల్సింది!

కల్యాణి తనను పొమ్మన్నది. అందుకు తను సమాధానం ఇవ్వలేదు. ఒకవేళ తను ఒప్పుకొనివున్నా మించిపోయిందేమీ లేదు. మానవులకు వాగ్దానాల్ని చెల్లించట మొక్కటే ఆదర్శమైతే అనేకజీవితాలే తలక్రిందులై ఉండేవి!...తనెందుకు వెళ్లిపోవాలి? పొట్టను చేత్తో పట్టుకొని లోకాన్ని గాలిస్తూన్న తనకు

ఇక్కడ జీవనోపాధి దొరికింది. ఈశాస్త్రం పాడుచెయ్యటంలో ఆమె ఉద్దేశ మేమిటి ? తను ఐశ్వర్యవంతురాలనీ, తనకన్న తక్కువవాళ్లందరూ తనకై త్యాగం చేసేందుకు సిద్ధంగా ఉండాలనీ ఆమెఅభిప్రాయం కాబోలు!...కోపాన్ని క్షణక్షణానికీ అంతరాత్మసహాయంతో ప్రజ్వలింపచేసుకుంటూ — ఎరగా కల్యాణిని నిలబెట్టి శర్మ పరీక్షకు దిగాడు.

ఆమె ఎందుకు సౌఖ్యపడాలి ? ఒకే సమస్యను ఎదుర్కొన్న ఇద్దరు వ్యక్తులు ఒకరు దక్షిణధ్రువానా, వేరొకరు ఉత్తరధ్రువానా తేలారు ; ఒక్కో సమస్యకు రెండేసి తలలు కాబోలు !...తనెందుకు బాధపడాలి? అసలు లోకంలోసౌఖ్యమనేది, తన కళ్లయెదుట, తనకు చిక్కకుండా ఇతర్లపా లెందుకవాలి ? తను బాధపడుతున్నాడు — లోకమంతా బాధపడితే ఎంత బాగుండును ! తను సౌఖ్యపడటంకన్న ముఖ్యమైనది ఆమె బాధపడటం ! తనకు అందని ఫలం ఇతర్లు — ఎవరైతేనేం — అందుకోగలగటం మానవుడైన శర్మకు మొయ్యలేనంత భారంగా కనిపించింది...

ఇంకా ఆమెసౌఖ్యానికని తను త్యాగం చెయ్యాలట ! శర్మ తనలో తను క్రూరంగా నవ్వుకున్నాడు. తను ఎవరికోసమై ఇంత జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాడు ? తన కేం లాభం ? తనకోసమే తను త్యాగంచేసుకోలేని శర్మ — ఆమెకు త్యాగం చెయ్యాలనే ఉద్దేశాన్ని ఎలా రానివ్వగలడు ?...ఆమె కుటుంబాన్నంతట్నీ బాగుచేసుకుందట ! కాని తన కుటుంబమంతా యీసరికి నాశనమై వుంటుంది. అంతతోపాక, తనను ఇంకా అధఃపాతాళానికి తొక్కాలని చూస్తోంది. ఎంత స్వార్థం !

ఆమెను చూసి తను నేర్చుకోవాల్సిన గుణపాఠం వొకటి అతనికి కనిపించింది. అది తన సౌఖ్యానికై, ఇతర్ల మీద జాలిపడకుండానే, గట్టిగా ప్రయత్నించటం ! ఆమె తనను జీవితంలో అవసరాలకై ఎలా ఉపయోగించుకోవాలని కుటిలంగా ప్రయత్నించిందో, అలాగే తనూ ప్రయత్నించాలి. దుర్మార్గులను జయించాలంటే దుర్మార్గంకన్న బలమైన ఆయుధం ఉండబోదేమో ?

ఇది ఎలాటి పరిణామానికి లాగినా, దీనిపైనే శర్మ తన జీవితభారాన్నంతట్నీ మోపుకొని తూచుకున్నాడు. తన రాణింపో, క్షీణింపో చివరిసారి జీవితంలో ఏకాకిగా పోట్లాడి తేల్చుకోదలిచాడు. తేల్చుకోకపోతే, తన ఆయువులో ఇక మిగిలిన కొద్దిరోజులూ కూడా వృథాయే !...తనకు అనుభవం వుంది ; దేశదేశాల నీళ్లూ తన రక్తంలో ప్రవహిస్తూ, రకరకాల ఆలోచనల్నీ ఇవ్వగలవు. తను చూసిన అనేకమంది ప్రవర్తనలు, తను మొట్టమొదటివాడై నష్టపడకుండా, చెయ్యబొయ్యేపనికి ఇదివరకే లాగిన ఫలితాలుకూడా తనకు అందుబాటులోనే ఉన్నయ్.

ఈవిధంగా అతను ముందు తనకు తను నచ్చజెప్పుకున్నాడు. తను చెయ్యబొయ్యే ప్రతిపనీకూడా మానవసహజమైందనీ, ప్రతిప్రాణీ విధిగా తన సౌఖ్యానికై పాకులాడటంలో తప్పు లేదనీ తన అంతరాత్మను తొక్కిపట్టుకున్నాడు. ఈసారికూడా తన శక్తులు తనను మోసంచెయ్యకుండా ఉండేందుకై — అనేకసార్లు పైవిషయాల్నే 'రిహార్స్' చేసుకున్నాడు. ఆమెతో మాట్లాడేప్పుడు ఉపయోగించాల్సిన కంఠధ్వనికూడా జ్ఞాపకం పెట్టుకున్నాడు...ఈసారి తనకు తిరుగులేదు; ఏది తప్పిపోయినా తన బ్రహ్మాస్త్రం తప్పేందుకు వీల్లేదు!

తెల్లవారుజాము మూడుగంటలైనా కల్యాణి గదిలోని లైటింకా ఆర్పివేయబడకపోవటం శర్మను కొంత ఆశ్చర్యపెట్టింది. తనిక్కడికి వచ్చినరోజునుంచీ యీవింతను చూస్తూనే ఉన్నాడు; కాని నిజమేమిటో అతని ఊహకు అందలేదు. తనలాగే ఆమె కూడా బాధపడుతోందా? మొదటినాటినుంచీ లోపల ఏం జరుగుతోందో తెలుసుకోవాలనే కుతూహలం అతనిలో నానాటికీ అధికమవుతూనేవచ్చింది. ఇక యీనాడు అది అతని స్వాధీనంకూడా తప్పింది.

మానవప్రపంచానికి ఇది గాఢతమనిద్రాసమయం; తనను ఇప్పుడు ఎవరు చూడబొయ్యారు? తనిలా భయపడుతూ, తనను తనే నిరుత్సాహపరుచుకుంటూండటంవల్లనే జీవితం తనపైన సవారీలు చెయ్యగలుగుతోంది. తనిక యీమానవుల్నీ, లోకాన్నీ భయపెట్టాల్సిన సమయం వచ్చింది. ఇందుకు మొట్టమొదటి

నమూనాపాఠంగా యీసంఘటననే తీసుకున్నాడు. ముందు జరగాల్సిన నాటకంలో యీచిన్న భాగానికే భయపడితే—తన ధైర్యాన్ని తను ఇక్కడ పరీక్షించుకునేందుకే వెనుకంజవేస్తే ... ముందు తనకు కలిగే ఫలితం స్పష్టం! తనకు తను హేతువాదంగా నచ్చచెప్పుకుని శ్రమపడటంకన్న – మంచో చెడ్డో తెగింపు లేకపోతే ఏమీ లాభంలేదనే సిద్ధాంతాన్ని నమ్మాడు. ప్రాణానికూడా తెగిస్తే—తనకు అంతా సౌఖ్యమే! చిక్కితే, ఇటు కల్యాణి చిక్కుతుంది; తన భావి జీవిత మంతా వెలుగవుతుంది. లేదా, తను ప్రాణం పోగొట్టుకున్నాక — యీబాధలూ, యీసమస్యలూ మరి ఉండవు! రెండువైపులా పదునైన యీకత్తి చాలా ఉపయోగంగా తోచింది!

అతనికి యీక్షణంనుంచే లోకము, మనుషులు, నీతి, గౌరవము, తనస్థానము మొదలైన ఆటంకాలు కనిపించటం లేదు. మొదట సగందూరం వెళ్లి, వెనక్కా, ముందుకా అనే ప్రశ్నతో ఒకక్షణం ఆగి, మళ్లీ ధైర్యంచేసి ఆమెగదికిటికీవైపు నడవసాగాడు.

తనకు పైగా వున్న కిటికీలోకి ఒక్కసారిగా పాకేందుకు అనుమానించి, లోపల మనుషుల అలికిడి ఏమన్నా వుందేమోనని జాగ్రత్తగా చెవులు రిక్కించి కూర్చున్నాడు. బైటిగాలి గదిలో ప్రవేశించేముందు కిటికీచువ్వల్ని తాకుతూ చేసే సన్నని శబ్దంతప్ప అతనికి మరేమీ వినరాలేదు. మెల్లిగా అతను కిటికీలోకి ఎగబాకాడు.

గదిలో కుర్రాణ్ని దగ్గరకు లాక్కొని కల్యాణి నిద్రపోతోంది. లైటుమాత్రం, ఆమె ఏమరుపాటున వున్నా, తన విశ్వాసాన్ని చూపే నిర్జీవవస్తువే నన్నట్టు వెలుగుతోంది. రోజూ ఇలాగే ఆమె లైటు వేసివుంచుతోం దన్నమాట! కారణం శర్మకు తెలియ లేదు ... కాస్త పరీక్షమీద శర్మ ఇంకోచిత్రాన్ని గమనించాడు. నిద్రిస్తూన్న ఛాయలు పడ్డ ఆమె కనురెప్పల్ని తోసుకొని అంతకు కాస్తముందుగా నున్నని ఆమె చెంపలమీద గాలిపీల్చుకుంటూన్న ఆమెకన్నీటి బిందువుల్లో ఎలక్ట్రిక్ లైటు తన పాపల్ని చూసుకుంటోంది! ఆమె ఏడుస్తోందా? నిద్రలోకూడా శోధ పడుతోందా? తనమీదినుంచి తిప్పుకోలేని మనస్సుతో పోరాడి అలసి వేగిపోతోందా?...

శర్మ యీసారి చప్పున తన బలహీనత్వాన్ని గ్రహించగలిగాడు. ఆమెకన్నీరు — నీళ్లలో నిప్పులు మల్లే—తనను పెడత్రోవల పెడుతోంది. ఆ కన్నీరు చూసి తను పడే జాలే తన ఓటమికి కారణం! తనెంత ధైర్యంగా యీ పోరాటంలోకి వెళ్లినా, ఆ దయను వదిలి, కటికగుండెను ప్రదర్శిస్తే తప్ప లాభం లేదు! దయ ఎంత ప్రమాదమైంది! ... ఇక ఆ ప్రదేశంలో ఎంతసే పుంటే, తనకే అంత నష్టం. ఈ కొత్తపాఠాన్ని నెమరువేసుకుంటూ శర్మ చకచకా కారుషెడ్డువైపు నడవసాగాడు.

౭

మర్నాటినుంచీ ఆమెకు మనస్సు కాస్త తేలిగ్గా వున్నట్టు తోచింది. తన హృదయంలో జరిగే పోరాటంలో కొంతభాగాన్ని శర్మకు చెప్పెయ్య గలిగింది ... పాపం – అతను తననుగూర్చి ఏమనుకున్నాడో? అతనిలో జరిగే మార్పుల్ని కనిపెట్టాలని ఆమె కుతూహలపడ్డది. కాని ధైర్యం చాలలేదు.

రెండురోజులు గడిచాక –

సాయంత్రం భర్త, "అన్నట్టు మరిచిపోయ్యాను; రేపు నేను ఊరువెళ్లాలి" అన్నాడు.

"ఏ వూరు?"

"మావూరు ..."

"ఎన్నాళ్ల పని?"

"ఐదురోజులు –"

ఐదురోజులపాటు ఒంటరిగా బతకట్టం ఎంత కష్టం! అందులోనూ యీ మనోవ్యాధితో వేగిపోతూన్న సమయంలో! ఎట్లాగైనా యీ శర్మకూడా భర్తతోపాటే ఇక్కడ లేకుండాపోతే కొంత నయమే!

"కారు తీసుకువెళ్లరూ?"

"ఊహుఁ ... రైల్లోనే –"

ఆమెను మళ్లీ కొత్తరకంభయం వెన్నాడ సాగింది. ఇప్పుడిక భర్తరక్షణకూడా లేకుండా యీ బంగళాలో ఐదురోజులపాటు తన విరోధిని తప్పించుకు తిరగాలి! భర్తతో తను వెళ్లేందుకూ వీల్లేదు! తనను తనే కాపాడుకోవాల్సిన క్షణాలు కూడాను! జీవితం ఇలా సుడిగుండాల్లో పడుతుందని ఎవరనుకున్నారు?

తెల్లారి ఆమె మేల్కొనేప్పటికే భర్త వెళ్లిపోయ్యాడు. ఆమె తన గదిని వదలదలచుకోలేదు. బైటిప్రపంచాన్నంతట్నీ మరిచిపోయి యీ నాలుగు గోడల మధ్యనే కూర్చొని మనశ్శాంతికి తపస్సు చెయ్యాల్సి వచ్చింది.

ఒక్కొక్క నిమిషం ఒక్కొక్క గంటలాగు తోచింది. కాలపువిలువా, దాని భారమూ నిజంగా తెలుసుకో గలిగే క్షణాలు జీవితంలో కొన్నేనేమో? రోజులు గడపటమే సమస్యయితే యీ జీవితాన్ని ఏం చేసుకోవాలట్టు? ఎంతసేపని ఆధరించరాని నిశ్శబ్ద దేవతను ఆరాధించటం? గొప్పఇంటి గృహిణి కావటం వల్ల — ఇంటిపనులుకూడా లేక ఇన్నాళ్లూ ఆమెలో పెరిగి కూర్చున్న సోమరితనంకూడా ఆమెను బాధించ సాగింది.

సాయంత్రానికి కుర్రాడు ఎప్పుడు వచ్చి పడుకున్నాడో కాని, అలసి నిద్రపోతున్నాడు. ఏనా వీడికి శర్మతో ఇంతస్నేహ మేమిటి? తనలాగే లోకమంతా ఎందుకుండలేదో ఆమెఆలోచనకు తెలియలేదు ... ఇంకా ఆలోచించాల్సిన విషయాలేమున్నాయ్? పుస్తకాలు చదివే ఓపికా ఆమెకు లేదు; ఒకవేళ చదివినా ఆమెను 'ఎంటర్టెయిన్' చేసే (సంతోషపెట్టే) సాహిత్యం యీ నాడుమాత్రం కనిపించటం లేదు.

అలా బైటికి వెళ్లి కాస్త చల్లగాలి పీలుస్తే? ఈ బందిఖానానుంచి తప్పకుండా తనకు కొంతసేపైనా విముక్తి కలగాలి. కాని బైటిప్రపంచంలోకి మాత్రం ఆమె వెళ్లే స్థితిలో లేదు. ఈ బంగళాను ఆవరించుకొన్న తోటలోకి వెళ్లి కాసేపు తిరిగివస్తే? తన ఇంటి ప్రహరీలోనేనాయె ... ప్రమాద మేముంటుంది? కుర్రాణ్ని లేపకుండానే ఆమె ధైర్యం చేసి వెళ్లింది. ఒకగంటదాకా తిరిగి, తిరిగి వచ్చింది. ఆ గంటసేపూమాత్రం ప్రకృతి కొంతవరకూ ఆమెను ఓదార్చ గలిగింది.

ఈ మనశ్శాంతి వచ్చే మార్గాన్ని కనిపెట్టగానే ఆమె మర్నాడుకూడా అలాగే వెళ్లింది.

నాలుగోనాడు ఆమె తిరిగి రాబోతూండగా, "కల్యాణీ!" అని ఎవరో పిలిచారు. ఆమె ఉలిక్కి పడ్డది. చూస్తే — శర్మ! ఏ ప్రమాదమైతే రాదని ఆమె నాలుగురోజుల అనుభవంమీద తేల్చుకో గలిగిందో ఆ ప్రమాదమే ఎదురైంది! కొన్ని క్షణాల పాటు ఆమె అలాగే నిలబడిపోయింది......శర్మ! ఇదెక్కడిరూపం? అతని కళ్లనుంచి వచ్చే కాంతి తను నిలబడ్డ భూభాగాన్ని కనికట్టు కడతా నన్నట్టు వుంది. గట్టిగా అతను పీల్చి వదలే గాలి చేసే శబ్దం అతని హృదయాన్ని బైటికి నెట్టటంలో గల కష్టాన్ని చెప్పకుంటోంది. తన ఇంటిదగ్గరే తనను ఇలా నిలవ తియ్యటంలో అతని ఉద్దేశ మేమిటి? రెండు ఫర్లాంగుల అవతల వున్న నౌకర్ల కంట ఇది పడదు కాని— లేకపోతే ఎంత ప్రమాద మయ్యేది! ఇప్పుడు తన కర్తవ్య మేమిటి?

ఆమె ఆలోచన పూర్తి కాకపూర్వమే శర్మ అందుకున్నాడు: "...జ్ఞాపకం లేవా ఆరోజులు? ఇలాగే చంద్రుడు ఉదయించి, చెట్లచాటునుంచి తొంగిచూస్తూన్నా లెక్క చెయ్యకుండా—మనం మన నీడల్ని సయితం ప్రేమించుకునేవాళ్లం. ఆరాత్రులు— వెన్నెలవిలువ కట్టగలిగిన ఆ రాత్రులు! మరిచిపొయ్యావా? మరిచిపోగలిగావా? ...మాట్లాడవేం?"

ఆమె ఇప్పటి శక్తులు అతిబలహీనమై, యీ మాటలు ఆమెను పన్నెండు సంవత్సరాల వెనక్కు లాక్కుపోగలిగినై. నిజమే! ఆరోజులు — శర్మ అన్నట్టు అతి ఆనందమైనవి! కాని అవి గడిచిపోయినయ్. వాటిని గూర్చి ఇప్పుడు ఆలోచించటం కూడా అనవసరం. అందులోనూ కొద్దిరోజుల క్రితంవరకూ మరిచిపోగలిగిన తను!...అసలు ఇలా సంభాషణను మొదలుపెట్టటంలో శర్మ ఉద్దేశ మేమిటి? ఈరోజులు

కూడా ఆ రోజుల్లాగే మార్చుకునే అవకాశం వుందని సూచిస్తున్నాడా? అందుకు తనకు గతమంతా చెప్పి తనను మభ్యపెట్టాలని చూస్తున్నాడా? జీవితపు యవ్వనదశ ప్రారంభంలో మానవమాత్రుడికి సహజంగా ఎదురయ్యే అగ్నిపరీక్షలో ఓడి, తన కోర్కెలకు బానిసై, ఒక్క క్షణిక దుర్బలత్వానికి లొంగిపోయి — యీ జీవితమంతా బాధపడాల్సిన స్థితికి వచ్చిందనే మాటను ఆమె ఇంకా మరిచిపోలేదు. మళ్లీ యీనాడు ఆ అగ్నిగుండమే ఎదురై, నడి ఎడారిలో దాహానికి వెతుక్కునే పాంథుణ్ణి భ్రమింపజేసే ఎండమావులలాగు, దీపాన్ని పండుగా అపోహపడే శలభంలాగు చెదిరిస్తోంది. మొదటిసారి తను కాలుజారిపడ్డ అనుభవమే ఆమె కిప్పుడు సహాయంగా నిలబడ్డది. ప్రేమ అనేదాన్ని ఎలాగో ప్రసాదించి, విధి దానితో జీవితాన్ని ఎలా ఆడించగలిగిందో తనకు తెలుసు కనుక, మళ్లీ ఆ బుద్ధితక్కువకు పోవటం తనపని కాదు.

అందుకనే ఆమె యీమాటలకు మొదట కాస్త చలించినా, చప్పున నిలవతొక్కుకోగలిగి, "ఆ రోజుల సంగతి ఇప్పుడు దేనికి? శర్మా! మళ్లీ యీ భ్రమలో పడబోక. నీ జీవితాన్ని ఇంతవరకూ లాగింది ఆ ప్రేమే! నీ కింకా జ్ఞానోదయమే అవలేదా?" అంది.

శర్మ యీమాటల్ని విననట్లే నటించి, తను అప్పజెప్పాల్సిన పాఠాన్ని జ్ఞాపకం చేసుకుంటున్నాడు. దాసీదాని చలవవల్ల తను సంపాయించగలిగిన యీ ఒక్క అవకాశమూ పోతే ఇక లాభంలేదు.

మెల్లిగా మొదలుపెట్టాడు: "కల్యాణీ! స్త్రీకి కావాల్సింది ఒక్క ఐశ్వర్యమేనా? ఇష్టంలేని యీ భర్తతో ఎలా కాపరం చేస్తున్నావో, కోర్కెల్ని మాధురాలులాగు ఎంత హీనంగా చంపుకు బతుకుతున్నావో, మిగిలిన కొద్దిరోజుల్నీ యీ భారంతో ఎలా గడపగలవో ఆలోచించు. నీకు పనికిరాని జీవితం—"

అతని మాట పూర్తికాకముందే ఆమె అంది: "నువ్వు చెప్పింది నిజమైనా—ఏ మానవుడికి కోర్కెలన్నీ తీరుతున్నయ్? చచ్చేనాటికికూడా తీరని వాంఛలు ఎంత అసంతృప్తిని ఇస్తయ్! ఒక్కటే ఆలోచించు: ఉన్నదాన్ని అనుభవించక, లేనిదానికోసం దీన్నికూడా పాడుచేసుకుంటే ఏం లాభం? ఒకసారి పగిలిన యీ హృదయాన్ని ఎలాగో అతుక్కున్నాను. దాన్ని మళ్లీ ఛేదించుకుంటే ఏం లాభం? ఈ స్వల్పజీవితానికి ఏ క్షణానికి ఆ క్షణమే విలువైనప్పుడు ఏం చెయ్యను? జీవితంలో ఇలా బతికి బాధపడటంకన్న చచ్చి సౌఖ్యపడదామనే తలపు వచ్చిన క్షణాలుకూడా వున్నయ్. కాని చావలేకపొయ్యాను. నీకు లేవా యీ అనుభవాలు?"

కల్యాణి — ఆ నాటి అమాయకపుపిల్ల ... తన వలలో పడి తను చెప్పిందే వేదవాక్యంగా శిరసావహిస్తూ, తనుతప్ప ఇంకో పురుషుడే లోకంలో లేడని నమ్మిన యువతి — యీ పన్నెండేళ్లలోనే ఇంత విజ్ఞానాన్ని సంపాయించి తనతో వాదనకు దిగుతుందని అతను అనుకోలేదు. జీవితంలోని బాధ ఎంత విజ్ఞానకాంతిని ప్రసాదించగలదో, అదెంత విలువైన వస్తువో, మెరిసే ఆమెకళ్లల్లోంచి మెల్లిగా దారిచేసుకువస్తూన్న ఆకన్నీటికే తెలుసు! కాని ఆమెకన్న ఎక్కువజీవితాన్ని చూసి ఎక్కువబాధతో లోకంపోకడను బాగా అర్థంచేసుకొన్న శర్మ తన పట్టును వీడలేదు.

అతను మాట్లాడేందుకు ప్రయత్నించేప్పటికే ఆమె గట్టిగా నిట్టూర్చి అంది: "శర్మా! నిన్ను నేను కోరానుగా — ఎక్కడికన్నా వెళ్లమని? వెళ్లరాదా? నీకు పోయేదేముంది? ఒక ప్రాణిని రక్షించినట్లవుతుంది—"

"నా జీవనం?"

"నేను డబ్బిస్తాను. డబ్బుకొరక నీ జీవితాన్ని పాడుచేసి, నిన్ను సౌఖ్యపెట్టేదైతే నీకు దాన్ని సమకూర్చి, నీఅభివృద్ధికోసం దైవాన్ని ప్రార్థిస్తాను. నా చెడురోజులప్పుడు నన్ను చూసి బాధపడలేక, కోపాలపాలయ్యావ్. నామీద ఇంత సానుభూతి చూపిన నీకు — నీ చెడురోజులప్పుడు విశ్వాసంతో సహాయం చెయ్యటం నావిధి ..."

ఆమెమాటలు మళ్లీ శర్మహృదయాన్ని కదపసాగినయ్. ఎంత సానుభూతి! డబ్బు — డబ్బు విలువనూ, అది తీర్చగల ముఖ్యసమస్యల్నీ తను ఇదివరకే

గ్రహించాడు. కాని డబ్బెక్కటే కాదు తనకు కావాల్సింది. ఆ మెదయను తను అంగీకరించటంకూడా చాలా ప్రమాదమే !-

" నీ మూలాన – ప్రకృతి బాధించగల బాధలన్నిటినీ ఎదుర్కొన్నాను. నీ కోసం. ఇదంతా నీ కోసమే !"

" ఆ నేరం నాదా ?"

" కాకపోవచ్చు. కాని ఇద్దరి జీవితాల్నీ ఇప్పటికైనా పాడుచేసుకునేకన్న బాగుచేసుకునేందుకు ప్రయత్నిస్తే ?"

" అసంభవం !" అని పేలవంగా నవ్వింది.

" కాదు ... నేను చెప్తాను విను : మనిద్దరం వెళ్లిపోతే ? ఎక్కడికైనా సరే ! భూభాగంమీది సౌఖ్యం – తెలిసిందా ?"

ముందు తను నిలబడ్డ భూభాగమే కంపిస్తున్నట్టు ఆమెకు తోచింది. శర్మ ఏమన్నాడు ? తనను-కులీనురాల్ని, తన మర్యాదనుకూడా పాటించకుండా అనగలిగాడా ఆ మాటల్ని ? ... కాని శర్మ – తనను దేవతగా పూజించిన శర్మ, గడచిన ఆరోజుల్ని మరువలేక బాధపడుతూ ఇంకా వాటిని పట్టుకు వేళ్లాడుతూ ఇలా మాట్లాడా డంటే ఆశ్చర్యం దేనికి ?

" శ – ర్మా !" అంది, హెచ్చరిస్తున్నట్టు.

" అవును. నేను చెప్పింది నిజంకాదా ? వెళ్లిపోదాం. మనను మోసంచేసి మన సౌఖ్యానికి అడ్డంపడ్డ యీ లోకాన్నే మోసంచేద్దాం. మనం బతికేందుకు – యీ విశాలవిశ్వంలో చోటెంత మేర దొరక్కపోదు. ఆ సాధించగలిగే సౌఖ్యాన్ని మళ్లీ చేతులారా పాడుచేసుకోవటం దేనికి ? ఒకవేళ మనం ఇందులో గెలవలేకపోతేమాత్రం మేం – ఇంతకన్న ఎక్కువ బాధకు పోముగా ?"

ఆమె యీ మాటల్ని అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తోంది. కాని యీ రంగానికి ముందుగానే తయారైన శర్మ ఆమెకోర్కెల్ని కృత్రిమంగా రెచ్చగొట్టి, బాధపెట్టి – తనవైపు లాక్కోవాలని అన్నాడు :

"నీకు జ్ఞాపకం లేదా ? నాపాడుగాటి పేరును మార్చి 'శర్మ' అని పిలుస్తా నన్నావ్. అదే పేరుతో ఇన్నాళ్లూ గడిపాను. నువ్వు పెట్టిన ఆ పేరుకూడా నాకు అంత మధురమైంది. కల్యాణీ ! ఇంకా గుర్తు తెచ్చుకో : ఒక నాడు ఏమన్నావ్ ? నేను నడిచిన భూమినికూడా ముద్దుపెట్టుకోవాలనిపిస్తోం దనలేదా ? నీపాదుగాటివిగ్రహంముందు – తనప్రాణాన్నే బలి ఇచ్చేందుకు సిద్ధమైన మహాభక్తుడిలాగు నేను నిలబడితే- నీ పెదవులే నాపెదవులకోసం తన్మయత్వంతో వెదుక్కొనేవి. నీమూర్తి, నీశక్తులు, నీ ఆనందం – అంతా నేరొకలోకంలోని భూమిగా నిన్ను భ్రమింపచేసిన క్షణాలు – మళ్లీ వద్దా అవ్వి ? వీట్లందరికీ భయపడి వదులుకుంటావా ? నే నిలా నిలబడితే చిన్న పిల్లాణ్ని బుజ్జగించినట్టు నన్ను లాలించావ్ –"

ఆగాడు. మళ్లీ ఆపని ఇప్పు డామె చేస్తుందేమోనని. కాని ఆమె యీసారి అంత బుద్ధితక్కువకు వెళ్లలేదు. ఆమెలో ఒక విద్యుత్ ప్రవాహం అతివేగంగా ప్రవహిస్తోంది. అద యీలోకంతాకిడిని దరి జేరనివ్వదు. నిర్లక్ష్యంగా నవ్వేందుకు ప్రయత్నించింది, అంది : "చాలు – శర్మా ! ఇదా నువ్వు చెప్పాల్సింది ? ఇప్పుడు ఇక్కడ నిలబడ్డ కల్యాణి ఎవ రనుకున్నావ్ ? యువతిగా నీకోసం ఆరాటపడ్డ కల్యాణి కాదు. తల్లిగా మారిపోయిన కల్యాణిని ! ఈహృదయంలో మాతృత్వానికితప్ప ఇంక దేనికీ తావులేదు. కోర్కెలకు కీలుబొమ్మలైన రోజులు పోయినై. పోయినా ఇబ్బందిలేదు. గడిచిన రోజులే మంచివి. ఎందుకంటే, కష్టమో, సుఖమో – మళ్లీ అవ్వి జీవితంలో తిరిగి రావుగా !"

శర్మ యీధోరణిని కనిపెట్టాడు. ఇక ఇదివరకే తను కంఠోపాఠంగా చెప్పకున్న మాటలు లాభంలేవు. తన వాదనలు, తను మధ్యపెట్టటమూ మొదలైనవి ఆ మెదగ్గర పనిచెయ్యవు. తనను ఆమె ఇంకా ప్రేమిస్తున్నా, తనపైన సానుభూతి చూపుతూన్నా – ఆమె తను పన్నిన అపలువలలకైపే రావటంలేదు ... ఇక మిగిలిన ఒక్క అస్త్రమూ–తన ఆశలన్నింటినీ కేంద్రీకరించుకున్న ఆయుధాన్ని ప్రయోగిస్తేతప్ప ప్రయోజనం లేదు. అటో ఇటో తేలకపోతే, తన బతుకే ఒక సమస్య !

నామాట వినవా?"

"నువ్వు నామాట వినకూడదా? ఇంకా చిన్న కుర్రాడిలాగు నువ్వు మాట్లాడుతూంటే నాకు ఆశ్చర్యంగానే వుంది—"

శర్మకు కోపం వచ్చింది. ఇంతవరకూ తను పొందిన అపజయాలన్నీ పట్టుదలను రేపినయ్.

అన్నాడు: "చూడు — గుర్తుందా?"

"ఏమిటి?"

"నువ్వు నాకు రాసిన లేఖలు...మనిద్దరం కలిసి చాటుగా తీయించుకున్న ఫోటో...నేను వాటి నింకా పారెయ్యలేదు. ఇన్నాళ్లూ నాజీవితంలోని మధురమైన రోజుల్ని చూసుకునేందుకై వాటిని ఉపయోగించుకుంటూవచ్చాను. కాని యీనాటికి మళ్లీ మధురమైన రోజుల్ని సాధించేందుకై వాటిని ఉపయోగించుకుంటాను. జాగర్త! నీజీవితమంతా నా చేతుల్లో వుంది—"

ఈమాటలకు కల్యాణికి మూర్ఛవచ్చినట్టయింది. శర్మ ఏం మాట్లాడాడో మెల్లిగా అర్థంచేసుకుంది. తనను బెదిరిస్తున్నాడు. అతను అన్న మాటల్లో నిజం లేకపోలేదు. తన యీకాపరమూ, యీ సౌఖ్యమూ – అన్నీ అతనిపైనే ఆధారపడివున్నాయ్. ఇప్పుడు తనకు ఏది దారి?

"ఏమిటి?" అన్నది, నమ్మలేని విషయాన్ని దేన్నో విన్నట్టు.

"లేఖలు–ఫోటో!" ఎంత వికృతంగా అన్నాడు! నిర్లక్ష్యంగా — చెట్లుకూడా వినాలన్నట్టు, బిగ్గరగా నవ్వాడు.

ఆమె వలవలా ఏడుస్తూ, "శర్మా...నువ్వు ... నువ్వు నాసౌఖ్యాన్ని కోరటం లేదు. నేను నీకు ఏం హాని చేశాను? నన్నెందుకు బాధిస్తావ్? ఆచిన్న వాణ్ని చూసైనా నీకు దయలేదా?" అంది.

"దయా?" అని నవ్వి, "నామీద నాకే దయ లేదు!" అన్నాడు.

కేనా యీశిక్ష? నీకీ ఓర్వలేనితన మెందుకు?... చూడు శర్మా! జీవితానికి మూడురకాల బాధలు. ఒకటి: విధి చేసేది; దీన్ని తప్పించుకోలేము. రెండు: మనకు మనమే చేసుకునే హాని. కాస్త బాధను గంపంతగా యీవిజ్ఞానంతో విమర్శించుకొని బాధపడతాం ... నాకు ఆబాధకూడా ఐపోయింది. ఇక మూడోది: మనచుట్టూ వున్న మనుషులు కల్పించే బాధ! కనీసం యీబాధను తప్పించుకోవటమన్నా మానవుడి చేతుల్లోనే వుందిగా? ఇప్పుడు చూడు— నీకు జాలి వుంటే చాలు ... శర్మా! నేను నువ్వు అనుకునేటంత క్రూరురాల్ని కాను. హృదయమూ, రక్తమాంసాలూ, వాంఛలూ నాలోనూ వున్నయ్ ... నిన్ను...పాదాలు పట్టుకుంటాను — నీకు సాధ్యమైన దాన్ని—"

"కాని, నాకు దయచూపేవాళ్లేరే!" అన్నాడు, ఆ 'దయ'కు లొంగుతే తన గతి ఏమౌతుందో గ్రహించమన్నట్టు చూస్తూ.

"నీసౌఖ్యంకోసం నన్ను నాశనం చెయ్యమంటున్నావ్?"

అతను పెద్దగా నవ్వి, "మరి నీసౌఖ్యంకోసం నేను నాశనమవలా?" అని, వెంటనే ముఖమంతా ఎర్రపడేట్టు ఉద్రేకం తెచ్చుకొని, సీరియస్‌గా ఖంగుమనే కంఠధ్వనితో అన్నాడు: "అవన్నీ నాకు అనవసరం. ఇక నీ ఆటలు యీశర్మదగ్గర సాగవు. ఇదిమొదలు నీకు వారంరోజులు ఆలోచించే అవకాశంఇస్తున్నాను. గుర్తుంచుకో. మళ్లీ వచ్చేగురువారంనాటికి ఏం తేల్చుకుంటావో! నా ఆత్మ నశించింది—జాగర్త!"

ఆమె తెలివితెచ్చుకునేలోపలే శర్మ వెళ్లిపోతున్నాడు. ఆమె గొంతెత్తి, "శర్మా!" అనీ పిలిచింది. ఆమెకంఠధ్వనితప్ప ఇతరజవాబేమీ రాలేదు. శర్మ కనుచూపుమేర దాటిపొయ్యాడు.

ఆమె వెంటనే ఆస్థలం వదలలేకపోయింది. తనలో ఏమీ చలనంలేనట్టే ఆమెకు తోచింది. శర్మతో జరిగిన సంభాషణ అక్షరంఅక్షరంగా జ్ఞాపకంచేసుకునేందుకు ఆమె ప్రయత్నించింది. కాని ఆమెబుర

ఇప్పటికే ఏఆలోచనా ప్రవేశించేందుకు ఖాళీలేకుండా పోయింది...

దూరాన ఎక్కడో ఎనిమిదిగంటలు కొడుతున్నారు. తను ఇక్కడ నిలబడి ఏం లాభం? ఆ ఇంట్లోకి వెళ్లి—వెళ్లగలదా తను? బల మేమీ లేనట్టే ఆమెకు తోచింది...కాని తప్పనిసరిగా ఎలాగో బరువైనకాళ్లను యీడ్చుకుంటూ ఇంట్లో ప్రవేశించింది కాని కాళ్లు ఒణికినయ్. గొప్పనేరం చేసి, మేకపోతుగాంభీర్యంతో తను వెళ్లకూడని స్థలానికి వెళ్తున్నట్టుగా ఆమెకు తోచింది. నుమ్మంలో నిలబడ్డ ఆమెను చూసి, వంటవాడు "భోజనానికి వస్తారా?" అని అడిగాడు.

"ఊహుఁ" అని తలతిప్పి, చరచరా గదిలోకి వెళ్లి పడుకుంది. ఉద్రేకము, బాధ ఆమెను చాలా అలిసేట్టు చేసినయ్. ఉన్నట్టుండి ఆమెకు నిద్రపట్టింది.

౨

ఒకరాత్రివేళ ఆమెకు మెలకువ వచ్చింది. పక్కనెవరో తనకు అతిదగ్గరగా పడుకొనివున్నారు. తడిమిచూసి కుర్రాడని తేల్చుకుంది.

మెల్లిగా కళ్లు తెరిచేప్పటికి గదంతా చీకటిగా వుంది. ఆమెగొంతుకూడా ఎండిపోయినట్టుంది. మెల్లిగా, లేని ఓపికతో లేచి, లైటు వేసి, మంచినీళ్లు తాగివచ్చి పక్కమీద కూర్చుంది. కుర్రాడు గాఢనిద్రలో వున్నాడు – ఎంతహాయి! నిద్ర మన ఇష్టప్రకారం వచ్చేదైతే జీవితంలోని బాధల్ని ఎంత తేలిగ్గా మరిచిపోవచ్చు! అదే శాశ్వతనిద్రయితే టోకు బేరంలాటిదే! కుర్రాడిజీవితం ఇంటి ప్రహరీగోడల్ని దాటిపోవటం లేదుకనుకనే – వాడి యీజీవితానికి చెప్పుకోదగ్గ సమస్యే లేకుండాపోయింది...సమస్య! తనకు యీసాయంత్రమే – జీవితంలో ఒక కొత్త సమస్య ఎదురైంది.

ఆసమస్యవిషయం జ్ఞాపకంరాగానే ఆమెకు భయం వేసింది. కిటికీలోంచి వీచే గాలికూడా ఆమెను భయపెట్టగలిగింది. వెంటనే ఆమె కిటికీ రెక్కల్ని మూసేసింది. కాని అది చెయ్యగలిగింది—ఒక్క ప్రకృతి బాధనుమాత్రం తప్పించటం! ఇక యీరాత్రికి నిద్ర వుండదు. గోడగడియారం లెక్కపెట్టుకుంటూ, ఆమె చెవులు గింగురుమనేట్టు, రెండుగంటలు కొట్టింది.

ఆమె తలెత్తి గడియారంవైపూ, దానిపక్కనే వున్న 'శివాజీ' బొమ్మవైపూ చూసింది. ఆమె రోజూ ఎన్నోసార్లు ఆబొమ్మవైపు చూసేది. ఆబొమ్మమీద ఆమెకు తీరని అభిమానం! కాని అ దిప్పుడింక శివాజీ బొమ్మే కాదు...అది శర్మమొహం! ఆగడ్డం, ఆకళ్లు, ఆమూపు – అంతా శర్మే! చూడలేక ఆమె చప్పున మొహాన్ని అరిచేతుల్లో దాచుకొని, తన ఆలోచనల్ని వేరొకదిక్కుకు తీసుకువెళ్లేందుకు ప్రయత్నించింది.

నిద్ర ఇంతవరకూ ఇచ్చిన విశ్రాంతికి మారుగా, ఇప్పుడు శ్రమను కోరింది. అదే ఆమె మళ్లీ ఆలోచనలో పడటం.

సాయంత్రం శర్మ తనను బెదిరించాడు. యవ్వన వాంఛకు-ఆలోచనలేకుండా— ఒక్క క్షణికబలహీనత్వానికి లొంగబట్టే తను ఇంత అలుసైంది! తన బతుకు ఇలా అడకత్తెరలో పడుతుందని కలగన్నదా? తను యీఇంటినీ, యీసౌఖ్యాల్నీ, యీకుర్రాణ్ణీ వదిలి, అతని ఆజ్ఞలకు బద్ధురాలయి అతనితో వెళ్లాలట!

లోకంలో తను శాంతికోసం పోరాడి సాధించగలిగిన యీకప్పును వదలటం అసంభవం! ఈ ఐశ్వర్యమూ, యీ కార్లూ, తను చాలామందికన్న గొప్పదనే భావమూ – ఇవన్నీ మరిచి, తనకు ఏనాడూ ఇంతభోగం రాలేదని నమ్ముతూ – తను ఎరగని కొత్త భూములకు వెళ్లటం మాటలా?

తన భర్త! మొదట్లో నిజంగానే అతనిమీద తనకు ఇష్టం లేదు. అప్పుడు జీవితం వెగటనిపించింది కూడా! కాని యీడబ్బును అనుభవిస్తూ ఆబాధను కొంతవరకూ మరిచిపోగలిగింది. భర్తకూడా తన కలల్ని గుర్తించి తన మనశ్శాంతికోసం చాలా శ్రమపడ్డాడు. అతను కష్టపడి సంపాయిస్తూన్న డబ్బును తను అనుభవించటమేకాక, తనకు ప్రియమైన పుట్టింటివారికికూడా - అంతా తనదైనట్టే - ధర్మంకూడా చేసిం

ది...తనమీద భర్తకున్న అభిమానంవల్ల అత నేమీ అనలేదు. ఆనాటినుంచీ ఎంగిలికూటితోపాటే రక్తంలో ప్రవేశించే విశ్వాసం తనలో ఉదయించింది. భర్తను మొదట్లో అపరిచితుడుగానూ, తరువాత పోషకుడుగానూ, ఆతరవాత తన సౌభాగ్యానికై పాటుపడే ఆత్మబంధువుగానూ చూడగలిగింది. క్రమంగా అతనిపైన తనకు తెలియకుండానే ఇష్టం కలిగి ప్రియుడుగా కూడా చూడగలిగింది. చివరకు అతను బిడ్డతండ్రి అయ్యాక భర్తగా చూసుకోగలిగింది...జీవితం మార్పుకు ఎంత అనుకూలంగా అమర్చబడ్డది!...ఇక ఇప్పుడు తన భర్తలాంటి దయామయుణ్ని, తనంటే పంచప్రాణాలుగా చూసుకునే వ్యక్తిని, యీబిడ్డతండ్రిని వదిలి- ఇంట తిని ఇంటివాసాలు లెక్కించినట్టు - మోసంతో శర్మతోపాటు తను కని విని ఎరుగని లోకంలోకి జారబడటం తనకు అసంభవమే!

ఈపుత్రుడు! తను మాతృరూపం దాల్చిన క్షణం నుంచీ తనకు ఏకైకప్రియబాంధవుడు! పది నెలలు కష్టపడి మోసి, తన యౌవనాన్నీ జీవితాన్నీ కూడా కొంతకొంతభాగాలుగా పంచి ఇచ్చి సంపాయించిన ఏకైకఫలం! ఒక్క గంట వాడు కనిపించకపోతేనే తహతహలాడే తను, శేషజీవితం – ఇం కెంతపొడుగో తెలియని బతుకులోని రోజు లన్నింటినీ–ఏ పొరపాటువల్లా తప్పిపోని క్షణా లన్నింటా...వాణ్ని మరిచి ఉండగలదా తను!

ఒకవేళ వెళ్తే? తను యీ తండ్రి కొడుకు లిద్దరికీ కరువౌతుంది. "మా అమ్మ నన్ను మోసగించింది" అని పుత్రుడు ఏడుస్తాడు. "నాభార్య ఎంత దుష్టురాలు" అని భర్త విలపిస్తాడు. అతని ఉద్యోగము, మనశ్శాంతి-జీవితమే సమస్యవుతుంది...రెండుప్రాణాలకూ తన సమస్య తప్పదు.

అదీకాక లోకం ఏమంటుంది? తనకు లోకంతో పని లేదని ఎంత టలాయింపు వున్నా — లోకానికి మాత్రం తనతో...తనలాటి పాపితో తప్పకుండా పని వుంటుందిగా! లేచిపోయిన ఆడవాళ్ల జాబితాకు తన పేరుకూడా చేరి, ఆ సంఖ్యను మరొకటిగా వృద్ధి జేస్తుంది. ఇది తనకు ఒక్కతెకే కళంకం కాదు; తన ఆత్మబంధువు లందరికీను! ఒక్కొక్కప్రాణికి ఎన్నియతర ప్రాణుల విడని ముళ్లో!... పుత్రుడి కులీనతను రేపటినుంచే లోకం వేలెత్తి చూపి నవ్వుతుంది. డబ్బొక్కటే వంశమర్యాదను కొనలేదుగా! "వీడి తల్లి లేచిపోయింది" అని పుత్రుడివెనుక ఎవరన్నా అనుకోవటం- వాడు వింటే- (వాడిచేత వినిపించే ప్రయత్నమే అది కనుక) వా డేమనుకుంటాడు? లోకజ్ఞానం వచ్చినకొద్దీ వా డెంత బాధపడతాడు! క్షణిక బలహీనత్వంతో తన తల్లి చేసిన ఒక తప్పుకు- జీవితమంతా అనుభవించే శిక్షకు వాడు గురౌతాడు. తల్లిగా ఇదేనా వాడికి తను చెయ్యాల్సిన ఉపకారం? తరతరాలనుంచీ, అనేకమంది కుటుంబపూర్వీకుల తెలివితేటల్తో ఇంతదూరం నిలబెట్టుకువచ్చిన వంశమర్యాదనంతట్నీ తను ఒక్కతే యీనాడు నేలపాలు చేస్తే- కులీనుల ఇంటి రక్తం ప్రవహించే పుత్రుడి ప్రతి రక్తనాళమూ ఎంత ఉద్రేకంతో బాధపడుతుంది! మంచి పేరుకు జీవితాలే చాల వేమో కాని, చెడ్డపేరుకు క్షణాలు చాలుగా!

పుత్రుడివైపు చూసింది. "నన్ను విడిచి వెళ్తావా అమ్మా?" అన్నట్టు వాడి పెదవులు నిద్రలో కదిలినయ్. వెంటనే ఆమెహృదయం ఎగిరిపడి, "వెళ్తానా?...వెళ్లను నాయనా!" అని గొణిగింది.

కాని, వెళ్లకపోతే? శర్మ ఎంత క్రూరంగా, హృదయం లేకుండా మాట్లాడాడు! గత సాయంత్రం వరకూ తనకు శర్మమీది అభిమానం పెరిగిపెరిగి ఒక్కసారిగా మాయమైంది. దానిస్థానే నీచవస్తువుపై కలిగే హేయభావం ఉదయించింది... తను వదిలించుకోవాలనుకున్నా తనను వదలని సమస్య ఎదురైంది! ఆ ఉత్తరాలూ, ఫోటో భర్త చూస్తే- తన కిక యీ కప్పుకింద స్థానం ఉండదు. తనవల్ల తన కుమారుడి గతీ అంతే! ఏ పాపమెరుగని పసిపాపకు కూడా ఇది హానికరమే! తనను క్షమించేవాళ్లు లేరు. ఇంతమంది పుణ్యాత్ముల మధ్య తను పాపకళంకితముఖంతో బతకాలంటే ఎంత కష్టం!

పోనీ, తను ఆత్మహత్య చేసుకుంటే? తన కిక యీ సమస్యే ఉండదు. అంతే కాదు. తను సమస్యగా నిలబడ్డ ముగ్గురికీ- శర్మకూ, భర్తకూ, కొడుక్కూ కూడా సమస్య ఉండదు; ఉండబోదు. లోకానికి

మాత్రం తను మామూలుగా మంచిముత్తైదుచావును ఎదుర్కొన్న పుణ్యాత్మురాలే అవుతుంది. కాని ఆ చావటం అంత తేలికైంది కాదు...... ఇదివరకు నాలుగైదుసార్లు ఆమె ఆసన్నాహం చేసి విరమించుకుంది కూడాను. ఈ ఆశలూ, యీ కోర్కెలూ, లోకంలో అక్కడక్కడ వెదజల్లబడి మభ్యపెట్టే యీసౌఖ్యమూ- వీటన్నింటినీ వదులుకోవటం మాటలా? చావు దానంతట అది వస్తేనే మందులూ, మాకులూ వేసి తప్పించుకోవాలని చూసే మానవమాత్రురాలు కాదూ తను? మంచిరోజుల్ని చూస్తున్నవాడు ఇంకా మంచి రోజులు చూడాలనీ, చెడురోజులు చూస్తూన్నప్పుడు మంచిరోజులకోసం ఓపిగ్గా వేచీ కూర్చోవటంలో సరిపోతుందికాని చావును కోరుకోగలదా? మరుక్షణమే తనది కావచ్చు! అలా ఐతే కనీసం పశ్చాత్తాపపడేందుకైనా — యీప్రాణి మళ్లీ తిరిగిరాదుగా?

ఈ సమస్య ముందు గొయ్యి, వెనుక నుయ్యిలా గుంది. ఇది యీ జన్మానికే తీరదేమో? తీరకపోయినా కాలంమాత్రం ఆగదు. మరి ఆరురోజులకే తన బతుకంతా బైటపడుతుంది. తన దారిన పోతూన్న తనను కర్మ ఇలా బాధించటం దేనికి? ఇది బలాత్కారమైనా ఇంత బాధ ఉండేది కాదు...తన అయిష్టతను ఇష్టతకు మార్పించే శక్తి ప్రయోగింపబడటమే దీన్ని భరించలేని బాధగా చేసింది! ... కాని కంట తడిపెట్టిన లేడిమీద ఏవేటగాడికి జాలి కలుగుతుంది?

“క — ల్యా — ణీ!”

ఆమె ఉలిక్కిపడి తలెత్తిచూసింది. ద్వారంలో భర్త నిలబడి తనవైపు చూస్తున్నాడు. ఎంత సేపైందో అత నలా నిలబడి? వెంటనే వాడిన ముఖాన్నీ, కన్నీరు ప్రవహించే చెక్కిళ్లనూ పమిటచాటున దాచుకుంది. కాని తప్పుచేసి వేషంవేస్తూన్న దుర్మార్గమైన ఆత్మ ఆమెను పిండుతూనేవుంది.

“తెల్లవార్లూ ఆలోచిస్తూనే ఉన్నావా?”

అతని కంఠంలో కఠినత్వమే లేదు; తనమీది ఆదరణా, జాలీ మేళవిస్తున్నయ్. ఇంత దయను భరిస్తూ తనెలా బతకగలుగుతోంది? ఆమె మాట్లాడేందుకు ప్రయత్నించేలోపలే, ఆమెముఖాన్ని తన చేతుల్లోకి తీసుకొని, ఆమెతడికళ్లలోకి చూస్తూ ప్రసాద్ అన్నాడు: “ఏమిటి నీ కీపిచ్చి? నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు. ఎందుకు బాధపడుతూన్నట్టు? రాత్రి భోంచెయ్యలేదటే? ఒంట్లో బాగాలేదా? నేను పదిరోజుల్నుంచీ నీలో క్షణక్షణానికీ మార్పును స్పష్టంగా చూడగలుగుతున్నాను. జీవితంలో నీ కష్టాలకు నాసహాయం ఉండనే వుంటుంది. కనీసం నేను వినవచ్చుగా —?”

ఆమె జవాబు చెప్పలేకపోయింది. ఏమని చెప్పుకుంటుంది? పవిత్రంగా పరిగణిస్తూ తన నింకా ఆదరిస్తూనేఉన్నాడు — ఎంత అమాయకుడు!

చప్పున తెలివితెచ్చుకొని, మాటల ధోరణి మార్చాలని, “మీ రెప్పుడొచ్చారు?” అంది, దుఃఖచ్ఛాయలు పోని కంఠంతో.

“రాత్రి—” అని, కాస్త ఆగి, “నేను అడిగిందానికి జవాబు చెప్పవా?” అన్నాడు ప్రసాద్, వేడుకుంటూన్నట్టు.

ఆనందాన్ని నటిస్తూ, నవ్వేందుకు వ్యర్థప్రయత్నం చేసి, “ఏంలేదు — కడుపులో నెప్పిగా వుంది-” అంది.

ప్రసాద్ దీన్ని నమ్మినట్టు, ఇంకేమీ అడగకుండానే వెళ్లిపొయ్యాడు. భర్తను చూసి ఆమెకు కలిగే వేరొక దుఃఖంతో ఆమె మళ్లీ బాధపడసాగింది.

ఉదయం తొమ్మిదైనా ఆమె మంచం వదలలేదు. అసలు ఆ ఆలోచనే ఆమెకు కలగలేదు. సరిగ్గా యీసమయానికే భర్త డాక్టర్ను వెంటపెట్టుకొని ఆమెగదిలోకి వచ్చాడు. ఆమె చప్పున లేచి నిలబడబోయింది. కాని డాక్టరు అప్పుడే ఆమెమంచం పక్కన నిలబడి, కొంతసేపటివరకూ ఏమీ మాట్లాడకుండానే రోగిని పరీక్షించ సాగాడు. డాక్టరు ఎందుకు వచ్చాడో, యీడాక్టరు కుదర్చగల తన వ్యాధి యేమిటో ఆమెకు తెలియలేదు. డాక్టరు అడిగిన ప్రశ్న లేమిటో, తను ఇచ్చిన జవాబు లేమిటో ఆమెకు మతేలేదు. రోగిలాగే డాక్టరుకుకూడా యీవ్యాధి అంతుపట్టలేదు.

గది విడిచిరాగానే ప్రసాద్, “ఏమిటి?” అన్నాడు.

"నాన్ సెన్స్" అన్నాడు డాక్టరు.

"ఏమిటీ?"అన్నాడు ప్రసాద్, అర్థంకాక.

"నాన్ సెన్స్...అంటే కొంతమంది 'నాన్ సెన్స్'అనే వ్యాధితో బాధపడుతూంటారు!"

ప్రసాదుకు నవ్వు వచ్చింది కాని, నిజంగా విషయాన్ని అర్థంచేసుకోకుండా నవ్వే అలవాటు అతనికి లేదు.

"నాకు కాస్త తెలిసేట్టు చెప్పండి—"

ఈసారి డాక్టరు నవ్వి, "అంటే —శారీరకంగా యేమీ లేదు" అన్నాడు.

"ఆఁ" అన్నాడు ప్రసాద్.

"అవును...ఏమీ లేదు. అది దొంగవేషమన్నా కావాలి, మానసికసమస్యయినా కావాలి. మందులకు లొంగేదిమాత్రం కాదు"

"అంతేనా?"

"అంతే! మానసిక బాధ కొంతవరకూ బాహ్యంగా శ్రమపెట్టి, ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది. అంతవరకే మందులు ... ఈరకంజబ్బులు చాలాప్రమాదం. కాస్త మనసుకనిపెట్టి ప్రవర్తించటం అవసరం.... సరే – మందు పంపుతాను—" ప్రసాద్ఆలోచన పూర్తికాకపూర్వమే డాక్టరు వెళ్లిపోయ్యాడు.

అతనికి మతిపోయిన ట్టయింది. ఇదేదో సామాన్యవిషయ మని ఇంతవరకూ చూసీచూడనట్టు ఊరుకున్నాడు. డాక్టరుమాటలు విన్నాక భార్యఆరోగ్యం విషయమైన ఆతుర్దా అతనిలో అధికమైంది.

ఆమెగదిలోకి వెళ్లి, ఆమెమంచంమీద కూర్చొని, ఆమెచేతులు పట్టుకొని ప్రార్థనాపూర్వకంగా అన్నాడు: "నీమనస్సులోమా టేమిటో బైటపెట్టు. ఇది మందులేని మనోవ్యాధి. అసలువిషయాన్ని దాచి నీకు నువ్వే బాధపడి కుంగిపోతూ నన్నూ కుర్రాణ్ణీ కూడా అన్యాయంచెయ్య బోక... చెప్పవా?"

"ఏమీ లేదు...ఏమీ లేదు" అంటూ పట్టరాని దుఃఖాన్ని ఆపుకోలేక, తలగడాలో ముఖం దాచుకొని ఏడ్వసాగింది.

ప్రసాద్ ఆమెను చిన్నపిల్లాణ్ణి బుజ్జగిస్తూన్నట్టు వీపుతట్టుతూ, "ఏమీ ఫర్వాలేదు...కల్యాణీ! ఎందుకు ఏడ్పు? చెప్పవూ?" అన్నాడు.

ఆమె ఏడుపు ఆపుకునేందుకు చీరకొంగు నోట్లో పెట్టుకుంది. ప్రసాద్ ఆమెకళ్లు తుడుస్తూ, "ఫర్వాలేదు...ఏంప్రమాద ముండనీ? చెప్పు...కాసిని మంచి నీళ్లు కావాలా?" అన్నాడు.

ఆమె దుఃఖం ఛేదించే మాటల్తో సమాధానం చెప్పింది: "ఏం లేదు...మీపాదాలమీద పడతాను— మీరు వెళ్లండి. నాగూర్చి మీరు బాధపడే అవసరం కూడా లేదు. ఏంలేదు — నన్ను ఒంటరిగా ఉండనివ్వండి. నాకు నేనై మనశ్శాంతి తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తా"

ప్రసాదుకు కోపం వచ్చింది. తనదగ్గర దాచాల్సిన రహస్య మేమిటి? తనమీదకూడా ఆమెనమ్మకం పోయిందా? కల్యాణిమీద అశ్రద్ధ తీసుకోవాల్సిన అవసరం ఆక్షణాన ఏర్పడ్డట్టుగా, వెంటనే గదివిడిచి వెళ్లిపోయ్యాడు.

ఐదురోజులవరకూ ఆమెస్థితి రోజురోజుకూ కిందికిదిగసాగింది. థర్మామీటరు చూపలేని వేడి ఏదో ఆమెను బాధించేది. ఆమె విడిచేరకం నిట్టూర్పుల లక్షణాలు గల వ్యాధి ఏమిటోకూడా ఇప్పటి శాస్త్రజ్ఞానానికి అందేది కాదు.

ఎంతసేవకైనా నోచుకున్న ఆమె ఏ సేవనూ అంగీకరించలేదు. కొడుకునుకూడా ఆటలకు వెళ్లమని ప్రోత్సహించసాగింది. ఒక్కతే ఆ గది గోడలమధ్య శాంతిస్థాపన చెయ్యాలని వ్యర్థప్రయత్నం చేసేది.

టేబిల్మీద సీసా పెట్టిన చప్పుడు విన్నది— కాస్త ఆగి తల అటు తిప్పి ఆశ్చర్యపడ్డది. ఎదురుగా శర్మ తనను రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. ఇంకా దూరముం దని భ్రమిస్తూన్న ప్రమాదం తనకు తెలియకుండానే దగ్గరపడ్డది. తను భ్రమిస్తోం దేమో నని గట్టిగా ఒకసారి కళ్లు మూసుకొని తెరిచింది...శర్మే! తన మంచందగ్గరిగా నిలబడివున్నాడు. మృత్యుదేవతే ఆమెను సాక్షాత్కరించినట్టయితే ఇంత భయపడేది కాదేమో?

ఎలాగో లేచి కూర్చునేప్పటికల్లా శర్మ అంటున్నాడు: "మందు...డాక్టరిచ్చిన మందు! అక్కడ-టేబిల్ మీద పెట్టాను."

"నన్ను బతకనివ్వవా?" అందామె.

శర్మ వెన క్కొకసారి చూసి, ఏ ప్రమాదమూ లేదని గుర్తించగానే అన్నాడు: "బతుకు! చూసుకో-నీ వ్యాధి కుదిరే మందు యీలోకంలో నా ఒక్కడి దగ్గరే వుంది. జాగర్త! మరొకరోజులోనే తేల్చుకోవాలిసుమా!" వికటంగా నవ్వాడు.

మొదట సముద్రం ఒడ్డున, రెండోసారి సినిమాకు వెళ్లినప్పుడు, మూడోమాటు తనఇంటి ఆవరణలో, నాలుగోసారి తన గదిలోనే శర్మ తనను బాధించగలుగుతున్నాడు. అతను నవ్విన నవ్వు - కల్యాణిలో ఇక మిగిలిన శక్తి ఇవ్వగల కోపాన్నంతట్నీ రేకెత్తింపజేసింది.

"ఆ...శర్మా!...వెళ్లు...ముందు నాయెదుట నుంచి వెళ్లు!" అని అరిచింది.

"అరవవోక; నీకే నష్టం. జాగర్త-నాదగ్గర..."

ఇక చెప్పటం అనవసర మన్నట్టు, ఎదుటవ్యక్తిని కట్టేసిన సంతోషాన్ని సూచించే నవ్వు-కత్తులకన్న కరుకైన కంఠంతో నవ్వుతున్నాడు.

ఇదేసమయాన ప్రసాద్ కుర్రాణ్ని ఎత్తుకొని గదిలో ప్రవేశించాడు. శర్మ వెంటనే నవ్వు మానాడు. అతనికి తను నిలబడ్డ భూమే కంపిస్తున్నట్టు తోచింది. ఆ మెకు తను బతికేవుందో లేదో నసే అనుమానంకూడా కలిగింది.

శర్మ ఆపిన నవ్వును ప్రసాదు అందుకుంటూ, "ఏదీ శర్మా - మళ్లీ నవ్వు!" అన్నాడు. కాని శర్మ శక్తు లన్నీ అతనికే ఎదురుతిరిగినయ్.

కుర్రాడిచేతులోని కట్టను తీసుకుంటూ ప్రసాద్ అన్నాడు: "కల్యాణీ! ఇవేవో ఉత్తరాల్లాగున్నయ్. చాలా పాత వనుకుంటాను. కారులో దొరుకుతే కుర్రాడు తీసుకొచ్చాడు—" ఆమె ఆశ్చర్యంతో మూగవోయింది. శర్మ తన స్థితిని చప్పున తెలుసుకోలిగాడు. తన చేతులోని అస్త్రం, తనకు నిరుపయోగమైనా, విరోధిచేతులోకి పోవటంవల్ల—ముందు అతని స్థితే ప్రమాదమైంది.

శర్మవైపు తిరిగి ప్రసాద్, "ఇవ్వేమిటో నీకు తెలుసా శర్మా?" అన్నాడు.

శర్మ పెదవులు తడిచేసుకుంటూ, మెల్లిగా, "నావే!" అన్నాడు.

"ఏమి టివ్వి?"

"నా స్వంత—" అని ఆగాడు.

"చెప్పు."

శర్మ సంశయిస్తూ కల్యాణివైపు చూశాడు. ఆమె వేరొకదిక్కు చూస్తూ ఏడుస్తోంది.

"అవి నావే... ఇచ్చెయ్యండి—" అన్నాడు శర్మ.

శర్మలో యీక్షణాన కల్యాణిమీద గొప్ప దయ గలిగింది. కాని అది సమయం మించిపొయ్యాక ఏర్పడటంవల్ల బయటపడే అవకాశమే దానికి లేకపోయింది.

"అట్లా ఇవ్వను - ఇవ్వేమిటో చెప్పు -" సరిగ్గా జడ్జీలాగే ప్రశ్నించాడు. శర్మ మాట్లాడక పొయ్యేప్పటికి మళ్లీ అన్నాడు: "చెప్పవా? విప్పి చూస్తే నైనా నాకు తెలియకపోతుందా?"

శర్మ ఇక స్వరక్షణార్థం తప్పనిసరిగా మాట్లాడాడు. "అవి...ప్రేమలేఖలు..." అన్నాడు, ఎలాగో.

"ఎవరు రాశారు?"

శర్మ మాట్లాడక నేలచూపులు చూశాడు.

"చెప్పు!"

ఇక ఒక్కమాటలో కల్యాణిజీవితరహస్యమంతా ఇమిడివుంది. ఇంత బతుకూ ఒక్కమాటవిలువే అవుతుందని ఆమె ఎన్నడూ తలచలేదు. ఉరిస్తంభానికి ఎక్కబొయ్యే నేరస్థురాలిలాగు ఆమెముఖం వెలవెలబోయింది.

"చెప్పు! నీవి నీకే ఇచ్చేస్తాను!" అన్నాడు ప్రసాద్ - హెచ్చరిస్తూ.

శర్మ ఒక్కసారిగా చెప్పలేక, కల్యాణివైపు వేలు పెట్టి చూపాడు. ఆమె ఒక పెద్దకేక వేసింది. గది గోడలుకూడా ఆమెను నాలుగువైపులా ఒత్తిడి చేస్తున్నట్టు తోచింది. కాని వెంటనే నిలవతొక్కుకొని అంది: "అవును — నావే! చేసిన తప్పును ఇప్పటికైనా ఒప్పుకోకపోవటమేమిటి? నన్ను బైటికినెట్టండి. ఈ పవిత్రగృహంలో ఉండే అర్హత నాకు లేదు ... కాని కుర్రాడు —— ఏపాపమూ ఎరుగనివాణ్ని మాత్రం అన్యాయం చెయ్యకండి —" ఇక మాటలు రాక ఆమె వలవలా ఏడ్వసాగింది.

"రామస్వామీ!"

డవాలాజవాను వచ్చి యజమానిమాటకై వేచి నిలబడ్డాడు.

ప్రసాద్ వందరూపాయిల నోటును శర్మకు ఇస్తూ, "వెళ్లు — నీకేం అధికార ముందని ఆమె నిలా బాధిస్తావ్? ఇదిమొదలూ యీ ఇంటిచాయల కనిపించావా— జైలుకు పంపుతాను. నీకు, నెల పూర్తికాక పోయినా, మూడురె ట్లిస్తున్నాను. ఇక ఇక్కడ ఒక్కక్షణంకూడా ఉండొద్దు. స్త్రీని అర్థంచేసుకోలేని నీచుడికి జీవితంవిలు వేం తెలుస్తుంది?... రామస్వామీ! వీణ్ని బైటికి గెంటిరా —" అన్నాడు.

శర్మ తనను తను తెలుసుకునేప్పటికే ధూళితో నిండిన రోడ్డుమీదకు చేరాడు!

"నన్నుకూడా పంపెయ్యండి —— నీచురాలు, పాపి మీకు భార్యగా ఉండే అర్హతను ఎలా సంపాయించగలదు? భూమాత మొయ్యగలిగినంతకాలం బతుకుతాను. ప్రకృతి దయచూపినంతకాలమే జీవిస్తాను —"

"కల్యాణీ! అవన్నీ ఇప్పుడు అనవసరం. నిన్ను క్షమించినా, శిక్షించినా అది నాచేతుల్లో వుంది. నువ్వొకప్పుడు తప్పు చేశావేమో? కాని తప్పులు చెయ్యని మానవు డేడీ? ఒక్క తప్పుకే బ్రతికే అధికారమే లేకపోతే — యీ లోకం ఇంతవు శతాబ్దాల పూర్వమే ఖాళీగా ఉండివుండేది. నేను — ఏ అర్హతా లేని నేను ఒక్క ధనసంపాదనే అర్హతగా నిన్ను వివాహమాడాను. అందుకు ఇష్టం లేకున్నా నువ్వు నన్ను భర్తగా ఒప్పుకున్నావ్ ... ఏ అధికారమూ లేని నా ఒకతప్పును నువ్వు క్షమించి నాజీవితాన్ని వెలిగించావ్. అందుకని ఇచ్చి పుచ్చుకోవటం లాగైనా, నీతప్పును నేను క్షమించవచ్చుగా! ఈ భాగ్యానికి ఆరురోజులు మంచాన పడటం దేనికి? పాపుల చరిత్రే లోకచరిత్ర. — ఎందుకంటే, లోకంలో పుణ్యాత్ములకన్న పాపాత్ముల సంఖ్యే ఎప్పుడూ అధికంగా వుంటుంది ... ఇక యీ క్షమ నాచేతుల్లోదే ఐతే — దాన్ని ఇవ్వటంకన్న నాకు ఆనందమైంది ఇంకోటి లేదు ... కల్యాణీ! ఇకముందు కొత్తజీవితంలో ప్రవేశిద్దాం!"

భర్తమాటల్ని ఆమె ఒక్కసారిగా నమ్మలేకపోయింది. ఈ అనుకోనిపరిస్థితులమార్పు ఆమెను ఆశ్చర్య పరిచినయ్. ఇది కలైనా తను అమితానందాన్ని అనుభవించి ఉండేది!

"నన్ను నమ్మవా కల్యాణీ? ఈ ఉత్తరాల్లో ఏముందో నేను ఇంతవరకూ చూడలేదు; చూడాలనీ లేదు—" అని ఆచిన్నకట్టకు నిప్పు అంటించాడు. తన జీవానికే ప్రయోగింపబడ్డ ఆ ఆయుధం బుగ్గి అవుతూండగా కల్యాణి మామూలుమనిషయింది. కాని ఆమె ఇంకా ఏడుస్తూనేవుంది. కాని, అవి హృదయభారమంతా తగ్గి వెలువడే ఆనందబాష్పాలు. ఏనీడ చాటున తను ఎన్నిజీవితాలైనా గడపగలదో ఆమెకు యీక్షణాన అర్థమైంది. ప్రసాద్ ఆమెకు భర్తరూపం నుంచి మారి, దైవరూపాన కనిపించాడు.

భర్తపాదాల్ని పట్టుకొని, ఆమె భరించలేని ఆనందంతో అతని ముఖంలోకి చూసింది. అతను ఆమెను లేవనెత్తి, ఆమెముఖంలో నవ్వుతూ, "కల్యాణీ! ఆరురోజుల్నుంచీ కష్టపడి, వేటాడి సంపాయించిన యీమందైనా నీవ్యాధిని కుదర్చగలిగింది." అన్నాడు, కొంటెగా.

ఆమె మాట్లాడలేదు. కాని, కుర్రాడికిమాత్రం ఆమం దేమిటో, దాని ప్రభావం ఏమిటో ఏమీ అర్థమవనేలేదు.

# ప్రణిపాతము

= శ్రీ జి. వి. కృష్ణరావు =

[ఒక కవి రాజుకోపానికి గురి అయ్యాడు. ఆ రాత్రిలోగా రాజధాని విడిచి వెళ్ళకపోతే అతని తల అతనిది కాదు. కవి యింటికి వచ్చేటప్పటికే పదిగంటలయింది. పెళ్ళాము బిడ్డలతో పద్ధానుగామడలపట్నం తెల్లవారులోగా దాటిపోవాలి. ఇంట్లో మాటా ముల్లే సద్దలేదు. పిల్లలు కలవరింతలో ఉన్నారు. భార్య ముసుగు తన్ని పెట్టుకుని పండుకొన్నది. ఆవిడతో కవి—]

గాలముపైచి నా కొరకు కాలము కన్నుల నార్పకుండ ఆ
జీలుగ కాచుకొన్నది; నసీబున గీసిన కొంకు గీతలో
కాలము మూడునో, పురుషకారముతే విజయమ్ము లందునో!
జాలము సేయరాదు నిముసమ్మయినన్, పయనమ్ము గట్టుమా!

భానుడు ప్రాగ్దిశాచలముపై కెగబ్రాకుచు జాగు, కాశ్యపీ
జాని మహోగ్రశాసనపు జాగిలముల్ గొని నాలిలేని నా
ప్రాణము వేటలాడుటకు పంతము పట్టినవాడు; తెగ్గుమై
దానము లగ్గి నారుధిరధారలు గ్రోలి సమాధికట్టునో!

అన్నము పున్నముం దెలియనట్టికుమారులు నిండుకుండలై
కన్నులుమూసి, కోరికలు కట్టిన దివ్యజగమ్ములందు, ఏ
పొన్నల నీడలం దిరుగబోయిరొ! మృత్యువు, కన్నుగుట్టి, ఆ
ప్రన్నని పిల్లవాండ్ర కెగబడ్డది, లేపుము, లేపుమా చెలీ!

భూపతి శాసనమ్మునకు బోసిన యుచ్చుల నొక్కటొక్కటే
తేపకు తేప కార్చి తెగద్రెంపుచునున్నవి యీ నిమేషముల్;
తాపము లేదు నీ హృదయతామరసంబున బ్రహ్మగంటివా,
కోపము కొల్వు గైకొనిన గుండెల కత్తులు నూరుచుంటివా?

తాకిన తాకుతో తల బదాబదలైనది, నెత్తు రోడె; పెం
జీకటు లేలుచున్న గృహసీమల దీపము పెట్టుకోర? నీ
వేకడ నుంటివే, పలుకవేమె, పరాకులు పాడుగాను! నా
వ్యాకులజీవితమ్మున దివాంధము కూత కుపక్రమించెనే!

సైఁ యని యొంటికాలున, విషాదపదాహతి గుండు నాపయిన్
దాయముగట్టి మృత్యువు క్రుధావివశమ్మయి దూకుచున్న, నీ
కాయమువచ్చునా, పగలు నాదృతి దర్పము లాఱితీఱునా,
చీయనకుందురా ప్రజలు, చేష్టలు చేదయి తిట్టకుందురా ?

పరపర మిత్తి దేహ మొకప్రక్కను గోయుచునున్నగాని నా
మొర చెవి దూరబోదు; మసి ముట్టదు; చేసినపాపమిట్లు మో
చరచుచునున్నవా ? యకట! జాముల నీపురుషాయుషమ్ము క
త్తెరబడి పోవసాగినది; తిట్టిన తిమ్మిన లాభమేమికే !

ఎంగిలి మంగలమ్మయిన యీతని దుర్భరజీవితమ్మునన్
క్రుంగుచునున్న జీవములకోసము గోట్రిలుచుండలేదు; పొ
న్నంగుల జంటవోలె శయనమ్మున కన్నులుమూసి, నిద్రలో
బంగరులోకమేలు పసిబాబుల ప్రాణము సంస్మరింపవే !

మదపతి, ఒక్కమాట ! అభిమానము లిప్పుడు దోయిలించి, నీ
పదముల నంటి మ్రొక్కుచు, "కృపాపరిపాకము భిక్షపెట్టుమా !
బదవలుపడ్డగాని పసిపాపల సాకుతెరంగులే" దనన్
పెదవులు విచ్చి; మాతృపదవీన దవీయసి, ఆలకింపవే !

ఇంతకు, చిత్రగుప్తుడు లిఖించిన జీవుల జాబితాల నీ
వంతున కాయు వంతమని బట్టున గీటున బుచ్చినాడో ! ర
వ్వంత విచారమేని హృదయమ్మును సోకక గండరించితే !
ఇంతులగుండెలా, అకట, యియ్యవి దాచిన చట్టుబండలా !

పోరొనరించుచుండి రణభూమిని గూలిన చింతగల్గ; దా
భూరమణుండు నన్విడిచి పొమ్మని చెప్పిన రాజధానికిన్
దూరము వోవలేక నృపదూతల చండకృపాణధార కా
హారముగా శరీరము సమర్పణముం బొనరింపవచ్చునే ?

పనివడి దేశరక్షణమొ, పాడియొ కోరిన ఆదధీచినై
పునుకలు రాల్చిపోసెదను పో ; యిటు లూరక పచ్చినెత్తురుల్
దోనదోన కార్పగా దగునె ? దోషము, శాస్త్రవిధీయమాన ము
హూన గలియించునొక్కో ? గమనోన్ముఖవై పయనమ్ముగట్టవే !

ఇంతగ కాళ్ల వ్రేళ్లబడి యేడ్చిన, కాదని మొత్తుకొన్న, నీ
స్వాంతము చుఁయ్యి చుఁయ్యనదు; జాముఁగోడిగలెక్కి, రివ్వనక్
కుంతము లార్చుకొంచు, మెరుగుల్ వలె దూకుచునున్న ఘోరకా
లాంతకకోపరేఖలకు నాగుదొ, జంకక నిల్చి క్రాగుదో !

ఓ మొగలాయిరాణి ! కరుణోదయకారణవర్తనమ్ము లే
మేమియొ విన్నవించుకొన నెంచుచు ముంగిట మోకరించె ; ఈ
మోమయి చూడరాదొ ? వినబోలదొ ? మేలిముసుంగుటంగునక
ప్రామితి, వింతలో గడసబారితివేమొ, మరాటిగుజ్జమా !



# Nadharan నధారన్

Regd.

**భార్యతో కలసి సుఖజీవనము చేయగల శక్తి మీ కుండుటచే వివాహము చేసుకొంటిరి.** బహుశ మీ రిప్పుడే జీవితయాత్రను ప్రారంభించి యుండవచ్చును. అక్కడక్కడ కొద్దిపాటి వడుదుడుకు లున్నను, జీవితయాత్రను ఒక వేడుకగా భావించి మీరు జీవితమును సాగింపగల్గుచున్నారు. ఇట్లుండగా ఒక నాడు మీభార్య గర్భవతి యైనది. అదనపు ఖర్చు, విచారము ఏర్పడెను. కొన్నాళ్లు వేడుకగా నుండెను. కాని సౌఖ్యము దూరమగుచున్నది.

వెన్వెంటనే రెండవ పిల్ల పుట్టినందున సృతిమించినది. చిక్కుసమస్య లేర్పడినవి. తలవని తలంపుగా కలిగిన సంతానము వలన దారిద్ర్యము మిమ్ము పీల్చి పిప్పిచేయుచున్నది. దీనిని సవరించుకొనుటకు మీ రుభయులు ధైర్యముతో మెలంగుచుండిరి. మీ ప్రియురాలు గృహకృత్యములందు నిమగ్నురాలై కష్టజీవి యైనది.

ముందుగా తగు శ్రద్ధ వహించియుండిన మీ కీ బాధ ఏర్పడియుండెడిది కాదు. భార్య దేహదార్ఢ్యము, భార్యాభర్తల సిరిసంపద గమనించి, విద్యాబుద్ధులు గఱపి తగు శిక్షణతో పోషింపగలిగినంతమందిని మాత్రమే కని పెంచుట సంతాననిరోధ ముఖ్యోద్దేశము.

**నధారన్** సంతాన నిరోధమునకు తప్పక గుణమొసంగు దివ్యౌషధము. ఏవిధమైన హాని కలుగజేయదు.

ఖరీదు రు. 5/-

తపాలా ఖర్చు ఉచితము.

(F 2)

**కాంత ఆయుర్వేదిక్ ప్రాడక్ట్సు,**

పోస్టు బాక్సు నెం. 586, బొంబాయి.



# డోంగ్రేగారి

బాలామృతము

బలహీనమైన బిడ్డలకు

పుష్టియున్ను, బలమున్ను

ఆరోగ్యము నిచ్చును.

# బలవృద్ధికి

# ఆనంద :: ::: సుధ

సమస్త వ్యాధులకు

**8 ఔ॥ 2-8-0**

**4 ఔ॥ 1-6-0**

డాక్టర్

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,

బెజవాడ (లేక) రాజమండ్రి.

# మైనారిటీసంఘముల సమస్య-పాకిస్థానము

= శ్రీ ఆచంట సూర్యనారాయణమూర్తి =

భారతభూమి మైనారిటీసంఘములకు పుట్టినిల్లని విదేశములలో వాడుక. ఈ విశాలప్రపంచములోని అనేక దేశములలోకెల్ల మైనారిటీ సంఘములు గల దేశము ఒక్క భారతదేశము మాత్రమే కాదు. అనేక దేశములందు మైనారిటీ సంఘములు గలవు. కాని ఆదేశము లన్నిటికిని మైనారిటీసంఘముల దేశము లని పేరు రాలేదు. అన్ని దేశములలోని మైనారిటీసంఘ సమస్యలును చక్కగా పరిష్కరింపబడినవి. భారతదేశమునందలి మైనారిటీసంఘముల సమస్య జగద్విఖ్యాతి నొందినది. ఈ సమస్య ఆనాటినుండి నానాటికి పెరుగుచున్నది. పెరిగి పెద్దదై భారతభూమినే పలు పేలికలుగా విభజింప ప్రయత్నించుచున్నది.

అనాదినుండియు రాజనీతియందలి చతుర్విధోపాయములలోను భేదోపాయము విదేశములందును, స్వదేశములందును సామ్రాజ్యముల నేర్పరచుకొనిన సమ్రాట్టుల పరిపాలనకు సాంగోపాంగముగ నున్నది. ప్రఖ్యాతములగు ప్రాచీనమౌర్యరోమనుసామ్రాజ్యపరిపాలనా విధానములందుగూడ ఈ ఉపాయము వాడబడినది. ఈ ఉపాయమును వాడుట పరిపాలకులకు పరిపాటి. దీనిని ప్రయోగించినంతమాత్రముననే ప్రయోజనము లేదు. భేదోపాయము విజయము నొందవలె నన్న వలలో బడు ప్రజ లుండవలెను. ప్రజలలో ప్రతికక్షు లేర్పడవలెను. అనేకచారిత్రిక కారణములవలన భారతదేశమున వివిధజాతిమతములు చేరినవి. ప్రజలలో ప్రతిపక్షముల నేర్పరచుటకు భారతసంఘ పరిస్థితులు పరిపక్వములు. అట్టి సంఘదౌర్బల్యమును పాలకులగు ఆంగ్లేయులు స్వలాభమునకు పూర్తిగా వినియోగపరచుకొనుటయం దాశ్చర్యము లేదు.

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు, బౌద్ధులు, జైనులు, పార్శీవారును భారతసంఘమున ముఖ్యులు. ఇందు హిందువుల జనసంఖ్య మెండు. అందుచే మిగిలినవా రందరును మైనారిటీ సంఘమువారు. కాని భారతదేశమున గల మైనారిటీ సంఘములకు కేవలము మతమే హేతువు కాదు. నిజమునకు హిందూమతస్థులే కొందరు మైనారిటీసంఘముగా నేర్పడిరి. ఇట్టిసంఘటనమునకు సంఘదురాచారములు సాయపడినవి. అల్పసంఖ్యాకమతస్థు లగు బౌద్ధులు, జైనులు, పార్శీవారును మైనారిటీసంఘములను స్థాపించలేదు. ప్రస్తుతము ఆయుసంఘములవారు మైనారిటీలుగా పరిగణింపబడుచున్నారు: ౧. మహమ్మదీయులు, ౨. నిమ్నజాతులు, ౩. సిక్కులు, ౪. భారతీయ క్రైస్తవులు, ౫. ఆంగ్లోఇండియనులు, ౬. యూరోపియనులు. ఇందు మహమ్మదీయ మైనారిటీసంఘ సమస్య ముఖ్యతమమైనది.

## మహమ్మదీయ మైనారిటీసంఘసమస్య-పాకిస్థానము

మహమ్మద్ ఆలీ జిన్నామహనీయుని ధర్మమా యని భారతరాజకీయరంగమున పాకిస్థానము స్థావరము నేర్పరచుకొనినది. విషయజ్ఞానము లేని పల్లెటూరి మహమ్మదీయులకు మొదలు విశ్వవిద్యాలయమునందలి మహమ్మదీయవిద్యార్థులు, విజ్ఞానవేత్తలవరకును పాకిస్థానమే వారి రాజకీయపరమావధి యని చాటుచుండిరి. ముస్లింలీగువారికి హఠాత్తుగా ౧౯౪౦-వ సం. మార్చి ౨౬-వ తేదీని శుభముహూర్తపు గడియలలో లాహోరునగరమున ఈపాకిస్థాన్ అభిప్రాయము పొడ

నూపలేదు. ౧౯౩౦-వ సం. డిసెంబరునెలలో లక్నో నగరమున జరిగిన ముస్లింలీగుసమావేశమున సర్ మహమ్మద్ ఇక్బల్ సాహెబుగారు వారి అధ్యక్షోపన్యాసమున ఈపాకిస్థాన్ సిద్ధాంతమును ప్రతిపాదించిరి. కాని అప్పటిలో ముస్లింలీగువారు దాని నంగీకరించలేదు. తరువాత ౧౯౩౩-వ సం.న రహమత్ ఆలీసాహెబుగారు పాకిస్థాన్ ఉద్యమమును ప్రారంభించిరి. వీరు భారతదేశమును రెండు భాగములుగా విభజించిరి. ఒకటి పాకిస్థానము, రెండు హిందూస్థానము. వీరి పాకిస్థానమునందు పంజాబు, వాయవ్య సరిహద్దురాష్ట్రములు, కాశ్మీరము, సింధు, బెలూచిస్థానముమాత్రమే కలవు. మిగిలిన దంతయు హిందూస్థానము. ఈపాకిస్థానము ప్రత్యేకముగా స్వతంత్రముగా నుండవలెనని వీరి ఆశయము. ఈ ఐదు రాష్ట్రములును జేసి ఒక మహమ్మదీయ సామ్రాజ్యముగా నేర్పడవలెనని వీరి ఉద్దేశము. ౧౯౩౦-౩౧ సం. లలో లండనునగరమున జరిగిన రౌండుటేబిలు సమావేశ సందర్భమున సైతము వీతద్విషయక ప్రణాళిక సభ్యులకు గుప్తముగా నొసగబడినది. కాని బాహాటముగా దీనినిగురించి యెవరును ప్రసంగించలేదు. దీనికి బ్రిటిషు ప్రభుత్వమువారి అంగీకారమును సంపాదింప రహస్యముగా ప్రయత్నములు గూడ జరిగినట్లు కన్పట్టుచున్నది. కాని, తద్ద్వారా, కాలవాహినిలో కలిసిపోయిన మహమ్మదీయ ప్రభుత్వము పునరుద్ధరింపబడునేమో యని శంకించి బ్రిటిషు ప్రభుత్వమువారు దీనిని నిరాకరించిరి. కావున ముస్లింలీగువారు ఆమోదించిన పాకిస్థాన్ తీర్మానము నూతనమైనది కాదు. ముస్లింలీగు చరిత్రను మొదటినుండియు తెలిసికొనినవారి కిది వింతగా తోచదు. బ్రిటిషు ప్రభుత్వమువారు భారత రాజ్యాంగ విధానమునం దనుసరించుచున్న పద్ధతికి ముస్లింలీగువారి వైఖరి విపరీతము కాదు. పాకిస్థాన్ వృక్షమునకు విత్తనము ప్రత్యేక నియోజకవర్గములయందు నాటబడినదని రాజకీయ శాస్త్రవేత్తల దృఢవిశ్వాసము. పాకిస్థానమును గురించి ప్రసంగించుటకు ముందు ప్రత్యేక నియోజకవర్గవృత్తాంతము నెరుంగుట సమంజసము.

## ప్రత్యేకనియోజకవర్గములు : పోటీపక్ష ప్రేరేపణవిధానము

రాజనీతియందలి భేదోపాయమును పురస్కరించుకొని బ్రిటిషుప్రభుత్వమువారు భారతసంఘమున వివిధ విరోధ రాజకీయపక్షములను ప్రేరేపించుచుండిరని జాతీయవాదుల వాదము. భారతసంఘముననే బహువిధములగు ప్రతిపక్షములు స్వతః ఉన్నవనియు, వారి వారి ప్రత్యేకహక్కులను సంరక్షించి, వారి వ్యక్తిత్వమును కాపాడి, వివిధసంఘములవారికి సంఘీభావము నేర్పరచుటయే తమ రాజ్యాంగ విధాన ప్రధానకర్తవ్యమనియు బ్రిటిషుప్రభుత్వమువారి ప్రతివాదము. బ్రిటిషుప్రభుత్వమువారి యభిప్రాయము మంచిదైనను, వారవలంబించిన విధానమునందు లోపమున్నదని చెప్పకతప్పదు.

అఖిలభారత కాంగ్రెసుసంఘము ౧౮౮౫-వ సం. డిసెంబరు ౨౮-వ తేదీని స్థాపింపబడిన [illegible] లోకవిదితము. రెండు మూడు కాంగ్రెసు సమావేశములు జయప్రదముగా జరుగుసరికి నిరంకుశప్రభుత్వోద్యోగులకు కన్నెఱ్ఱ కలిగినది. ౧౮౮౮-వ సం. న వాయవ్యరాష్ట్రములకు (ప్రస్తుత సంయుక్తరాష్ట్రములు) లెఫ్టినెంటు గవర్నరైన సర్ ఆక్లెండు కాల్విన్ దొరగారు కాంగ్రెసు ఉద్యమమునకు మహమ్మదీయులు వ్యతిరేకులని నిరూపింప సమకట్టిరి. కాంగ్రెసుపితామహు డగు హ్యూమ్ దొరగారు తాము కాల్విన్ దొరగారికి వ్రాసిన లేఖయందు ఈప్రయత్నమును ఖండించియుండిరి. ౧౮౫౭-వ సం. జరిగిన సిపాయి తిరుగుబాటునందు పలువురు మహమ్మదీయ సైనికులు కలుగజేసికొనుటచే మహమ్మదీయులన్న ప్రభుత్వమువారికి మొదట కిట్టదు. కాని కాంగ్రెసురూపేణ జాతీయోద్యమము ప్రారంభమైనది మొదలు మహమ్మదీయులను కాంగ్రెసునుండి విడదీయుటకై, వారియెడ ప్రత్యేకాభిమానమును జూపుచు, మహమ్మదీయపక్షపాతమును ప్రభుత్వమువారు కనపరచ మొదలిడిరి. తమకు ప్రభుత్వమువారు చూపు ప్రత్యేకాదరమును మహమ్మదీయులు గుర్తించి నిజప్రాధాన్యత నెరింగిరి.

౧౮౯౨-వ సం.న ఇండియా సభల చట్టము అమలులోనికి వచ్చెను. ఈ చట్టమువలన భారతదేశమునకు ఒక మేలు, ఒక ముప్పు వాటిల్లినవి. శాసన సభలలోని ప్రతినిధులు ప్రజలచే నెన్నుకొనబడవలెనను సిద్ధాంతము నీ చట్టము తొలుత అంగీకరించినది. ఈ చట్టము ననుసరించి జరుపబడిన ఎన్నికల సందర్భముననే మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యము ప్రాప్తించినది. ఈ ప్రత్యేక ప్రాతినిధ్యము మూలముననే రానురాను ప్రత్యేకనియోజకవర్గము లేర్పడినవి. ౧౮౯౨-వ సం.పు ఇండియా సభల చట్టమునందు ప్రత్యేక ప్రాతినిధ్యవిధానము ప్రకటింపబడలేదు. కాని ఈ చట్టము ననుసరించి జరుపబడు ఎన్నికలలో మాత్రము మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యము నొసగునట్లు ఎన్నికలు జరుపు అధికారులకు ఉత్తరువులు జారీ చేయబడినవి. ఇట్టి ప్రత్యేక ప్రాతినిధ్యము కావలె నని మహమ్మదీయు లెప్పుడును కోరియుండలేదు. ప్రభుత్వమువారు తమంతట తామే మహమ్మదీయుల మంచికొరకై యీ ఏర్పాటును గావించిరి. ఈ ఏర్పాటు నింత రహస్యముగా భారత రాజ్యాంగ విధానమున ప్రవేశపెట్టిన మహనీయుఁ డెవ్వరో తెలియకున్నది. [illegible]-వ సం.ననే రాజప్రతినిధి యగు డఫ్రిన్ ప్రభువు ఆంగ్లేయ దేశమునందలి ఎన్నిక పద్ధతి భారతదేశమునకు పనికిరా దనియు, ఈ దేశమున ఎన్నికలు వివిధసంఘములను పురస్కరించుకొని యుండవలెననియు వ్రాసియున్నాడు. ౧౮౯౨-వ సం.న రాజప్రతినిధియగు లాన్స్‌డౌన్ ప్రభువు శాసనసభల యందు ప్రజాప్రాతినిధ్యమునకు ప్రాముఖ్యము నీయవలెనన్న వివిధసంఘములను తమ ప్రత్యేకప్రతినిధుల ముఖమున, వారివారి సంఘముల అభిప్రాయములను శాసనసభయందు తెలియజేసికొనుటకు అవకాశము కల్పింపవలెనని చెప్పియున్నాడు. రాజప్రతినిధులు తెలియపరిచిన యీ అభిప్రాయముల ననుసరించి, రాష్ట్రప్రభుత్వోద్యోగులు తమంతట తామే మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము నొసగియుండిరని తలపనగును. ఈ విధానమునకు ప్రధానులెవరైనను, ౧౮౯౨-వ సం. న నిది ప్రారంభింపబడుట మాత్రము సత్యము.

౧౮౯౨-వ సం. న రహస్యముగా ప్రారంభింపబడిన ఈ ప్రత్యేకప్రాతినిధ్య విధానము ౧౯౦౯-వ సం. మింటో మార్లే సంస్కరణములందు ప్రత్యక్షస్వరూపమును దాల్చినది. మింటో మార్లే సంస్కరణములు చేయబడు నను మాట పుట్టుటతోడనే, ౧౯౦౬-వ సం. అక్టోబరు ౧-వ తేదీని కొందరు మహమ్మదీయప్రముఖులు రాజప్రతినిధియగు మింటోప్రభువుతో ఆగాఖాన్ నాయకత్వమున రాయబారమును జరిపిరి. భారత రాజ్యాంగపద్ధతియందు ఎన్నికవిధానము నభివృద్ధిచేయ దలచినచో మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యమును చట్టమునందే యిచ్చితీరవలె నని వీరు గట్టిగా పట్టు పట్టిరి. మహమ్మదీయ సంఘము భారతదేశమునఁగల జనసంఖ్యయందు ముఖ్యభాగ మనియు, సంఖ్యారూపముగా కాక రాజకీయముగా మహమ్మదీయులకు ప్రత్యేకప్రాముఖ్యత గలదనియు, సామ్రాజ్యసంరక్షణకొరకై ఏర్పరచిన సైన్యమునందు మహమ్మదీయసైనికుల సంఖ్య మిక్కుటముగా గల దనియు, ఈ యీ ముఖ్యకారణములచే శాసన సభలందు వారి ప్రాతినిధ్యము వారి జనసంఖ్యపై నాధారపడియుండక, వారి రాజకీయప్రాముఖ్యతపై నాధారపడి యుండవలె ననియు, వారి ప్రతినిధుల నెన్నుకొను సందర్భమునగూడ వారికి ప్రత్యేక నియోజకవర్గములు కావలెననియు, అట్లు లేనిచో బహుసంఖ్యాకులగు హిందువులతో స్నేహముగా నుండి వారి అభిమాన విశ్వాసములను సంపాదించిన మహమ్మదీయులే ప్రతినిధులుగా నెన్నుకొనబడుదు రనియు, అట్టి ప్రతినిధులు తమ సాంఘిక ప్రత్యేకవ్యక్తిత్వమును కాపాడి తమ ప్రత్యేక సమస్యలను తమ కంగీకారముగా నుండునట్లు పరిష్కరింపజాలరనియు ఈ రాయబారమువారు రాజప్రతినిధితో విన్నవించుకొనిరి. ఇట్టి అవకాశమునకై ఎదురుచూచుచున్న మింటో ప్రభువు మహమ్మదీయవాదమును హృదయపూర్వకముగా నంగీకరించి, వారి ప్రత్యేక హక్కులను సంతోషపూర్వకముగా కాపాడ నభయహస్తము నొసగెను. ఈ మహనీయుని యభయహస్తము మహమ్మదీయ ప్రత్యేక నియోజకవర్గవాదమునకు మూలాధారమగుటచే ఆ మాటల నిట్లే యిచ్చుట పేర్కొనుచున్నాను:

*"The pith of your address, as I understand it, is a claim that under any system of representation, whether it affects a municipality or a district board or a legislative council, in which it is proposed to introduce or increase an electoral organisation, the Muhammadan community should be represented as a community. You point out that in many cases electoral bodies as now constituted cannot be expected to return a Muhammadan candidate, and that if by chance they did so, it could only be at the sacrifice of such a candidate's views to those of a majority opposed to his community whom he would in no way represent; and you justly claim that your position should be estimated not only on your numerical strength, but in respect to the political importance of your community and the service it has rendered to the Empire. I am entirely in accord with you."*

మింటోప్రభువు ఇట్టివాదము నంగీకరించుటకు కారణము లేకపోలేదు. అప్పటికప్పుడే చాలకాలము నుండి అతడు కాంగ్రెసుసంఘమునకు ప్రతిపక్షపోటీ సంఘమును లేవదీయవలెనని ప్రయత్నములు చేయుచుండెను. సంస్థానాధిపతుల సభనో, తదితర సంఘమునో కాంగ్రెసునకు పోటీగా స్థాపింప ప్రోత్సహింపవలెనని అవకాశమునకై ఎదురు చూచుచుండెను. ౧౯౦౬-వ సం. మే నెల ౨౮-వ తేదీని ఇతడు ఇండియామంత్రియగు మార్లేప్రభువునకు వ్రాసిన లేఖ ఇతని హృదయమున గల ఉద్దేశమును సూచించును.

*"I have been thinking a good deal lately of a possible* COUNTERPOISE TO CONGRESS AIMS. *I think we may find a solution in the council of princes or an* ELABORATION OF THAT IDEA."

మింటోప్రభువు మహమ్మదీయులయెడ ప్రత్యేకాభిమానము చూపుట వారిని కాంగ్రెసునుండి మరల్చుటకా అని తోచకమానదు. మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము నొసగువిషయమున రాజప్రతినిధియగు మింటోప్రభువునకును, ఇండియామంత్రియగు మార్లేప్రభువునకును అభిప్రాయభేదములు గలవు. మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము నివ్వవలెనని మింటోప్రభువు మార్లేప్రభువునకు వ్రాయగా మొదట మార్లే తన అసమ్మతిని తెలిపెను. ౧౯౦౭-వ సం. నవంబరు ౨౭-వ తేదీని అతను రాజప్రతినిధికి వ్రాసిన రాజకీయలేఖయందు ప్రత్యేక ప్రాతినిధ్య విధానమును ఆతడు ప్రతిఘటించెను. మహమ్మదీయులందరును ఒకచోట లేక దేశమందంతటను వ్యాపించియుండుటచే ప్రత్యేక నియోజకవర్గనిర్ణయము చేయుట కష్టసాధ్యమనియు, పైగా ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచినచో మహమ్మదీయులకు అందరితోపాటు స్థానికసంస్థలకు ప్రతినిధుల నెన్నుకొనుటప్పుడు ఒకసారి, తిరిగి తమ ప్రత్యేక సాంఘికవర్గమునుండి ప్రతినిధుల నెన్నుకొనుటకింకొకసారి—యీ రీతిగా రెండుసార్లు వోటు నిచ్చు హక్కు గలుగుననియు, ఇట్టి అధిక హక్కులను ఒక సంఘమువారికే ఇచ్చినచో మిగిలిన సంఘములవారు గర్హింతురనియు అతడు వాదించెను. కాని మింటోప్రభువు తన అభిప్రాయమును మార్చుకొనలేదు. మహమ్మదీయులుగూడ చేజిక్కనున్న ప్రత్యేకహక్కులు పోకుండుటకై కృషిసలిపిరి. వెనుక ౧౯౦౬-వ సం.లో రాజప్రతినిధితో రాయబారము జరిపిన వర్గమువారే చేరి ఆసంవత్సరముననే ఢక్కానగరమున డిసెంబరు నెలలో ముస్లింలీగును స్థాపించిరి. నూతనముగా స్థాపింపబడిన యీ ముస్లింలీగుసంస్థ తరఫున కొందరు మహమ్మదీయ మహనీయులు ఇంగ్లాండునకు బోయి ౧౯౦౯-వ సం. జనవరి ౨౭-వ తేదీని అమీరాలీనాయకత్వమున ఇండియామంత్రియగు మార్లే ప్రభువుతో రాయబారములను జరిపిరి. ఆగాఖాన్ రాయబారమువారు మింటోప్రభువుతో చెప్పిన విష

యములనే ఈ రాయబారమువారు మార్లేప్రభువుతో చెప్పిరి. ఈ రాయబారఫలితముగా మార్లేప్రభువు మహమ్మదీయ ప్రత్యేకప్రాతినిధ్య విధానము నంగీకరించెను. ఈ అంగీకారము నాతడు మనఃపూర్తిగా నొసగలేదన్నమాట ౧౯౦౯-వ సం. ఫిబ్రవరి నెల ౨౩-వ తేదీని అతడు ప్రభువులసభలో గావించిన ఉపన్యాసమువలన తేటతెల్లమగుచున్నది. సర్వసంఘైకనియోజకవర్గము లున్నచో వివిధసంఘములవారికి సంఘీభావ మేర్పడు ననియు, అట్టివిధానము నవలంబించునదిగా అనుభవజ్ఞులగు తన సలహాసంఘ సభ్యులు సలహా నిచ్చిరనియు, కాని మహమ్మదీయులు సర్వసంఘైక నియోజకవర్గవిధానము నంగీకరించుటలేదనియు, భారతప్రభుత్వమువారుగూడ తన సలహాను సరకుచేయలేదనియు, తన సలహానే వినునదిగా ఇండియాప్రభుత్వమువారిని తాను బలవంతపెట్ట లేదనియు, మతసంబంధమైన వోటర్లజాబితాలను తయారుచేయుట తన మనస్సునకు కిట్టదనియు, ఎప్పటికైనను ప్రాజ్ఞులగు స్వచ్ఛందరాజకీయవేత్తలు నిష్పక్షపాతబుద్ధితో పరికించి, యీవిధానమును సరిగా మార్చుదురని తాను నమ్ముచున్నాననియు ఆతడు తన ఉపన్యాసమున చెప్పెను. ప్రత్యేక నియోజకవర్గవిధానము శాస్త్రవిరుద్ధమని తెలిసియుండియు మార్లేప్రభువు కారణాంతరములచే నట్టి పద్ధతిని ప్రారంభించుటకు తన అంగీకారము నొసగెను. ౧౯౧౬-వ సం. న దొడ్డిదారిని చొరబడిన ప్రత్యేక ప్రాతినిధ్య విధానము ౧౯౦౯-వ సం న ప్రత్యేక నియోజక వర్గ విధానముతో పాటు ద్విగుణీకృతమై, భారతరాజ్యాంగవిధానమున చిరస్థాయిగా నిలిచిపోయినది.

[సశేషము]



'కార్తిక దీపము'

[చిత్రకారుడు: శ్రీ తేజోమూర్తుల కేశవరావు]

# సర్ జేమ్సుయంగు సింప్సను

= శ్రీ వేపా రామమూర్తి =

రోగము నివారించడం, ప్రాణము రక్షించడం—ఇవి రెండే ౧౯-వ శతాబ్దపు తొలి సంవత్సరములలో వైద్యులయొక్క ఆశయాలు. వీటిని రెంటినీ మనసులో నుంచుకొని సాధించుకోవడం అవసరం. ఆది రోగము నివారించుట.

ఈ ఆశయాన్ని లోకానికి వ్యక్తపరచి, అనుభవంలో పెట్టి, మానవకోటికి ఎంతో మేలు చేసిన వాడు జేమ్సు సింప్సను. ఈయన రొట్టెలవర్తకము చేసుకొని బ్రతికే బహుసామాన్యునియొక్క యేడవ కొడుకు. క్లోరోఫారము కనిపెట్టిన మహాశయుడు ఇతడే. దానితో శస్త్రవైద్యము లేకుండా శల్యతంత్రం వికటించే రోగాలు అంతరించేయి.

అంతకు పూర్వం శల్యతంత్రాగారాలు హత్యామందిరాలు. శస్త్రకర్త ప్రాణ్ణి కాపాడబోయే రోగి బాధతో తెలివితప్పడమో, లేక చచ్చుటో ఆనాడు సామాన్యంగా జరిగే విషయాలు. ఈవిషయాలు వైద్యులకూ, వైద్యవిద్యార్థులకూ నిత్యకృత్యాలు. వారు చంద్రుణ్ణి సూర్యుణ్ణి ఒప్పుకొనేవారు కాని వారు అనుసరించే మార్గాలు తప్పంటేమట్టుకు అన్నవాడిని బతికి పోనిచ్చేవారు కారు. ఇట్టివిషయాలను చూచి సింప్సనుమహాశయుడు శోకవిహ్వలుడయ్యేవాడు వారి మనోభావాలు వేరే చెప్పనవసరం వుండదు!

లిన్లిత్గోనగరానికి దగ్గరగా నున్న బాత్గేటు అనే పల్లెటూళ్లో ౧౮౧౧-వ సం. జూను నెల ౭-వ తారీఖున సింప్సను జన్మించేడు. అతని బాల్యదశ ప్రాచీనసంప్రదాయాలలోనూ, మూఢవిశ్వాసాలమధ్యా గడిపేడు. నోరూ వాయీ లేని పశువులను నరకడం, అవి బతికుండగానే వాటిని పాతిపెట్టడం మొదలగు ఘోర కృత్యాలు అనేకం చూసేడు. అవన్నీ అతని లేతమనస్సును తాకేయి. దానిలో చలనం కలిగించేయి. అతను జీవితంలో నొప్పి బాధలపై జరిపే యుద్ధానికి పునాది వేసేయి.

చిన్నప్పుడు ఆ పల్లెటూరి బడిలో ప్రవేశించేడు. అతని సూక్ష్మబుద్ధి బడిపెద్దల నాకర్షించింది. అనతి



క్లోరోఫారమును కనిపెట్టిన

[ సర్ జేమ్సు యంగు సింప్సను ]

కాలంలో ఆచిన్నబడిలో చాలా తెలివైనవాడుగా పరిగణింపబడ్డాడు.

సింప్సనుకుటుంబము బహుబీదదశలో వున్నప్పటికీ, జేమ్సునుమట్టుకు ఎడింబరోవిశ్వవిద్యాలయానికి పంపి, పెద్దవానిని చెయ్యాలని నిశ్చయించుకొంది. పంపింది. దానికి తగినట్టుగానే జేమ్సు ౧౬-వ ఏట ఎఫ్.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై వైద్యవిద్య నభ్యసించుటకు

పూ నేడు. ౨౧-వ ఏట 'కాలేజ్ ఆఫ్ సర్జన్సు' వారి యొక్క వైద్యపట్టం సంపాదించేడు.

అదేసమయాన, అతని అదృష్టతార అతని జీవిత రంగంలో అవతరించింది. తన పట్టా సంపాదించడానికి అతడు 'నొప్పివల్ల చావు' అను వ్యాసం రాసేడు. దానిలో ఆయన చూపిన కుశాగ్రబుద్ధి, సూక్ష్మదృష్టి రోగ లక్షణశాస్త్రపండితుడగు డాక్టరు జాన్ థామస్ అనునాయనను ఆకర్షించేయి. దానితో థామస్ సింప్సనును తనకు సహాయకారిగా కమ్మని ఆహ్వానించేడు. సింప్సను ఆఆహ్వానాన్ని సంతోషంతో స్వీకరించేడు. అచ్చట తన కృత్యాలను ఎంత ప్రజ్ఞాప్రావీణ్యాలతో నిర్వర్తించేడంటే, థామసుమహాశయుడు ఆరోగ్యము చెడి ఒకసంవత్సరము సెలవుతీసుకొనగా, అధికారులచే, ఆస్థానమున తానే నియమింపబడ్డాడు. అచ్చట పనిచేసిన సంవత్సరములో తన పనికి సంబంధించిన శాస్త్రములోనేకాక, ప్రసవకర్మశాస్త్రములోకూడా అపారమైన కృషిసలిపి ఆ రెండుశాఖలనూ ఒకదానికొకటి దగ్గరగా చేర్చి, ఒక నూతనపథము చూపించేడు.

అతను ఎడింబరోవిశ్వవిద్యాలయములో ఉపన్యసించే రోజులలోనే జెస్సీగ్రిండులే అనేఆమెయొక్క పరిచయం కలిగింది. ఆమె అతని దూరపుచుట్టం. ఆమెతండ్రి వర్తకుడు. వారిది లివరుపూలుపట్నం. ప్రతిసెలవలకూ వారు సింప్సనును ఆహ్వానించేవారు. అతను వారియింటికి వెళ్లేవాడు. అతను అతిథి. కోరే ఆతిథ్యం ఆపిల్లయొక్క ప్రేమ.

౧౮౩౯-వ సం.లో ఎడింబరోవిశ్వవిద్యాలయంలోనే ప్రసవకర్మశాస్త్రం బోధించుట కొక పండితుడు కావలసివచ్చేడు. తాను యిదివరకే ఆశాస్త్రమందు విశేషమయిన కృషి సలిపివుండుటచేత సింప్సను ఆ వుద్యోగంకొరకు దరఖాస్తు పెట్టేడు. కాని అధికారులు ఆస్థానం అవివాహితులకు ఇవ్వ వీలు లేదన్నారు. ఆకాలంలో ఎంత జాగ్రత్తపడేవారు! ఆసంగతి తెలియగానే సింప్సను లివరుపూలుకు ప్రయాణమయ్యేడు, జెస్సీని వివాహమాడి మరల ఆఉద్యోగానికి దరఖాస్తు పెట్టేడు. ఈసారి ఉద్యోగం యిచ్చేరు. తాను దేనికై జన్మించేడో ఆపని సంపాదించేడు.

ఈస్థానాన్ని ఆక్రమించివుండగా అనేకమంది స్త్రీలు ప్రసవవేదన పడుతూవుంటే చూసేడు. వారు పడే బాధ చూచి చాలా జాలి పడేవాడు. రోగము, నొప్పి, బాధ అంటే మరీ అసహ్యం జనించింది. వాటిని ఎలా అయినా జయించాలని నిశ్చయించుకున్నాడు.

౧౮౦౦-వ సం.లో సర్ హంఫ్రీ డేవీ నత్రజనియొక్క ఆక్సిదము నొకదానిని కనిపెట్టేడు. దానికి 'నవ్వుపుట్టించే గాలి' అని నామకరణం చేసేడు. దానిని రక్తస్రావము అంతగాలేని శస్త్రికర్మలలో బాధ తగ్గించుటకు ఉపయోగించవచ్చునని సూచించేడు. ఆ సూచన నెవరూ లెఖ్ఖచెయ్యలేదు. కాని ౧౮౩౯-వ సం.లో మోర్టను అను నొక అమెరికనుదంతవైద్యుడు డేవీ సూచించిన విషయాన్ని అనుభవంలో పెట్టేడు. అతను నొప్పిలేకుండా పళ్లు పూడతియ్యడానికి ఒక మత్తుపదార్థాన్ని ఉపయోగించేడు. అది డేవీ సూచించిన వాయుపదార్థమువంటిది కాదు. అది 'ఈథరు' అను వేరొక పదార్థము. ఇది ఎక్కువకాలము ఎక్కువ మత్తును కలిగించును నను నమ్మకంతో దీనిని ఉపయోగించేడు. ఈసంగతి ఇంగ్లాండుదేశంలోకూడా తెలియవచ్చింది.

ఇంగ్లాండులోకూడా 'ఈథరు'ను ఉపయోగించడం కొందరు మొదలెట్టేరు. ఈపద్ధతి సింప్సనుకు ఎంతో నచ్చింది. తానుకూడ యారీతినే పురిటిసందర్భాలలో ఆచరించడం మొదలెట్టేడు. అద్భుతమైన ఫలితాలు కనబడ్డాయి.

ఈవిషయం తెలియగానే ఇంగ్లాండుదేశపు ప్రాచీనవైద్యతత్వవేత్తలమధ్య పెద్ద తుపాను చెలరేగింది. మతగురువులు కోపంతో భగ్గున మండిపోయేరు. "వేదనతో పిల్లలు కందువు అని శపించేడే దేవుడు స్త్రీని? అయినప్పుడు సింప్సను ఏమని ఈదేవవాక్కును ప్రతిఘటించే" నని వారి వాదన. ఇట్టి నిద్రావస్థకు రోగులను లోబరచి వారిపై భూతవిద్య ప్రయోగించుతున్నాడన్నారు మరికొందరు ప్రముఖులు.

అట్లు నిర్దేశించినవారి మూఢభక్తి, తెలివితేటలూ నేడు స్పష్టమవుతున్నాయి. ౧౯-వ శతాబ్దమునకు పూర్వము యోగము ప్రయోగించి కొందరు వైద్యులు శస్త్రకర్మల నొనర్చిన మాట నిజమే. అట్టి నీచవిషయాలకు క్రైస్తవమతము అంగీకరించకపోవుటా నిజమే. కాని క్రీస్తుమతగ్రంథములు కాని, క్రైస్తవ మతముగాని క్రమమైనయెడల మత్తుపదార్థముల నుపయోగించుట ఎప్పుడును బహిష్కరించలేదు.

కాబట్టి, శక్తివంతుడగు సింప్సనుకు తన విరోధులను ఓడించుట కెంతో కాలము పట్టలేదు. ఆ మత గురువులు ఏ గ్రంథాన్నైతే (బైబిలు) సూచించేరో, ఆ గ్రంథాన్నే తానుకూడా ప్రమాణంగా తీసుకొని వారి ఆక్షేపణలకు ప్రత్యుత్తర మిచ్చేడు. దానిలో దుర్బలమైన మానవకోటి దుఃఖమునూ, బాధనూ తప్పించుటకోడానికి మత్తుపదార్థము లెందుచే వాడకూడదో అనువిషయాన్ని మతగ్రంథములను ప్రమాణముగా తీసుకొని సూచించేవారందరూ తమ మతగ్రంథములలో సూచించిన ఒకానొక దివ్యోదాహరణను ఎట్లు మరచిపోయేరో, ఆ ఉదాహరణలో దేవుడు ఆదాము అను పురుషునినుండి ఈవు అను స్త్రీని సృష్టించుటకు ఏ విధముగా ఆదామును నిద్రపుచ్చెనో, ఏ విధముగా అతని ప్రక్కటెముకను తీసెనో, ఏ విధముగా దానినుండి స్త్రీని సృష్టించెనో మున్నగు విషయములను అతివిపులముగా చర్చించెను. దేవుడే మొదటి మానవునిపై తొలిసారి శస్త్రక్రియ నొనర్చుటకు అతనికి నిద్రకలుగచేయగా, నేడు మానవులు దేవుని అనుసరించుట పాపమా అని ఎదుర్కొనెను. అట్టి ప్రతివాదనకు జవాబులేదు. విరోధుల నోళ్లు పడిపోయేయి. స్నేహితులు వెయ్యినోళ్లతో సింప్సనును ఆకాశానికి ఎత్తేసేరు.

సింప్సనుదృష్టిలో 'ఈథరు' పురిటికర్మలో అంత అనుకూలంగా కనపడలేదు. తక్షణం వేరొక పదార్థంకొరకు పరిశోధన మొదలెట్టేడు. పరిశోధనాగారంలో ఎడతెగక పనిచేసేవాడు. సాయంత్రం ఇల్లు చేరేవాడు. అప్పుడుకూడా విశ్రమించేవాడుకాడు. ఆ సమయాన్నికూడా యిద్దరు ముగ్గురు వైద్యులను తన యింటికి ఆహ్వానించేవాడు. అక్కడ ఒక చిన్న స్నేహబృందం తయారయ్యేది. వీరందరూ ఒక బల్ల చుట్టూ కూర్చొని సింప్సను తయారుచేసిన రాసాయనిక ద్రవపదార్థాలను వాసనచూసేవారు. చాలాకాలం వరకూ విజయలక్ష్మి వారిని తప్పించుకు తిరిగింది.

కాని —

అది ౧౮౪౭-వ సం. నవంబరు ౪-వ తారీఖు రాత్రి. స్నేహితులందరూ బల్లచుట్టూ చేరేరు. సింప్సను తాను కొంతకాలముక్రిందట తయారుచేసి ఏ కారణంచేతో నిరాకరించిన ఒక చిన్న బుడ్డిని వెతికి వెతికి బయటికితీసేడు. అది క్లోరోఫారం! యథావిధిగా ఆ బుడ్డిలో ద్రవాన్ని గ్లాసులలో పోసి లోపలికి పీల్చడం మొదలెట్టేరు. కొంతసేపటికి వారందరికీ యీ పాతప్రపంచం స్వర్గంలా కనబడటం మొదలెట్టింది. ఆనందంతో వేసిన కేకలూ, నవ్వులూ మిన్నుముట్టేయి. ఆఖరుకు అదంతా ఒక చిన్న నాటకంగా తయారయింది. ఆఖరి అంకం త్వరత్వరగా ఆసన్నమయింది. అందులో అందరూ తెలివితప్పి కిందపడిపోయేరు. తిరిగి తెలివిరావడం మొదట సింప్సనుకు. అతని మనసులో మొదట తలచూపిన విషయం విజయం! విజయం!! తరవాత స్మృతితప్పి క్రిందపడున్న స్నేహితులు దృగ్గోచరమయ్యేరు. వారికి ఉపచర్యలు చేసి మెల్లిగా తెలివి రప్పించేడు. వారి సంతోషానికి పరిమితి లేకపోయింది ఆ రాత్రి.

తాను కనిపెట్టిన ఔషధముయొక్క గొప్పదనము సింప్సనుకు విశదమయింది. తక్షణం దానిని పురిటిశాస్త్రంలో ఉపయోగించేడు. అత్యద్భుతమైన ఫలితాలు చూపట్టేయి. బాధనివారణ ప్రాణరక్షణ అనే తన కల నేటికి నిజమయింది.

సింప్సనుఘనతను అందరూ గుర్తించేరు. అతను కనిపెట్టిన ఔషధమును అందరూ ఆరాధించడం మొదలెట్టేరు. ౧౮౫౩-వ సం. విక్టోరియా మహారాణీ ఆయనను తన వైద్యునిగా నియమించుకొని, తన ప్రసవసమయములో తాను కూడా ఆ మత్తుపదార్థాన్నే ఉపయోగించింది.

౧౮౪౭-వ సం.లోనే పేరిస్ వైద్యసంఘము వారు సింప్సను విదేశీయుడైనప్పటికీ (దానిలో విదేశీయులకు చోటులేదు) తమకు ఆయనమీద గల గౌరవము వెలిబుచ్చుతూ, తమ సంఘములో సహాయకారిగా చేర్చుకున్నారు. యూరపు, అమెరికాలలో గల ప్రతివైద్యసంఘమూ యీయనను సభ్యునిగా యెన్నుకున్నాయి. ౧౮౫౬-వ సం. ఫ్రెంచి ఎకాడమీ ఆఫ్ సైన్సు వారు యీయనకు ౨౦౦౦ ఫ్రాంకులు బహుమానమిచ్చారు. ౧౮౬౬-వ సం. లో యీయన మానవకోటికి కావర్చిన మహోపకారమును కొనియాడుతూ 'బేరనెట్టు' అను బిరుద మివ్వబడెను.

సింప్సను మహాశయుడు క్లోరోఫారమును కనిపెట్టి ప్రపంచమున గొప్ప శాస్త్రజ్ఞులలో ఒకడయినాడు. ప్రసవక్రియాశాస్త్రములో క్రొత్తదారులు తీసి వనితాలోకానికి చిరస్మరణీయు డయ్యేడు. జీవితంలో మహోన్నతశిఖరాన్ని ఆక్రమించేడు.

కాని, పాపం! తన విజయాన్ని, తన పదవిని చూసి ఎక్కువకాలం ఆనందించడానికి అవకాశం లేకపోయింది. ఆశిఖరంచుట్టూ నల్లటి మేఘాలు కమ్ముకొన్నాయి. ఆయన పెద్దకొడుకు డాక్టరు డేవిడ్ సింప్సను హఠాత్తుగా చనిపోయేడు. ఆదుఃఖంలో మునిగి తేలుతూవుండగా ఆయన ౧౬ ఏళ్ల వయస్సుకూతురు జెస్సీకూడా స్వర్గస్థురా లయింది. దానితో ఉన్నత శిఖరాన్ని వుండలేకపోయేడు. దుఃఖసముద్రంలో పూర్తిగా మునిగిపోయేడు.

దుఃఖాన్నీ, బాధనూ మానవకోటినుండి వేరు చెయ్యడానికి తాను ఎంతో బాధపడ్డాడు. కాని తన దుఃఖాన్ని మట్టుకు మరవలేకపోయేడు. కృశించిపోయేడు. కుంగిపోయేడు. ఆఖరుకు ౧౮౭౦ మే ౬-వ తారీఖున యీ దుఃఖభాజనమైన ప్రపంచాన్ని మరచి శాశ్వతనిద్ర పొందేడు.






# మన కథ

## ౧. ప్రపంచములో మనస్థానము

'వాసు'

మనలో చాలామందికి మన ఊరు, తాలూకా, జిల్లా యింతకు పైగా ప్రపంచములో మన స్థానాన్ని గురించి విశేషమేమీ తెలియదు. తమ ఊరు, తాలూకా యిత్యాదిస్థలాల స్థానిక రాజకీయసమస్యలూ, పొలిమేరలూ-యీవిషయాలను మించి వేరేమీ తెలుసుకునే స్థితి చాలామందికి లేదు. చదువుకొన్న యే కొద్దిమందికో మాత్రమే "మన ఊరు యీభూగోళము మీద ఒక చిన్న నలుసులాంటిది" అని తెలుసు. ఈ భూమి నిలకడగా లేదనీ, గుండ్రని బంతిలాగా వుందనీ, గిరగిర బొంగరములాగా తిరుగుతుందనీ—యిలాంటి కొన్ని విషయాలు కొద్దిమంది విద్యావంతులకు చూచాయగా తెలుసు.

### ఆకాశము

నిర్మలాకాశాన్ని చూడని మనిషి వుండడు. ఆమబ్బు మొఖములమీద నిగనిగ మెరిసే పచ్చని జరీ నగిషీ చుక్కలనుగురించి ఆలోచించనివాళ్లుకూడా చాలామంది వుండరు. 'పాలపుంత', 'సప్తర్షులు', 'ధ్రువుడు', 'చందమామలోని ముసలమ్మ'—యీమాటలు విననివాళ్ల సంఖ్య బహుకొద్ది.

వెన్నెలరాత్రులలో యేమౌతున్నై యీనక్షత్రాలు? పగటిపూట యివి యెక్కడ దాక్కుంటున్నాయ్! వీటిలో కొన్ని అలా కదలకుండా దివిటీలల్లే, దీపావళినాడు ఎగరేసిన వెన్నముద్దలల్లే వెలుగుతున్నాయేం?—యిలాంటి ప్రశ్నలు కొద్దో గొప్పో 'మెదడు' అని చెప్పుకోదగ్గ వస్తువు వున్న ప్రతిమనిషికీ తట్టుతై. పిల్లలు మటుకు యిలాంటి ప్రశ్నలు తప్పకుండా అడుగుతారు. నాయనమ్మలు వాళ్లని నిద్రపుచ్చుతారు, యేవో కథలు చెప్పి. ఈపిల్లలే పెరిగి పెద్దవాళ్లైనాక యీప్రశ్నలు మరిచిపోతారు. ఇలాంటి ప్రశ్నలే తమ పిల్లలు అడిగితే, తమ చిన్నతనాన్ని మరిచి, యీపెద్దలు వాళ్లని చాలదన్ని నిద్రబుచ్చుతారు. అయితే యీఆకాశంలో మనకి యేమేమి కనిపిస్తై?

మబ్బులేని నిర్మలాకాశములో మనకు రెండు రకాల మెరిసే వస్తువులు కనిపిస్తై.

### గ్రహాలు

వెన్నముద్దల్లాగా, నిశ్చలమయిన కాంతితో వెలుగుతూండేవి గ్రహాలు. మన కంటితో మనము చూడగలిగిన గ్రహాలు బహుకొద్ది.

ఒక్కొక్క సాయంత్రము అద్భుతమయిన కాంతితో కనపడే వెన్నముద్ద శుక్రుడు. రెండోకన్నే వుంటే 'ఆయన చంద్రుడంతవాడు' అంటారు మన పెద్దలు. పాపం,-బలిరాజు చేస్తున్న అపూర్వదానానికి అడ్డుపడబోయిన రాక్షసగురువుకన్నును దర్భపుల్లతో పొడి

చాడు పొట్టివామనయ్య. నిజానికి యీ గ్రహము చాలా ప్రకాశవంతమయినదే.

తెల్లవారఝామునా, (అప్పుడప్పుడు) నడిరాత్రిసమయానా మనకు కనిపించే యెర్రని కుంకుమపువ్వుముద్ద అంగారకుడు. కుజుడి కాంతి యెంత రక్తిమమో అతని భావముగూడా అంత రజోపూరితమే. ఈ సంవత్సర మితడు రాజు. యుద్ధప్రియుడు. ఈ గ్రహరాజు లోకాన్ని పిల్చిపిప్పిచేస్తున్నాడు. మొన్నటివరకూ యీ గ్రహములో మనుష్యులున్నారని అనుమానించారు శాస్త్రజ్ఞులు!

మనకు రోజూ కనిపించే గ్రహరాజు సూర్యభగవానుడు. దక్షయజ్ఞధ్వంసి వీరభద్రుడి పాదతాడనంతో పళ్లన్నీ వూడినా, పరమాన్నముతప్ప వేరే గతిలేకపోయినా, ప్రపంచాన్ని మింగేటట్లు యింకా పళ్లను (చిగుళ్లా ?) పటపట కొరుకుతూనేవున్నాడు. ఇతడు లేనిది జీవితము లేదు. పంటలు లేవు. పగలు—రాత్రి, చీకటి — వెలుతురు అనే విషయమే లేదు. మన తేజస్సు, శక్తి—అన్నీ యితడు ప్రసాదిస్తున్నవే.

చంద్రుడు చల్లనితండ్రి. పాశ్చాత్యశాస్త్రజ్ఞులు చంద్రుణ్ణి ముఖ్యగ్రహంగా యెంచరు కాని మన విజ్ఞానములో యితనికి ఉత్తమస్థానమే వుంది గ్రహకూటములో. చకోరాలకూ, కమలాలకూ, చిత్రకారులకూ, కవిగాయకాది జనానికీ, నూతన దంపతులకూ యితడు పరమమిత్రుడు ప్రియసమాగమాభిలాషులు, భగ్నప్రేములు, విరహిణులకు విచిత్రమైన శత్రువు. ఇతన్ని తిడితేగాని వారి విరహాగ్ని చల్లారదు. ఇది పౌరాణికగాథ. ఈయన మనకు నెల కొకసారి నిండుగా కనిపిస్తాడు. పదిహేనురోజులు క్షీణించి అమావాస్యనాడు మాయమౌతాడు. హెచ్చుతాడు; తగ్గుతాడు. "అమ్మో! యితడు యెప్పుడూ వుండడే!" అని అనిపించుకొనే గ్రహరాజు. ఇతనిలో పర్వతాలూ, పీఠభూములూ వున్నాయట!

ఈ నాలుగు గ్రహాలూ మనము కంటితో చూడొచ్చు.

వేరొక ఆరుగ్రహాలు ఉన్నాయి. వీటిని దూరదర్శినీయంత్రముద్వారాగాని చూడడానికి వీలులేదు.

సూర్యుడి సమీపములో వున్నాడు బుల్లి బుధుడు. పాండవుల మూలపురుషుడు. అందగాడు! గ్రహాలన్నిటిలోనూ చిన్నవాడు.

శుక్రుడికీ, అంగారకుడికీ మధ్యగా వున్నది మన భూగ్రహము. ఎంత చిన్నదిగావుందో!! దీని కథ మనకి క్రమంగా తెలుస్తుంది.

అంగారకుడికి అవతల చిన్నిచిన్ని గోళాలు కొన్ని కనిపిస్తై. అవి కొన్నివందల ఉపగ్రహాలు (Asteroids). నిజానికి యివి గ్రహాలలో జతగావు.

ఈఉపగ్రహమండలానికి వెలుపలగా వున్నాడు దేవగురువు. గ్రహాలన్నిటిలోకీ పరిమాణరీత్యా బృహస్పతి చాలా పెద్దది. దేవతల్లోగూడా అతను పెద్దయే!

ఆపైన సుందరని చక్రముతో చుట్టబడిన గ్రహము శనైశ్చరుడు. ఈకుంటివాయన చక్రాన్ని ఊతగా వుంచుకున్నాడనుకుంటారేమో! ఆచక్రములో కొన్నివందల చిన్నిచిన్ని, చంద్రుడిలాటి, బుల్లి ఉపగ్రహాలు క్రిక్కిరిసివున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు!!

చివరి మూడుగ్రహాలనూ వరుసగా నెప్ట్యూన్, యురేనస్, ప్లూటో అంటారు పాశ్చాత్యులు. మన శాస్త్రములో వీటికి తగిన పేర్లు లేవు. మన రాహుకేతువులు పాశ్చాత్యశాస్త్రములో లేరు.

ఈగ్రహసమితి కంతటికీ సూర్యమండల మని పేరు.

ఈ గ్రహాలన్నీ సుందరని బంతుల్లాగా వున్నై (యించుమించుగా, కొద్ది భేదాలతో). ఇంకోచిత్రమేమంటే, యివి తమచుట్టూ తాము ఎడమనించీ కుడికి అపసవ్యంగా ప్రదక్షిణముచేస్తున్నై. నెప్ట్యూన్, యురేనసులుమాత్రం సవ్య ప్రదక్షిణ మే చేస్తై. ఇవి బొంగరాలలాగా, తమచుట్టూ తాము తిరగడమే కాకుండా, సూర్యుడిచుట్టూగూడా తిరుగుతున్నై. సూర్యుడిచుట్టూ పరిభ్రమించే యీగ్రహాల త్రోవ వృత్తాకారముగా లేదు. ఇంచుమించుగా ఒక దోసకాయలాటి ఆకారంలో వుంది. మరొక విశేషము — యీ గ్రహాలలో వేటికీగూడా స్వతఃకాంతి లేదు. ఇది అప్పు తెచ్చు

ఉన్నది! అద్దంమీద సూర్యకాంతి పడ్డప్పుడు అది యెలా తళతళ మెరుస్తుందో అవిధముగానే యీగ్రహాల మీద పడుతోన్న సూర్యకాంతివల్లనే మనము వీటిని చూడగలుగుతున్నాము. ఈ గ్రహాలన్నీ సూర్యుడివద్ద నించి కొన్నికొన్ని నియమితమార్గాలలో వుండి తిరుగుతున్నై.

## నక్షత్రాలు

మినుకుమినుకుమంటూ ఆకాశవీథిని లెక్కపెట్టడానికి వీలులేకుండావున్నవి నక్షత్రాలు. బంగరుకలంకారీచుక్కలల్లే, సన్నపిట్టరెక్కమీదిమచ్చలల్లే యెంత అందంగావున్నయ్యో! ఆరోగ్యవంతుడయిన సామాన్యపుమనిషి (కండ్లజబ్బు లేమీ లేనివాడు) తనకండ్లతో వేరేమీ సాయము లేకుండా ౨౦౦౦ నక్షత్రాలకంటె యెక్కువ లెక్కపెట్టలే డని శాస్త్రజ్ఞులు అంచనావేశారు. దూరదర్శనీయంత్రముద్వారా కొన్నికోట్ల తారలు కనిపిస్తున్నై.

వీటికీ, గ్రహాలకీ గల భేదాలు:—యివి గ్రహాలకుమల్లే నిశ్చలమయిన కాంతితో ప్రకాశించక, మినుకుమినుకుమని మెరుస్తై, మిణుగురుపురుగులల్లే. వీటి కాంతి వీటికి స్వతః వున్నదేగాని అరువుసరుకు కాదు! నక్షత్రాలలో కొన్ని సూర్యుడికంటె పెద్దవని నిర్ణయిస్తున్నారు శాస్త్రజ్ఞులు. గ్రహాలకన్న నక్షత్రాలే మనకు యెక్కువ దూరములో వున్నై. మనకుఅతిదగ్గరగావున్న నక్షత్రము ౨౫,౫౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ మైళ్లదూరంలోవుంది. మనకు అతి సమీపంలోవున్న గ్రహము ౧౩,౦౦౦,౦౦౦ మైళ్లు దూరంలోవుంది!!!

అయితే యీనక్షత్రాలు చిందరవందరగా, సముద్రతీరపుమీది సలకరాళ్లల్లే వున్నా యనుకోగూడదు. ఇవి గుంపులుగుంపులుగా, ఒకొక్కగుంపు ఒకొక్క నిబద్ధమయిన, శాస్త్రయుక్తమైన ఆకారంతో యేర్పడి వున్నై. కొన్ని చతురస్రాలమాదిరి, కొన్ని త్రికోణభంగిమములో, మరికొన్ని వృషభాకారంతో, తేలల్లే, త్రాసుకుమల్లే, కొత్తపెళ్లికూతురులాగా, మేకవలె, వివిధవిధాలుగా, వివిధాకారాలలో కనిపిస్తున్నై. ప్రాచీన హైందవశాస్త్రజ్ఞులు కొన్నికోట్ల సంవత్సరాలక్రిందట యీరాసులకు—ఒకొక్క నక్షత్రసమితికి 'రాశి' (Constellation) అని పేరు—కన్య, తుల, సింహము, మేషము, వృశ్చికము అనేపేర్లు పెట్టారు. దూరదర్శనీయంత్రాలతో తారామండలంలో సరిగా యిలాటి ఆకారాలనే కనుగొంటున్న నేటి అధునాతన శాస్త్రజ్ఞులు ప్రాచీనహిందువుల నాగరకతకు ఆశ్చర్యపడుతున్నారు. "ఈప్రాచీనులకు గూడా యంత్రా లేవన్నా వున్నయ్యా? వీరి 'దివ్యదృష్టి' నిజమా?" అని ప్రశ్నిస్తున్నారు.

## చంద్రు లెందరు ?

మనకు తెలిసిన చంద్రుడు ఒకడే! కాని శాస్త్రజ్ఞులకు యింకా కొన్ని చంద్రగ్రహాలు తెలుసు. గ్రహాలు సూర్యుడిచుట్టూ యెలా తిరుగుతున్నయ్యో యీచంద్రులుగూడా గ్రహాలచుట్టూ అలాగే తిరుగుతున్నారు. ఇంతే గాదు! ఒకొక్క చంద్రుడు తన చుట్టూ తాను తిరుగుతాడు! బుధుడికీ, శుక్రుడికీ యిలాటి చంద్రులున్నూ లేరు. భూమికి ఒకడు, అంగారకుడికి యిద్దరూ, దేవగురువుకూ యురేనసుకూ చెరి నలుగురూ, శనైశ్చరుడి చక్రముచుట్టూ ఏడుగురూ (ఈచక్రములో కొన్నివందల చంద్రు లున్నారట!) —యిలా వున్నా రీచంద్రులు.

మనకు తెలిసిన సూర్యుడూ, సూర్యమండలమూ ఒకటే అయినా, యిలాటి సూర్యమండలాలు యింకా యెన్నో కొన్ని ఉన్నాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. పైననే చెప్పానుగదా సూర్యుడిలాటివీ, అంతకన్న పెద్దవీ, అతనిలాగే స్వయంగా కాంతివంతములయినవీ కొన్ని నక్షత్రా లున్నాయని! మన గ్రహాలు సూర్యుడిచుట్టూ తిరుగుతున్నట్లే ఒకొక్క నక్షత్రముచుట్టూ కొన్ని చిన్నిచిన్ని నక్షత్రాలు తిరుగుతున్నై.

ఆకాశవీథిలో మనకు ముఖ్యంగా కనిపించే యీ గ్రహాలూ, నక్షత్రాలూకాక, మనకు అప్పుడప్పుడు కొన్ని చిత్రాలు కనిపిస్తై.

## ఉల్కలు

నక్షత్రాలు పడుతూవుండడము అందరికీ తెలిసిన విషయమే. నిజానికి యివి నక్షత్రాలు కావు. ఒక

నక్షత్రములోని చిన్న ముక్క, లేక ముక్కలు. వీటిని ఉల్క (Meteor) లంటారు. ఉల్కాపాతమువల్ల కొందరు మరణించారు. ఇంగ్లాండులో ౫౦ టన్నుల ఉల్క పడింది. మరోచిత్రం — యీ ఉల్కలలో చాలా లోహాలున్నై. వీటిలో యినుము యెక్కువగా వుంది.

## తోకచుక్కలు

అప్పుడప్పుడు తోకచుక్కలు మనకు కనిపిస్తై. అయితే యివి బహు అరుదు. ఎడ్వర్డు రాజు మరణ సమయములో ఒకసారి కనిపించింది. గతించిన ప్రపంచ మహాసంగ్రామములో మరొకసారి కనిపించింది. మళ్లా మొన్న ౧౯౪౧—వ సం. లో ఒక చిన్న తోకచుక్క కనిపించింది. ఇప్పుడుగూడా ఒక మహాసంగ్రామము జరుగుతోంది! ఈ తోకచుక్కలు కనిపించుట అరిష్ట సూచక మంటారు మనసిద్ధాంతులు. పై ఉదాహరణల కంటే వేరేమి సాక్ష్యము కావాలి? ఒక నక్షత్రము నుంచి తోకలాగా, పొడుగ్గా, మతాబాలాటి కాంతి కనిపించటంవల్ల వీటికీ పేరు వచ్చింది. వీటిలోగూడా యినుము వుందిట!

## నెబ్యూలీలు

'నెబ్యూలీలను' (Nebulae) మనము నిర్మలాకాశములో చూస్తాముగాని సరిగా గుర్తించలేము. మబ్బు లేమీ లేకుండా ప్రశాంతంగా వున్న నీలాకాశంలో మనకు దూదిపింజల్లాటి తెల్లని మచ్చలు కనిపిస్తై. శాస్త్రజ్ఞులు మనకు మన కంటితో చూస్తే రెండు నెబ్యూలీలకంటె యెక్కువ కనిపించ వంటున్నారు. వీటిలో కొన్ని గుండ్రంగా వుంటై. ఈ గుండ్రటి నెబ్యూలీల మధ్య భాగము చాలా వెలుగ్గా వుంటుంది. మరి కొన్ని పాముచుట్టల్లాగా వుంటై (ఇలాటివే ఖగోళంలో హెచ్చుగా వున్నై). తక్కినవి యేనియమిత మయిన ఆకారమున్నూ లేనివి — దూదిపింజలల్లే. ఇవి వాయుదశలో వున్న కొన్ని వస్తువు లంటారు శాస్త్రజ్ఞులు. మరొక చిత్రము — యీ నెబ్యూలీలు గ్రహాలకుమల్లే తమచుట్టూ తాము తిరుగుతయ్యట!

ఈ బ్రహ్మాండంలో, అనంత తారాగణాలమధ్య, ఒకానొక మూల వున్న సూర్యమండలములో ఒక మూలగా ఒదిగివుంది మన భూగ్రహము!

గుప్పెడు యిసక యెగరవేస్తే, అందులో మన భూమి ఒక చిన్ని నలుసు! ఈ బ్రహ్మాండాన్ని ఒక దానిమ్మకాయతో పోలిస్తే మన భూమి అందులో ఒక చిన్నిగింజ!

## మన స్థానము

ఈ భూమే యింత చిన్నదయితే, యీ బ్రహ్మాండంలో యింత అప్రాధాన్యమయిన దయితే, యీ చిన్ని నలుసుమీది ఒకానొక మూలలో వున్న మన వూరిలో ఒక యింటిలో వున్న మన మెకరమూ యీ బ్రహ్మాండంలో? ఊహించండి!!

మనిషి తన అహంభావము, నాగరకుడు నన్న గర్వము, తక్కిన పిపీలికాది ప్రాణికోటులయందు చూపే నిరసన — యివన్నీ పోగొట్టుకోవాలంటే ప్రశాంతమయిన ఖగోళవీథిని నిర్మలమయిన మనసుతో పరిశోధించాలి.

ఈ సూర్యమండలమూ, యిందులోని ఒక చిన్ని భాగమయిన మన భూమీ యెలా పుట్టినయ్యో తెలుసుకునేముందు అసలు మన భూమి యెలాటిదో, దాని సంగతేమిటో తెలుసుకుందాం.

# 'రాజరాజు' మీద*

= శ్రీ విశ్వనాథ సత్యనారాయణ =

విప్లవము తరంగాలుతరంగాలుగా వస్తుంది. తరువాతితరువాతి తరంగాలు వెనుకవెనుక తరంగాలని చంపివేయటం చేస్తూవుంటుంది. ఇది మహావిప్లవం లక్షణం. తెలుగుసారస్వతంలో యీ విప్లవం పుట్టింది. నడుస్తూంది. ఎప్పటికి పూర్తవుతుందో తెలియదు. ఎప్పటికప్పటికి క్రొత్తతరంగం పాతతరంగాన్ని త్రోసి రాజంటూంది. కాని కొన్ని తొలితరంగాలు నిలవ త్రొక్కుకుంటయ్. ఆ నిలవత్రొక్కుకోకలిగే రెండు తరంగాలు రాజమహేంద్రవరంలో వున్నయ్. ఒకటి భమిడిపాటి కామేశ్వరరావుగారి వాణి. రెండు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వాణి. తొలితరంగాల్లో విప్లవలక్షణాలు యెక్కువ పట్టినట్లుకూడా కనిపిస్తయ్. మొదటి జారుపాటులో జారుపాటులక్షణాలెంత వుంటవో, దేనినుండి జారిందో దాని లక్షణాలూ అంత వుంటయ్. 'రాజరాజు' యీ నిర్వచనానికి సరిపోయిన పుస్తకం. ప్రాతక్రొత్తలు — క్రొత్తకు అభిముఖ్యము—ప్రాతకు యెదురు చెక్కడం— కాని చాలమటుకు ప్రాతను పట్టుకు వ్రేలాడటం — క్రొత్త అంటూ పోతూ, ఆ క్రొత్తనుగురించిన సంశయం — యివ్వన్నీ కనిపిస్తయ్. ఇందులో వున్న అచ్చంగా క్రొత్త నాటకభాష. ఆ నాటకభాష కూడా పూర్వపద్ధతులతో మేళవింపు గొన్నదే. సంస్కృతసమాసాలుంటయ్. కాని కొన్ని సమాసాలు బుద్ధిపూర్వకంగా అల్లే వికృతంగా వుంటయ్. భావాల్లో యెదురుతిరగబోవటం వుంటుంది. రచన, కావ్యలక్షణము యెక్కువ మారినట్టు వుండదు. ఇది 'రాజరాజు' స్వరూపము.

---

* 'రాజరాజు' నాటకము ఇనుక ౧౯౨౧ లో భారతియందు ప్రకటింపబడినది. దాని రచయిత శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

'రాజరాజు'లో సంస్కారము అచ్చంగా దేశీయము. కవికి యింగ్లీషుభాషలోంచి అందుకున్న వైపరీత్యం యేమీ లేదు. సరంజామ యెచ్చటనుంచి తెచ్చుకున్నా — దేశీయమైనది. కాశీమజిలీలు, శుకసప్తతికథలు మొదలయినవి, దేశంలో వుండే కథావదంతులు, ఆంధ్రసారస్వతము — ఇవి వస్తుసంగ్రహణానికి మూలబీజాలు. ఇంతేకాకుండా నన్నయ్యగారిని గురించిన కట్టుకథలుకూడా ఆలంబనయింది. కాని కవిబుద్ధి నన్నయ్యగారిమీద వున్నంత పక్షపాతము రాజరాజుమీద చూపించలేదు. అంటే కవికి సారస్వతంమీద వున్నంత అభిప్రాయం చరిత్రమీద లేదన్నమాట. తెలుగుసారస్వతంలో విప్లవం పుడితే— తెలుగుచరిత్రలో క్రొత్త అధ్యాయం పుట్టింది. 'రాజరాజు'లో క్రొత్తగా త్రవ్వితీసిన చరిత్రవిషయాలతో అతకటం తక్కువగా వుంది. లేనేలేదు.

రాజనరేంద్రుడు చోళుల యల్లుడు. అతని యంతఃపురము అరవసాంప్రదాయము. ఆయనతమ్ముడు విమలాదిత్యుడు చాలా పూర్వకాలంలోనే వెడ త్రొక్కుకొని యలమంచిలిలో రాజ్యం స్థాపించుకొన్నాడు. ఈలాటి చరిత్రఅంశాలకి యీ నాటకం తావివ్వదు.

సారంగధరుడి కథ అయినా, హరిశ్చంద్రుడి కథ అయినా, తారాశశాంకమయినా — యిల్లాంటివి అర్థవాదాలుగా తీసుకోవాలి. ఆ కథ జరిగిందో లేదో తెలియదు. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయం యిల్లాంటి కథే. అవి జరగనక్కర్లేదు. దాని స్థితి చరిత్రలో లేదు; మానవస్వభావంలో వున్నది. ఈ స్వభావాన్ని గుర్తిస్తే దాని యాథార్థ్యము తెలుస్తుంది; దాని విలువ రుజువవుతుంది. దానిని చరిత్రదృష్టితో చూస్తే పటాపంచలవుతుంది. చూడటం మనకు చాతకాకపోవడ మనిపిస్తుంది.

సారంగధరుని కథకు పూర్వం కుణాలుని కథ వున్నది. ఆయీకథ లెందుకు పుట్టినయ్? జరిగినయ్యా? చరిత్ర లేదంటూంది. ఎల్లా నుడిపడటం? ఈ నాటకంలో సారంగధరుడు నన్నయ్యగారి భారతం చదువుతూ యయాతి తన కొడుకుదగ్గర తీసుకున్న యౌవనంతో అతని తల్లితో యీ యౌవనం వినియోగించడం విప్లవమనిపించింది. సారంగధరుడి మనస్సు యెంచేత అడ్డదిడ్డమయింది? సారంగధరుడు భారతం అదే మొదటిసారి చదవటం కాకపోవచ్చు. కానూకాదు. నన్నయ్య వ్రాసిన మొదటిభాగంలోనిది కథ. సారంగధరుడికథ యిదివరకు చదువలేదా? సంస్కృతములో పండితుడు కాదా? అయితే నన్నయగారి భారత మక్కర లేదు. కథ అక్కడా యిక్కడా వొక్కటే. విప్లవం దారిలో వున్న భావ మిది. అచ్చంగా తెప్పనదు. తప్పేమో అన్న సందేహం సందేహంగా చూపిస్తుంది. యౌవన మనే భావం సర్వజనులయందూ వున్నది. అది గాలివంటిది. ఒక శక్తివంటిది. ఒక దృష్టిలో డబ్బువంటిది. అది వొక సాధన. దానికి పట్టింపేముంది? ఈ భావంలో వున్న నిఖార్సుతనం తెలిస్తే — అక్కడవుంది వొక మెట్టు దిగితే కలిగే సంకల్పవికల్పాలు లేవు. అల్లా చూడాల్సిన కథను యిల్లా చూపెటం సారంగధరుడి తత్కాల విప్లవ బుద్ధి.

ఇలా పై యొకకథను తీసుకుంటే తన బుద్ధి శానికి, భావానికి, రచనకి అనుకూలంగా అభిముఖంగా వివర్లు మలగ్రతోచుకుంటూ యితడి కథ అందులో జొనుపుకుంటూ ప్రతిభాశాలి ఐతే చేస్తాడు. ప్రతిభాశాలి అయిన పాఠకుడు ఆకవియొక్క ఆప్రతిభనే చూస్తాడు. తక్కినవాటితో అవసరం లేదు. వాటిని యీకథ యీకతోకకు తోక లాగటం కావ్యాన్ని ఆస్వాదించలేకపోవడం. ఈ 'రాజరాజు' గొప్ప ప్రతిభ కల నాటకం. విమర్శ చెప్పవలసివస్తే 'గొప్పనాటకం' మాత్రమే నని చెప్పాలి. విషయవిమర్శ చేస్తే వచ్చే చిన్నచిన్న విషయాలు కవిప్రతిభకూ, నాటకంగొప్పదనానికీ భంగకరం యెప్పుడూ కావు.

గ్రీకులలో ట్రాజెడీ (Tragedy) వుంది. అది పాశ్చాత్యదేశాల భావములలోనుంచి హిందూదేశానికి దిగుమతీఅయింది. ఆదిగుమతిఅయిన లక్షణం 'రాజరాజు'లో చాలా వుంది. నాటకం విషాదాంతం. చివరకి కథ అంతా విరిగిపోవడంమాత్రమే అయితే అది నిజంగా విషాదాంతమే కాదు. ఈనాటకంలో నాయకుడు రాజరాజు కాడు; సారంగధరుడు. ఇది విషాదాంతనాటకంగనక విషాదాంతనాటకనాయకుడికి వుండాల్సిన లక్షణాలు రాజరాజులో లేవు; సారంగధరుడిలో వున్నై. రాజరాజు వొక గుణహీనుకారి యైన రాజు. అధికారదుర్వ్యాపారుడైన రాజు. స్వార్థపరుడైన రాజు. అవివేకియైన రాజు. ఇతనికి వొక విషాదాంతనాటకానికి నాయకుడు కాదగిన తాహత్తు లేదు. విషాదాంతనాటకపు సారాంశమైన ప్రక్రియ సారంగధరునిలో వున్నది. సారంగధరుడు బుద్ధిశాలి. ఉత్తమగుణసంపన్నుడు. ధర్మ మెరిగినవాడు. పితృవాక్యపరిపాలన నెరవేర్చేవాడు. కాని అతడిలో జాగూ చేసే దుర్లక్షణమూ, నిలవత్రొక్కుకోలేని లోపమూ, తన విశ్వాసాన్ని తాను ప్రేమించినచోట తర్కంతో ప్రేమబలంతో నమ్మించలేని శక్తిహీనతా వున్నయ్. ఇవి అతడి పతనానికి కారణమైనవి. ఇది నిజమయిన విషాదాంతనాటకస్వరూపము. ఆరేళ్ళక్రింద తాను చిత్రాంగిని చూస్తే వొకనాడు రాజుతో చెప్పలేదు. రాణితో చెప్పలేదు. ఆత్మ్రియత్నము చేయలేదు. వయస్సు స్నేహ—ఆ గాఢమయిన ప్రేమ యెక్కడ—ఆ రెండ్లు గడవటమేమిటి? తన యీలిప్పి సారంగధరుడికి తెలుసు. సారంగధరుడు కోరికతో చిత్రాంగి మేడకు వెళ్ళాడు. ఆమె తల్లి యన్న భావ మక్కడ పుట్టింది. లేదా నిర్ధారణచేసికొన్నది. ఈ ఆలస్యంగా వచ్చిన నిర్ధారణ యేమీ చెయ్యలేక విపత్తు తీసుకు వచ్చింది. "మన మిద్దరము వొకరి నొకరు ప్రేమించాము. కాలము అడ్డము తిరిగినది. ఇప్పుడు నీవు నాతల్లివి కావచ్చావు. నేను కొడుకును కావచ్చాను. ఈ కలిగిన మార్పు. మార్పు కాదనేందుకు శక్తి నాదగ్గర లేదు. మన మిద్దరమూ ప్రేమకు బలిఅవుదాము. ఈ బలిలో మన ప్రేమ సార్థక్యము" అని వుంత సారంగ

ధరుడు త్రొక్కితే బాగుగా వుండేది. అప్పుడు విషాదాంతనాయకుడునూ అయ్యేవాడు కాడు. అతడు వుత్తమ లక్షణాలు కలిగివుండి తన శీలంలో వుండే వొకానొక లోపంచేత నాశనం జరగటమే విషాదాంతనాయకుడి లక్షణం. అదే సారంగధరునియందు జరిగింది.

ఇంక చిత్రాంగి. ఆవిడ వినయం చాలా తక్కువ కలిగింది. మనిషికి యెంత పట్టుదల వుందో ఆపట్టుదలకు తగిన గాంభీర్యము లేనిది. నోటిపురుసుగల మనిషి. యౌవనముయొక్క పైపాంగులకు తాళలేని ప్రకృతి. తమ సమాగమము సుబుద్ధి పడనీయలేదు. సుబుద్ధి న్యాయంగా చేశాడు. అప్పుడే గాంధర్వం జరిగితే- తండ్రి యేమన్నా అనచ్చు - తల్లి యేమన్నా అనుకోవచ్చు. సారంగధరునివంటి మెత్తనిప్రకృతి గాంధర్వం వల్ల జరిగే అనర్గళఫలితాలు ఓర్చుకోలేనిది. చిత్రాంగి-చిలక - రుక్కు సుబుద్ధినిగూర్చి 'నక్క' మొదలైనవి అనడం వాళ్లప్రకృతులలో దర్జా లేకపోవడం. చిత్రాంగి గురుసుతనం స్థానమెరుగని ఖడ్గనాదము. చివరకు జరిగిన నాశనానికి గొప్ప మూలకారణమైనది. చిత్రాంగిప్రకృతిలో ప్రతిఘటన తీవ్రమయిన దయినా, చాటుదనం కలిగివున్నది. బట్టబయలుగా చెప్పలేదు. కత్తికి పెండ్లిచేసుకుంటే సమరాహ్వానం అని ఆవిడే అనుకోవాలి. తాను గౌరీవ్రతం పట్టింది. ఈగౌరీవ్రతం మొదలైన వ్యవహారము కాశీమజిలీలు - శుకసప్తతికథల్లోది. ఆభాండాగారంలో కత్తికి బాసికం కట్టడంకూడా వొక వివాహపద్ధతి. ఇది సమరాహ్వానమని యెవరనుకుంటారు? ఆవిడే అనుకోవాలి. అందుచేత ఆమె నిష్కల్మషాభిప్రాయం సారంగధరుడికి నచ్చేటట్లు చేయలేకపోయింది.

ఇట్టివి యింకా అనేకములైనవి కలిసే విషాదాంతనాటకమవుతుంది. ఈ నాటకానికి విషాదాంత నాటకలక్షణాలు చక్కగా పట్టినవి. ఆ పోయిన దారి కొంచెము వైతొలగటం—ఆ వైతొలక్కపోతే రహదారి— వైతొలగితే గోతిలో పడుట.

మనుష్యుడికి అధికారం లేని ఆపాత్రలయొక్క శీలస్వభావాదికముల ఆంతరచలనము వొక ప్రత్యేక రూపం పొంది, దానివలన విపరీతఫలం ప్రాప్తించడం-అది అల్లా జరగడానికి మనుష్యుడు కాడురా హేతువు-భిన్నప్రకృతులసంఘర్షణలో కలిగే వేరుపాట్లు-దానినే భగవంతు డంటాము. షేక్స్పియరు విషాదాంతనాటకములలోవలె ఛాన్సు (Chance) అందాము. దానివలన కథావసానం మారడం - పరిస్థితులలో గగ్గోలుపుట్టడం- విషాదాంతనాటకం. అల్లా సర్వథా యీ నాటకానికి సరిపోతున్నవి.

దీనిని యిట్లా వుంచితే, కవిప్రతిభ అనేక రకాలుగా వెలివరుస్తోంది. సారంగధరుడు భారతంలో వున్న యయాతి శంతను కథలకు తీసుకుని "హిమకరుతొట్టి పూరుభరతేశకురుప్రభు పాండుభూపతుల్ క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన వంశము" యొక్క లక్షణము రాజరాజుప్రవర్తనకు పట్టించుట - యిది గొప్పవూహాశాలిత్వము. శిల్పలక్షణము. Tess లో థామస్ హార్డి యిటువంటి లక్షణములు చూపించెను.

రెండవది నన్నయ్యపాత్రపోషణము. నన్నయ్య పూర్వనాటకమంతయూ వచ్చును. ఉత్తరనాటకమున నన్నయ్య కనిపించడు. కాని ఆయన ధర్మజ్యోతి సర్వత్ర ధగధగలాడుతూ కనిపిస్తుంది. ఇది యొక విశేషరచనాశక్తి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లె'లో సంగడిపాత్ర యిట్టిది.

ఈ నన్నయ్యను తీర్చిన తీర్పులో శాస్త్రిగారి సిద్ధహస్తము కనిపిస్తోంది. నన్నయ్యకి పిచ్చియెత్తిన దన్నక - సగంలో భారతం మానివేయడానికి సందర్భం కల్పించడం - 'కులబ్రాహ్మణు' డన్న శబ్దానికి అన్వర్థత్వం కల్పించడం — రాజున కెంత దర్జా వున్నదో, ధర్మానికి అంతదర్జా వుందని చూపించడం— నన్నయ్యసృష్టి రమ్యతరంగా వుంది !

నాటకం మొత్తంమీద ఆసురచనగా వుంది. కొన్నికొన్నిచోట్ల ఆగిచేసిన చేత కొన్నికొన్నిచోట్ల కనిపించడంలేదు.

క్రొత్తగా చిత్రాంగి రాజనగరం వచ్చింది. పదార్థంగం. మహారుద్రయ్యకీ, మల్లప్పకీ సంభావణ హాస్యరసంతో కూడి సేవకుడి ధర్మాన్ని, మహా

రుద్రయ్యయొక్క కట్టుబట్టాలని ప్రదర్శించే యీ రంగం మంచి గడుసుగా వుంది. ఇక్కడి సంభాషణా పద్ధతి ఏవుత్తమ నాటకపద్ధతికీ తీసిపోదు. "ఇప్పుడు నీమెడమీద వున్నది యేమిటో తెలుసా?" అని రుద్రయ్య అడిగితే మల్లప్ప "కొబ్బరిపుచ్చె బాబయ్యా!" అనడం యీ పైన చెప్పిన గుణాలన్నింటినీ సమకూరుస్తోంది. సంభాషణ అంతా యీరంగంలోకి మల్లే వుంటే నాటకం విలువ పట్టరానిదిగా వుండేది. ఒక మిత్రుడి విమర్శలో గౌరీవ్రతం మాటిమాటికీ చెప్పడం నాటకరచనకి వొక లోపంగా వున్నట్లు కనిపిస్తోంది. ఈవ్రతంమీద కవి తననాటకంయొక్క విషాదాంతత్వాన్ని ఆధారపెట్టాడు. దానియొక్క పౌనఃపున్యము కవివుద్దేశంలో నాటకప్రయోజనాన్ని, నాటకంలో జరిగిన విషాదాంతత్వలక్షణాన్ని బయటికి చూపించడంగా అయివుండవచ్చు. నిజానికి అన్నింటినీ మనస్సుతో పొసగించుకోవచ్చును.

ఏకావ్యంలో అయినా - ఏవిధంగానూ పొసగనివాటిని కాదనాలికాని ప్రతిదాన్నీ అనకూడదు. ఎందుకంటే కవి అసలు విమర్శకుడే. అతడూ తన కల్పనలని సరిచూసుకుంటూనే చేస్తాడు. కవికన్న విమర్శకుడు యెక్కువ బుద్ధిశాలి అనడం అంత నిజమయిన మాట కాదు. ఆకవి యితరుల పుస్తకాలని విమర్శించేటప్పుడు విమర్శకుడా? తన పుస్తకందగ్గర కాదూ? షేక్స్పియరు కాళిదాసుల రచనలలో వాళ్ల నాటకాలల్లో వున్న మహార్థాలు యింకా కొన్ని తెలుసుకోలేనివాళ్లు మిగిలివుండగా - యివ్వేమీ తెలియకుండా వాళ్లు రాశారనడంలో సామంజస్యం యేమి వుంది? వాళ్లు యెన్ని పతకాలు పన్ని కావ్యం చేస్తారు? అలాగా కవికూడా మనంటివాడు కాకపోయినా — వాడి పద్ధతిలో తను కావ్యం చేసేటప్పుడు బహుగా పరామర్శించే చేస్తాడు. ఆపరామర్శ విమర్శకన్న గొప్పది.

ఇట్లా వుండగా నాటకప్రయోగాన్ని గురించి వొకతగాదా. — ఈ కాలాన్నిబట్టి మూడుగంటల కెక్కువవుతుందనీ, పెద్దపెద్ద వుపన్యాసాలుంటే సామాజికులకి విసువు పుడుతుందనీ మొదలైన కొన్ని భావాలున్నయ్. స్వగతాలెక్కువ వుండకూడదనీ. ఒక స్వగతంతో నాలుగురంగాలు వ్రాయవలసిన అవసరం పోతుంది. దీని నాట యేం చెప్పారూ? ఒక వాదోపవాదం ఆనాటకానికి జీవగఱ్ఱ అవుతుంది. అది తీసేస్తే యెల్లాగా? కవి సంస్కరింపబడాలి. సామాజికు లక్కరలేదు. ప్రయోగించడమే వస్తే నేటి నటకులు కవి వ్రాసిన దసలు చదువుతారా? వాళ్ల స్వంతాలే వుపన్యసిస్తారు. నాటకం ప్రయోగించేటప్పుడు వాళ్ల అనుకూలంకొద్దీ వాళ్లే తగ్గించుకుంటారు. నాటకం యెప్పుడూ ఆడక్కేపడదు. ఎక్కువగా చదువనూపడుతుంది.



# కలగూరగంప

## డెపుంగ - ధాన్యకటకము

(టిబెట్టునందలి ఒక సంఘారామ విశ్వవిద్యాలయపు చరిత్ర)

[ప్రవాసి' అను బెంగాలీ మాసపత్రిక డిసెంబరు, 1949 సంచికలో 'విశ్వభారతి'కి సంబంధించిన శ్రీ విధుశేఖరశాస్త్రిగారు ప్రచురించిన వ్యాసమున కిది అనువాదము. మన ఆంధ్రదేశములోని ధాన్యకటకములోని ప్రాచీనవిద్యాలయమే ఈవిద్యాలయమునకు ఆదర్శమైయుండుట ఆంధ్రులు గర్వింపదగిన యంశము. ఆ 'గురుకుల' వివరములు ఇందులో విశదీకరింపబడి యున్నవి :]

"సంస్కృతంలో 'కులపతి' అనే మాట ఉంది. దాని అర్థం ఒక కుటుంబంయొక్క పెద్ద అని. కాని, అది ఇంకో విశేషభావాన్ని కూడా ద్యోతకం చేస్తుంది.౧ పదివేలమంది విద్యార్థుల్ని పోషిస్తూ, బోధ చేసేవాడని. ఇంతమందిని ఒకేచోట వుంచి ఉచితంగా విద్యగరపటం అనేది చాలా విచిత్రం అనిపించొచ్చు. కాని ఇది వాస్తవం. నలందా విశ్వవిద్యాలయంలో పదివేలమందికి తక్కువ కాకుండా ఉండిన విషయం మనకు నిశ్చితంగా తెలియవచ్చింది. అక్కడ ఇంతమంది ఉండటానికీ, చదువుకొంటానికీ తగిన ఏర్పాట్లు ఉండేవి. అలాంటి విశ్వవిద్యాలయం ఇప్పుడుకూడా టిబెట్టులో ఒకటి ఉంది. ఈ దేశం భారతదేశానికి సంస్కృతి- ధర్మవిషయాల్లో చాలా ఋణపడి ఉంది.

టిబెట్టులో చాలా మఠాలు (సంఘారామాలు) ఉన్నాయి. అవి ఎక్కువగా భారతదేశంలో ఉన్న వాటికి అనుకరణాలు. ఉన్నవాట్లో చెప్పుకోతగ్గవీ, పెద్దవీ నాల్గు. అవి :

(౧) డెపుంగ్ (బ్రాస్‌స్పున్స్) ధాన్యకూటక౩.

(౨) సిరా (సెరా) వనగులాబి ;

(౩) తసిఇహున్‌పో (బ్రకసిస్ ఇహున్‌పో) మంగళకూట.

(౪) గాడెన్ (దగఇడాన్) తుసిత.

క్రీ. శ. ౧౪౧౬ లో జామ్‌యాంగ్ కోర్జే, లేక మంజుఘోషధర్మస్వామి అనేఆయన ఈ డెపుంగును స్థాపించాడు; సెరా అనేదాన్ని క్రీ. శ. ౧౪౧౯ లో కంచెన్ కోర్జే, లేక౨ మహామైత్రేయ ధర్మస్వామి అనే ఆయన స్థాపించాడు; అదేసమయాన తసిఇహున్‌పో అనేదాన్ని గెదున్ దూప్‌పా, లేక సంఘసిద్ధి అనేఆయన స్థాపించాడు; క్రీ. శ. ౧౪౦౯ లో గాడెన్‌ను జెట్సాంగ్ ఖపలోజాంగ్ డాగ్‌పా అనే స్వామి సుమతికీర్తి అనే ఆయన స్థాపించాడు.

వీటిలోకల్లా ముఖ్యమైన డెపుంగునుగురించే నే నిక్కడ ప్రస్తావించేది. గాడెన్‌లో ౩,౩౦౦ మంది, తసిఇహున్‌పోలో ౪,౯౯౦ మంది, సెరాలో ౫,౫౦౦ మంది సన్యాసులు, లేక విద్యార్థులు ఉండే ఏర్పాటు ఉంటే, డెపుంగులో ౧౦,౦౦౦ మంది ఉండే ఏర్పాటు ఉంది. ప్రస్తుతం ఉన్నవారి సంఖ్య ౭,౭౦౦.

డెపుంగుకు మూలం ఆంధ్రదేశంలో ఉండిన ప్రాచీనడెపుంగుమఠం. అందువల్లనే దానికి ఆ పేరు.౧౦

శరత్ చంద్రదాసు డెపుంగునుగురించి (JASB., 1905 N. S. vol. I, p. 115) వ్రాస్తూ, తొమ్మిది కళాశాలలు విభిన్నమైన అపరా, పరా విద్యాశాఖల్ని బోధించేనిమిత్తం స్థాపకులు నిర్మించారు అన్నాడు. కాలక్రమంగా ఇది టిబెట్టులోకల్లా ముఖ్యమైన విద్యాకేంద్రమైంది. దేశం నాల్గుమూలల్నుంచీ తెలిసినవారూ, పండితులూ ఇట సమకూడేవారు. క్రమశిక్షణ, నైతికసంస్కృతి, పవిత్రజీవనము అనే విషయాల్లో డెపుంగుమఠ సన్యాసులు దేశంలో ఉన్న

---

౧. "మునీనాందశసాహస్రంయోఽన్నదానాదిపాలనాత్, అధ్యాపయతి విప్రర్షి స్సవై కులపతిః స్మృతః"

౨ - ౯. ఈటిబెట్టుభాషాపదాలు చైనాభాషలోకి పరివర్తితాలై విభిన్నరకాలుగా ఉచ్చరింపబడుతాయి.

౧౦. డెపుంగ్ సరిగ్గా ఉండిన స్థలం. చూ : **Watter, on Yuan Chwang, Vol II, P. 216.**

తదితర మతసన్యాసుల్ని మించిపోయేవాళ్లు. శీఘ్రంగా ఆ మఠం వృద్ధిపొంది ఏడుకళాశాలలున్న విశ్వవిద్యాలయాన్ని అంగీభూతం చేసుకొంది — దర్శన, తర్క, వైద్యశాస్త్రాలను బోధించటానికి. ఇంకో కళాశాల ఉండి మామూలు సంసారులకు పరావిద్యను బోధించేది.

క్రీ. శ. ౧౯౩౧ శేషప్రాంతంలో ఒక యువక - లామా (భ్లామా) 'గురువు' మంగోలియా నుండి విశ్వభారతికి వచ్చాడు. అతనిపేరు జేషే తుబ్ తెన్ షేరబ్. తుబ్ తెన్ షేరబ్ అనేదే అతని అసలు పేరు. దాని సంస్కృతరూపం మునిశాసన ప్రాజ్ఞ అనేది. జేషేఅనేది డెప్రుంగు విశ్వవిద్యాలయం అతని కిచ్చిన డిగ్రీ. కల్యాణమిత్ర అని సంస్కృతంలో. ఆయన చక్కటి పెద్దమనిషి; సంస్పర్శలోకి వచ్చినవాళ్లందరికీ ప్రేమపాత్రు డయ్యాడు. ఆయన నది ప్రౌఢపాండితి. అభిసమయాలంకార కారికలాంటి కఠినగ్రంథం ఏ మూలనుంచైనాసరే ఆయన వాక్యాల్ని ఉదాహరించి, వ్యాఖ్యానం చాలా చులకనగా చేసే వారు టిబెట్టు పాఠాంతరాల్ని.

ఆయన మంగోలియానుంచి వచ్చి టిబెట్టులో ఉన్న లాసా(=దేవభూమి)కు నాల్గుమైళ్లదూరంలో ఉన్న డెప్రుంగు విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ ఇరవై యేళ్లు విద్యార్థిగా ఉండి, ఉన్నతమైన జేషే, లేక కల్యాణమిత్ర అనే డిగ్రీని సంపాదించాడు. ఆయన విశ్వభారతిలో ఉన్న 'విద్యాభవనం'లో చేరాడు. ఇక్కడ చేసే పని పాళీ,సంస్కృతభాషల్లో ఉత్తమోత్తమమైన గవేషణ, పఠనలు. ఆయన కొక విశిష్టమైన ఆశయం ఉంది. పాళీలో ఉన్న బౌద్ధమతాన్ని గురించి ఆయనదేశంలో ఎవరికీ ఏమీ తెలియదట. దాన్ని అక్కడ ప్రవేశపెట్టాలని ఆయన ఉద్దేశ్యం. అందువల్ల ఆయన నాతో కలిసి పాళీత్రిపిటకాల్ని టిబెటియన్ భాషలోకి మార్చాడు. టిబెట్టుభాషలో సంస్కృతగ్రంథానువాదకుణ్ణి 'లోట్సబా' అంటారు; పండితుణ్ణి 'పాన్' అంటారు. పూర్వం ఒక టిబెట్టు దేశీయుడూ, ఈ దేశపు సంస్కృతపండితుడూ కలిసే అనువాదాల్ని చేసేవారు. ఇద్దర్నీ కలిపి 'లోపాన్' అంటారు. 'లో' అనువాదకుణ్ణీ, 'పాన్' పండితుణ్ణీ సూచిస్తుంది. ఆయన 'లోట్సబా' గాను, నేను 'పాన్' గాను వ్యవహరించాము.

మన సంస్కృతపాఠశాలల్లో ఉండే రీతే అక్కడా ఉందని ఆయన చెప్పాడు. విద్యార్థులు పరస్పరం విషయాల్ని గురించి ఆలోచించుకోడానికి ప్రోత్సాహమిస్తారట. ఆయన తమవిద్యాలయాన్ని గురించి ప్రసంగించేటప్పుడు నాదగ్గర వుంటూఉన్న సుజిత్ కుమారముఖోపాధ్యాయులు కొంత 'నోట్సు' తీసుకున్నాడు. దాన్ని నేను ఇక్కడ సంతోషపూర్వకంగా ఉపయోగిస్తున్నాను.

ఒక్కొక్కగదిలో ఒక్కొక్క విద్యార్థి ఉంటాడు. విద్యార్థులు చాలా దేశాల్నించి వస్తూ వుంటారు. వాళ్లు ఆ యా దేశస్థుల కేర్పడ్డ విభాగాల్లో ఉన్న గదుల్లో ఉంటూఉంటారు.

ప్రవేశానికిగాను కొన్ని విధులున్నాయి. అబౌద్ధులకు ప్రవేశం నిషిద్ధం. బౌద్ధులైనా సన్యాసులో, లేక సన్యాసంపుచ్చుకోబోయేవాళ్లో అయిఉండాలి. జెస్తలు, నావికులు, కమ్మర్లు, కసాయివాళ్లూ బౌద్ధులైనా, నిమ్నజాతులకు చెందటంచేత, చేర్చుకోబడరు.

విద్యార్థులు ఉండటానికీ, తినటానికీ అయ్యే ఖర్చులుగాని, జీతంగాని పెట్టుకోవల్సిన అవసరంలేదు. సంస్థే అన్నిటినీ భరిస్తుంది.

చిన్నపిల్లల్ని - ఆరులగాయతు పన్నెండేళ్లలో ఉన్నవాళ్లని- వేరే విడిగా సన్యాసులఅదుపుకి ఇస్తారు. వాళ్ల శిక్షణ అయింతరవాత — దీనికి రెండుమూడేళ్లు పడతాయి — పెద్దపెద్ద లామాలదగ్గర పరీక్షకు నిలబెడ్తారు. నెగ్గితే సన్యాసపూర్వ శిక్షణకోసం మఠంలో ప్రవేశపెడతారు.

నాలుగు పెద్ద డిగ్రీ పరీక్షలు ఉన్నాయి. నాలుగు, ఏడు, పన్నెండు, ఇరవై ఏళ్లుగా వీటికి చదవాలి. వీటన్నింట్లోకి పెద్దదైన డిగ్రీపరీక్ష లాసాలో ఉన్న జోఖాంగ్ (గర్భమందిరము)లో డెప్రుంగ్ మొదలైన నాల్గువిశ్వవిద్యాలయాలకి చెందిన పండితపరిషత్తుముందట జరుపబడుతుంది."

శ్రీ పూర్ణానంద.



# విమర్శనము



## కుమారవ్యాకరణములు

( I, II, III ఫారములు )

రచయిత: శా. ఆరుమ్గంపిళ్లె గారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, ముత్యాలపేట హైస్కూలు, మద్రాసు. ప్రకాశకులు: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మద్రాసు.

ఈ మూడు పుస్తకములు నీట నొక్క చిన్ని రాతిని వేసినప్పుడు పుట్టునట్టి తరంగవృత్తపరంపరవలె, నొకటికంటె నొకటి విస్తృతి గన్పరచుచు, విషయములను విశదీకరించుచు మెట్టుమెట్టుగా బోధించు నవీన బోధనాపద్ధతిని వ్రాయబడియున్నవి. ఆయాయి చోట్ల మన పూర్వపు మార్గమయిన ఆకాంక్షాపద్ధతియు నవలంబింపబడియున్నది.

ఆంధ్రమునకు జరిత్రాంశసంబద్ధ లక్షణ గ్రంథము లింకను వెలువడలేదు. వ్యాకరణశాస్త్రము లిప్పటివఱకు సాంస్కృతికపరిభాషానిబద్ధమై, తద్విధానానుసరణములై యుప్పారుచుండుటవలన తెలుగువ్యాకరణవిద్యార్థులకు వ్యాకరణపాఠ మన్న చో పేరండ తైలాస్వాదనప్రాయముగ నుండుట యందు వింత లేదు. కాని, వర్తమానవ్యాకర్తలు వీలయినంతవఱకు నధునాతన భాషాలక్షణగ్రంథములను సులభగ్రాహ్యములగునట్లు లొనర్చుటకు బ్రయత్నించుచున్నారు. అందులో నీ కుమారవ్యాకరణకర్త యొక్కడు.

కుమారవ్యాకరణములందు మూడు గ్రంథములందును, బాలుర యోగ్యత ననుసరించి, రచయిత చక్కని విశదీకరణమార్గము నవలంబించియున్నారు. పెక్కుపట్టులందు, విధిలేని చోట్లయందు దప్ప, సాంస్కృతికపరిభాషాపదములను చక్కగా నాంధ్రీకరించి తేటతెల్లముగా వివరించుచు వ్రాసియున్నారు. ఈ సౌలభ్యము వారి బోధనవ్యవసాయానుభవమును జెప్పక చెప్పుచున్నది. అచ్చటచ్చట నాంగ్లేయ వ్యాకరణపద్ధతుల నవలంబించియుండుటచే విద్యమాన విద్యార్థులకా భాషావిషయములతో జోడించి చూచుట కనువుగా నుండును.

ఈకుమారవ్యాకరణములు ఆంధ్రకుమారుల వ్యాకరణజ్ఞానార్జన కనువుపడునట్లు విద్యాశాఖాధికారులు మన్నింతు రని విశ్వసించుచున్నాము.

---

## విద్యాధర

[ పక్షపత్రిక ]

సంపాదకుడు: జైనశాస్త్రవిశారద జె. నాగోపాధ్యాయ గారు, అత్రేయాశ్రమం, ద్వారపూడి. వార్షికమూల్యము ౩ రూ. విడిపత్రిక రెండుఅణాలు.

విద్యమాన రాజకీయేతరములగు సమస్త విషయములమీదను నిష్పాక్షికముగా చర్చలు సాగించుటకై ఇది పూనకొన్నట్లు నిర్వాహకులు పత్రికాదిని చెప్పకొన్నను ముఖ్యముగా ఇందు సాంఘికవిమర్శలకే ఎక్కువ తావున్నట్లు మొదటిసంచిక తెలుపుచున్నది. సాంఘికవిమర్శలుకూడ ప్రస్తుతము చాల అవసరమైనవే కాని వ్యక్తిదూషణలతోను, వ్యక్తిపరముగాను అవి యుండుటమాత్రము అపేక్షణీయమైనదిగాదు. అటు

వంటి వ్యక్తిచింత స్వతంత్ర తనవిమర్శలను సాగిం చునని నమ్ముచున్నాము.

---

## కథలు - పాటలు

నవ్యకళా ప్రచురణ. వెల ౧ అణా. ౧౬ పేజీల లఘుగ్రంథము. ప్రకాశకులు: నవ్యకళా ప్రచురణాలయం, నరసారావుపేట.

ప్రతిపక్షము క్రొత్తరచనలు సేకరించి, ఇటువంటి లఘుగ్రంథరూపమిచ్చి ప్రచురింపవలెనని ప్రకాశకుల ఆశయము. సారస్వతములోని క్రొత్తదనమును, పరివర్తనమును ఈ రచనలలో ప్రతిబింబింపజేయవలెనని నిర్వాహకుల సంకల్పము. ప్రస్తుత గ్రంథములో రెండు కవితారచనలు, ఒక గల్పిక, ఒక కథానిక ఉన్నవి. పెద్ద పరివర్తనమేమియు లేకున్నను క్రొత్తదనమున మాత్రము ఇవి కొంత దారిలో పడినట్లే యున్నవి.

---

## బ్రాహ్మణమహిమ - నమస్కృతి

ద్వారపూడి ఆత్రేయాశ్రమ ప్రకటనము. క్రౌను ౩౨ పుటల సైజులో ౫౮ పుటలు. వెల మూడణాలు. రచయిత: అంకరాజు సుబ్బరాయ శర్మగారు. బ్రాహ్మణుల గొప్పదనమును ప్రశంసించు పంచాశద్వాక్యావళి ఈ చిన్న పుస్తకరూపమును దాల్చినది.

---

# గ్రంథస్వీకారము

## కావ్యజగత్తు

రచయిత: బి. వి. కృష్ణరావుగారు. ప్రకాశకులు: రాడికల్ పబ్లికేషన్సు, తెనాలి. వెల రూ. ౧.

---

## ముముక్షుప్పడి అను తిరుమంత్రార్థము

ఆంధ్రీకర్త: ధనుష్కరం రామానుజాచార్యులుగారు, ఆలపాడు, గుంటూరుజిల్లా. క్రౌను సైజున ౧౧౦ పుటలు. వెల తెలియదు.



---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

